## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010006002

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్

శ్రీ సద్గురుభ్యో నమః

శ్రీ మార్కండేయమహాపురాణాంతర్గత

# మదాలసా చరిత్రము

అనువాదము :

[illegible]

సాహిత్యశిరోమణి.




మొదటికూర్పు : 1000 ప్రతులు.

చిత్తూరు

[illegible]

దీని వెల ] 1958 [ రూ. **2—8—0.**

వలయువారు యీ క్రింది విలాసమునకు వ్రాసిన బడయగలరు :—

మేనేజరు - శ్రీవ్యాసాశ్రమము, వ్యాసాశ్రమం పోస్టు,
(వయా) ఏర్పేడు. చిత్తూరుజిల్లా. (ఆంధ్రప్రదేశ్)

ఓమ్

# విషయసూచిక


పీఠిక ... 1

గ్రంథారంభము – ఋతధ్వజమహారాజు జననము, బాల్యక్రీడలు ... 9

ఋతధ్వజుని జూచుటకు అశ్వతరునను నాగరాజకుమారు లిరువురువచ్చుట 10

తండ్రి వారివలన ఋతధ్వజుని చరిత్ర విని అతని గుణములను శ్లాఘించుచు వాని కేదేని ఉపకృతి చేయనెంచుట ... 13

ఋతధ్వజుని అభీష్టము నెరిగించుటకై తండ్రికి అతని వృత్తాంతమును నాగకుమారులు చెప్పుట – గాలవమహర్షి వృత్తాంతము ... 16

ఋతధ్వజుడు రాక్షసుని వెంబడించుచు పాతాళమునకువచ్చుట ... 21

మదాలసావృత్తాంతము ... 22

ఋతధ్వజుడు మదాలసను వివాహమాడుట ... 29

కుండలియను మదాలస చెలికత్తె దాంపత్యధర్మముల నెరింగించుట ... 30

ఋతధ్వజుడు భార్యతోగూడ తన పట్టణమునకువచ్చి తండ్రికినమస్కరించుట 33

తండ్రియగు శత్రుజిత్తు కుమారునకు నీతులను గరపుట ... 34

ఋతధ్వజుడు ప్రజారక్షణార్థము పరిభ్రమించుచు తాళకేతువనురాక్షసునిచేత మోసగింపబడుట ... 37

ఋతధ్వజుడు తన నిమిత్తము మదాలస మరణించెనని విని విలపించుచు జీవితములో మరియొకస్త్రీని పెండ్లాడనని ప్రతిజ్ఞజేయుట ... 47

మదాలసను పునరుజ్జీవింప జేయుటకై అశ్వతరుడు సరస్వతీదేవిని గురించియు, ఈశ్వరుని గురించియు తప మొనరించుట ... 50

సరస్వతీదేవి ప్రత్యక్షమై అశ్వతరునకు కోరినవరము నిచ్చుట ... 54

ఈశ్వరుడు అశ్వతరుని తపస్సునకుమెచ్చి అభీష్టము లొసంగుట ... 55

నాగకుమారులు ఋతధ్వజుని తమ లోకమునకు రమ్మని కోరుట ... 58

ఋతధ్వజుని పాతాళలోకాగమనము ... 61

అశ్వతరుడు మదాలస మరల బ్రతికిన తెఱంగుజెప్పి ఋతధ్వజున కొసంగుట 69

ఋతధ్వజునకు మదాలసయందు పుత్రులు జన్మించుట, జోలపాట నెపమున మదాలస మొదటి మువ్వురు పుత్రులను ఆత్మజ్ఞానులనుగా జేయుట ... 73

భర్తకోరికపై మదాలస కడసారి పుత్రుడగు అలర్కునకు రాజధర్మములను, ఆత్మధర్మములను యెరింగించుట ... 80

22. అలర్కుడు రాజ్యపాలనము చేయుచు భోగలాలసుడగుట ... 89
23. అలర్కుడు భోగలాలసుడగుట విని అతనియన్నయగు సుబాహువు అలర్కునికి ఆత్మబోధల జేయవలెనని యెంచి కాశీరాజు నాశ్రయించి అతనిపై దండెత్తించుట ... 90
24. శత్రువుచేత చిక్కిన యలర్కుడు దిక్కుదోచక తన తల్లి యిచ్చిన ఉంగరమును స్మరించి అందలి విషయమును పఠించుట ... 92
25. అలర్కుడు దత్తాత్రేయమునీంద్రు నాశ్రయించుట ... 93
26. దత్తాత్రేయుడు అలర్కునకు తత్త్వోపదేశము చేయుట ... 98
27. దత్తాత్రేయమునీంద్రుడు అలర్కునకు యోగస్వరూపము నెఱింగించుట 100
28. అలర్కుడు తత్త్వజ్ఞానమునుపొంది దత్తాత్రేయమునీంద్రునిచేత అనుజ్ఞాతుడై కాశీరాజుకడకువచ్చుట ... 126
29. అలర్కుడు కాశీరాజునకు తత్త్వమార్గమును దెలుపుట ... 128
30. సుబాహువు తన నిజ కథనమును జెప్పుట ... 129
31. అలర్కుడు తన కుమారుని రాజ్యాభిషిక్తునిజేసి తపమునకై వనమున కేగుట 134
32. ఫలశ్రుతి ... 136

స మా ప్త ము

---

ఓమ్

# మదాలసాచరిత్రము

## పీఠిక



వేదములలో, ఉపనిషత్తులలో, స్మృతులలో, యోగవాసిష్ఠాది గ్రంథములలో ఆర్ష కాలమున, వేదకాలమున అనేకమంది నారీమణులు వేదములోను, వేదాన్తములోను, యోగములోను, తపస్సునందును ఉన్నతస్థానమును పొందినట్లు వినుచున్నాము. బ్రహ్మచర్యాశ్రమములోనుండి వేదవేదాంగాది శాస్త్రములలో ఉత్తీర్ణయయిన వచక్నుని పుత్రియగు గార్గిపేరు బృహదారణ్యకోపనిషత్తునందు కనపడుచున్నది. భారతమునందు సులభ జనకసంవాదమను నొక కథగలదు. అందు సులభ మహాబ్రహ్మవేత్తయగు జనకమహారాజుతో బ్రహ్మవిద్యను గురించియు, యోగమును గురించియు, అణిమాద్యష్టసిద్ధులను గురించియు వాదించినట్లు తెలియవచ్చుచున్నది. ఈ యమ్మ సన్యాసిని. ఇందువల్ల నారీమణులకు బ్రహ్మచర్యాశ్రమమునందును, సన్యాసాశ్రమమునందును వేదకాలములో అధికారము కలిగియున్నట్లు స్పష్టమగుచున్నది. గార్గి బ్రాహ్మణకన్యక, సులభ క్షత్రియ కన్యక. బ్రహ్మచర్యమునుండి సన్న్యసించెను. యాజ్ఞవల్క్య మైత్రేయి సంవాదము బృహదారణ్యకోపనిషత్తునందు గలదు. యాజ్ఞవల్క్యమహర్షికి యిద్దరు భార్యలుండిరి. మొదటి భార్యపేరు మైత్రేయి, రెండవ భార్యపేరు కాత్యాయని. మైత్రేయి కొంత కాలము భర్తతో గృహకృత్యము నిర్వహించుచునే తీవ్రమైన వైరాగ్యము కలిగి భర్త యగు యాజ్ఞవల్క్య మహర్షివల్లనే బ్రహ్మోపదేశమును పొంది సన్న్యసించెను. ఇంకను బ్రహ్మవిద్యలో ఋషిత్వమును పొందిన పెక్కుండ్రు నారీరత్నముల పేర్లుగలవు. ఋషియనగా ఋగ్వేదాది మంత్రములను కనుగొనినవారు లేక వేదఋక్కులను పఠించి వేదపురుషుడగు పరబ్రహ్మమును యెరింగినవారనియు అర్థము. హృషీకములు – అనగా మానసాదీంద్రియములు: వీనిని జయించి ఇంద్రియములకు అతీతమగు పరమాత్మను కనుగొనినవారనియు అర్థముగలదు. ఇంకను ఋషిశబ్దమునకు అనేకార్థములుగలవు. అది యట్లుండుగాక. మైత్రేయి, సులభ, గార్గి, చూడాల, తపస్విని, విశ్వవర, కాత్యాయని, మదాలస మొదలగు విదుషీమణులు వేద వేదాంగాది శాస్త్రములలో ఆరితేరిన వారలని శాస్త్రము ప్రమాణము నిచ్చుచున్నది. వీరలలో మైత్రేయి, సులభాయోగిని, గార్గి వైరాగ్యసంపన్నులై ముక్తులైనవారు. అదంత గొప్ప సంగతికాదు. గృహస్థాశ్రమములోనుండి భర్తృ సపర్య చేయుచు సంతానమును కనియుండియు, బ్రహ్మవిద్యయందు ఆరితేరి మోక్షమును పొందుట విశేషమనవలయునుగదా? అట్టివారలలో ఒకరు చూడాల.

వీరి చరిత్రము యోగవాసిష్ఠమున విస్తారముగ వసిష్ఠమునీంద్రులు విశదీకరించియున్నారు. రెండవవారు మదాలస. వీరి నామమును వినినవారు చాలతక్కువగానే యుందురు. వీరి చరిత్రము కాశీమజిలీ అను గ్రంథములో కొంతవరకు సంగ్రహముగా చెప్పబడియుండినను విస్తారముగా యిదివరకు యెవ్వరును విశదీకరించియుండినట్లు లేదు. ఈ మదాలస చరిత్రము మార్కండేయమహాపురాణమున పదునెనిమిదవ అధ్యాయమునుండి నలువది ఒకటవ అధ్యాయమువరకు సంపూర్ణముగా కనంబడును. సంస్కృతములోనుండు మార్కండేయ మహాపురాణమునుండి పూర్తిగా యెవరున్ను యింతవరకు ఆంధ్రభాషలో అనువదించినట్లు కనబడని కారణమున ఆ కొరతను పూర్తిచేయుటకొరకు మదాలసాచరిత్ర మను యీ గ్రంథమును అనువదించుటకు హేతువైనది. ముముక్షువుల కిది యెంతయో యుపయుక్తమైనది. మరియు ముఖ్యముగా స్త్రీలందరును యిట్టి గ్రంథమును చదివి ఆత్మజ్ఞానమును పొందుటకు యిది యెంతో సహకరించుననియు తలంపు. బ్రహ్మవేత్తలు యెందరో విరక్తులై, సన్న్యాసులై, తపస్వులై, యోగనిష్ఠాపరులై యుండినను, జనకచక్రవర్తికి గలిగిన గౌరవము పైజెప్పినవా రెవరికిన్ని గలుగకపోవుటకు కారణమేమి? పైన పేర్కొన్న వారు విరక్తులైనవారగుటచే అట్టివారు ముక్తులైరనుట అంత గొప్ప సంగతిగాదు. జనకమహారాజో గృహస్థాశ్రమములోనుండి మోక్షమును పొందినవారగుటవల్ల అంత గొప్ప విఖ్యాతిని బడయుటకు కారణము. అలాగున పైనుదహరించిన విరక్తిమార్గము నవలంబించిన నారీమణులు జీవన్ముక్తిని పొందుట అంత గొప్పసంగతికాదు. చూడాలయు, మదాలసయు గృహస్థాశ్రమములోనుండి బ్రహ్మప్రాప్తి గలవారైనందుచే వీరి ఉభయులకు యింత విఖ్యాతి గలుగుటకు కారణము. చూడాలచరిత్రమునందు సంతానమును యెట్లు జ్ఞానవంతముగా చేయవలెనో, ఆ విషయమై యెక్కువ ప్రయత్నము చేసినట్లు కనబడుటలేదు. మదాలసయన్ననో, తన గర్భమున పుట్టిన బిడ్డలను జోలపాటల నెపమున ఉగ్గుపాలతోనే బ్రహ్మజ్ఞాన సంపన్నులనుగా మార్చివేసెను. ఆ గాథ దీనిలో విపులముగా వర్ణించబడినది. శిఖిధ్వజమహారాజుయొక్క ధర్మపత్ని చూడాల; మదాలస ఋతధ్వజ మహారాజు సహచారిణి. వీరుభయులున్ను క్షత్రియవంశములో జన్మించినవారేగాక గొప్ప రాజ్యమును సహ పాలించినవారు. వేదకాలమున స్త్రీలెంత విజ్ఞానవతులై యుండిరో యిట్టి చరిత్రల మూలమున తెలియగలదు. గార్గిని గురించి బృహదారణ్యకోపనిషత్తునందు పంచమాధ్యాయములో అష్టమబ్రాహ్మణమునందు విస్తారముగా చెప్పబడియున్నది. జనకమహారాజు గొప్ప యజ్ఞమును ప్రారంభించి దేశదేశములలోగల ఋషులను, పండితులను ఆహ్వానించి, సువర్ణాలంకృతములగు వేయి గోవులను దూడలతో సహ తెచ్చిపెట్టి ఆ సభలోనుండు ఋషి, ముని, పండితగణముల మధ్యనిలచి "మీలోనెవరు బ్రహ్మవేత్తలుగా నుంటున్నారో, అట్టివారికొరకు యీ గోవులను దానమివ్వదలంచితిమని ఉచ్చైస్స్వరమున పలుకగా, ఆ సభలో "నేను బ్రహ్మవేత్త"నని చెప్పు

టకు యెవరున్ను సాహసింపక అందరు మౌనముగా నుండగా, యాజ్ఞవల్క్య మహర్షి లేచి ఆ గోవులను తన ఆశ్రమమునకు తోలుకొనిపొమ్మని శిష్యునకు చెప్పెను. అప్పుడా సభలో "ఇంతమంది మహర్షులు, పండితోత్తములుండగా నీవు మాత్ర మెట్లు బ్రహ్మవేత్త వైతి"వని అశ్వలుడు మొదలగువారలు అనేకప్రశ్నలువేసిరి. అన్నిటికిని సావధానముగా సమగ్రముగా — యాజ్ఞవల్క్యుడు సమాధానము చెప్పినపిమ్మట మరియెవరున్ను ప్రశ్నింపక మిన్నకుండిరి. అట్టిసమయమున గార్గి లేచి యీ క్రింది విధముగా వచించెను.

**ఉ॥ అథాహ వాచక్నవ్యువాచ బ్రాహ్మణా భగవన్తో హంతాహమిమం ద్వౌ ప్రశ్నౌ ప్రక్ష్యామి, తౌ చేన్మే వక్ష్యతి, న వై జాతు యుష్మాకమిమం కశ్చిద్బ్రహ్మోద్యం జేతేతి పృచ్ఛ గార్గీతి ॥**

తా॥ పూజ్యులగు నో బ్రాహ్మణులారా! మీరంగీకరించితిరేని నేను యీ యాజ్ఞవల్క్యుని రెండు ప్రశ్న లడిగెదను. ఆ ప్రశ్నలకు యాజ్ఞవల్క్య డుత్తరమిచ్చినయెడల మీలో యెవరును బ్రహ్మసంబంధవాదమున యీతనిని జయింపజాలరు అని పలికి బ్రాహ్మణులను ప్రార్థింపగా, బ్రాహ్మణులు ఓ గార్గీ! ఆ ప్రకారమే అడుగుమా అని పలికిరి.

**ఉ॥ సా హోవాచం వై త్వా యాజ్ఞవల్క్య, యథా కాశ్యో వా వైదేహో వోగ్రపుత్ర ఉజ్జ్యం ధనురధిజ్యం కృత్వా ద్వౌ బాణవంతౌ, సపత్నాతివ్యాధినౌ, హస్తే కృత్వోపో త్తిష్ఠేదేవమేవాహం త్వాం ద్వాభ్యాం ప్రశ్నాభ్యాముపోదస్థాం తౌ మే బ్రూహీతి, పృచ్ఛ గార్గీతి ॥**

తా॥ ఇట్లు గార్గి బ్రాహ్మణానుజ్ఞను పొంది యాజ్ఞవల్క్యుని యిట్లడిగెను. ఓ యాజ్ఞవల్క్యుడా! కాశీ విదేశములయందైన శూరవంశమునందు పుట్టిన రాజపుత్రుండు ధనుస్సు నెక్కుబెట్టుకొని శత్రువులను వ్యధపెట్టునట్టి రెండు మంచిబాణములను హస్తమునం దుంచుకొని యెట్లు శత్రువును సమీపించెనో, ఆ ప్రకారముగానే నేను నిన్ను శ్రేష్ఠములగు రెండుప్రశ్నలతో సమీపించుచున్నాను. నీవు బ్రహ్మవేత్తవైతివేని ఆ ప్రశ్నలకు సమాధానమును చెప్పుమా! అని గార్గి యడుగగా, ఓ గార్గీ! అట్లే ప్రశ్న చేయుమా యని యాజ్ఞవల్క్యుడు పలికెను.

ఈ విషయము విపులముగా బృహదారణ్యకోపనిషత్తున చూడవచ్చును. రెండవది సులభనుగూర్చి — ఈమె చరిత్ర మహాభారతమునందలి శాంతిపర్వమున జనకసులభా సంవాదమున కనబడుచున్నది.

యుధిష్ఠిర ఉవాచ = ధర్మరాజు అడిగెను.

శ్లో॥ అపరిత్యజ్య గార్హస్థ్యం కురు రాజర్షిసత్తమ।
కః ప్రాప్తో వినయం బుద్ధ్యా మోక్షతత్త్వం వదస్వ మే ॥

తా॥ ఓ పితామహా! భీష్మా! గృహస్థధర్మమును విడువక స్వబుద్ధిచే మోక్షతత్త్వమును పొందినవా డెవ్వడైనగలడా?

భీష్మ ఉవాచ = భీష్ముడు సమాధానమిచ్చెను.

శ్లో॥ అత్రాప్యుదాహరంతీమమితిహాసం పురాతనం।
జనకస్య చ సంవాదం సులభాయాశ్చ భారత ॥

తా॥ ఓ ధర్మరాజా! ప్రాచీనమగు జనకసులభాసంవాదమును యిందు కుదాహరణముగా తెలుపుదురు.

శ్లో॥ సన్న్యాసఫలకః కశ్చిద్బభూవ నృపతిః పురా।
మైథిలో జనకో నామ ధర్మధ్వజ ఇతి శ్రుతః ॥

తా॥ పూర్వము మిథిలాపతియగు జనకుడు ధర్మధ్వజుడని ప్రసిద్ధుడై సన్న్యాసఫలమును పొందియుండెను.

శ్లో॥ స వేదే మోక్షశాస్త్రే చ స్వే చ శాస్త్రే కృతాగమః।
ఇంద్రియాణి సమాధాయ శశాస వసుధామిమామ్ ॥

తా॥ అతడు వేదమునందును, వేదాంతమునందును, రాజనీతియందును నిపుణుడై ఇంద్రియములను లోబరచుకొని యీ భూమిని పాలించుచుండెను.

శ్లో॥ తస్య వేదవిదః ప్రాజ్ఞాః శ్రుత్వా తాం సాధువృత్తతాః।
లోకేషు స్పృహయంత్యన్యే పురుషాః పురుషేశ్వర ॥

తా॥ వేదజ్ఞుడగు అతని సత్ప్రవర్తనమును పండితులు సయితము ఆదర్శముగా నుంచుకొనిరి.

శ్లో॥ అథ ధర్మయుగే తస్మిన్ యోగధర్మమనుష్ఠితా।
మహీమనుచచారైకా సులభా నామ భిక్షుకీ ॥

తా॥ అంతట నా ధర్మయుగమున యోగానుష్ఠానముగల "సులభ" యను ఒక సన్న్యాసిని భూమియందంతటను సంచరించుచుండెను.

శ్లో॥ తయా జగదిదం కృత్స్నమటంత్యా మిథిలేశ్వరః।
తత్ర తత్ర శ్రుతో మోక్షే కథ్యమానస్త్రిదండిభిః ॥

తా॥ అచ్చటచ్చట సన్యాసులచే ఆమె జనకుని ధర్మ మాత్మ్య ప్రవర్తనమును వినెను.

శ్లో॥ సాఽతిసూత్మ్యాం కథాం శ్రుత్వా తథ్యం నేతి శశంసయా।
దర్శనే జాతసంకల్పా జనకస్య బభూవ హా॥

తా॥ ఆమె ఆ విషయమున శంకగలదియై జనకుని చూడదలచెను.

శ్లో॥ తత్ర సా విప్రహాయాథ పూర్వరూపం హి యోగతః।
అబిభ్రదనవద్యాంగీ రూపమన్యదనుత్తమమ్॥
చక్షుర్నిమేషమాత్రేణ లఘ్వస్త్రగతిగామినీ।
విదేహానాం పురీం సుభ్రూర్జగామ కమలేక్షణా॥

తా॥ అంతట నా సులభ యోగప్రభావమున పూర్వరూపమును విడచి, అతి సుందరాకారమును ధరించి రెప్పపాటు కాలములో మిథిలానగరమునకు వచ్చెను.

శ్లో॥ సా ప్రాప్య మిథిలాం రమ్యాం ప్రభూతజనసంకులాం।
భైక్షచర్యాపదేశేన దదర్శ మిథిలేశ్వరమ్॥

తా॥ మిగుల జనసంకులమును, అతి సుందరమునైన ఆ నగరమున భిక్షాటన నెప మున ఆమె జనకుని దర్శించెను.

శ్లో॥ రాజా తస్యాః పరం దృష్ట్వా సౌకుమార్యం వపుస్తదా।
కేయం కస్య కుతో వేతి బభూవాగతవిస్మయః॥

తా॥ జనకుడును ఆమె సౌకుమార్యమును వీక్షించి యీమె యెవరు? ఎవరి సంబంధురాలు? ఎచ్చటినుండివచ్చెను? అని ఆశ్చర్యపడెను.

శ్లో॥ తతోఽస్యాః స్వాగతం కృత్వా వ్యాదిశ్య చ వరాసనం।
పూజితాం పాదశౌచేన వరాన్నేనాప్యతర్పయత్॥

తా॥ అంతట నా జనకుడు ఆమెకు స్వాగతమిచ్చి, పీఠమొసగి పాదప్రక్షాళన మొనరించి మృష్టాన్నము నొసగెను.

శ్లో॥ అథ భుక్తవతీ ప్రీత్యా రాజానం మంత్రిభిర్వృతం।
సర్వభాష్యవిదాం మధ్యే చోదయామాస భిక్షుకీ॥

తా॥ సులభయు భోజనానంతరము మంత్రులతోడను, సర్వభాషల నెరింగిన వేదాన్తులతోను గూడుకొనియున్న జనకుని మనస్సును యోగప్రభావముచే ప్రవేశించెను.

శ్లో॥ సులభా త్వస్య ధర్మేషు ముక్తో నేతి శశంసయా।
సత్వం సత్త్వేన యోగజ్ఞా ప్రవివేశ మహీపతేః।
నేత్రాభ్యాం నేత్రయోరస్య రస్మీన్ సంయమ్య రస్మిభిః।
సా స్మ సంచోదయిష్యంతీ యోగబంధై ర్బబంధ హ।

తా॥ అట్లు జనకుని మనస్సును యోగప్రభావముచే ప్రవేశించి, నేత్రములను తన నేత్రములచేతను, చూపులను తన చూపులచేతను యోగశక్తిచే బంధించెను.

శ్లో॥ జనకోప్యుత్స్మయన్ రాజా భావమస్యా విశేషయన్।
ప్రతిజగ్రాహ భావేన భావమస్యా నృపోత్తమ।

తా॥ జనకమహారాజు నవ్వుచూ, ఆమె భావమును తెలుసుకొన్నవాడై, ఆమె భావమును తన భావముతో గ్రహించెను.

శ్లో॥ తదేకస్మిన్నధిష్ఠానే సంవాదః శ్రూయతామయం।
ఛత్రాదిషు విముక్తస్య ముక్తాయాశ్చ త్రిదండికే।

తా॥ రాజ్యచిహ్నములను ధరించి ముక్తుడైన జనకునకును, సన్న్యాస చిహ్నములను ధరించి ముక్తురాలగు సులభకును యీ క్రింది విధముగా సంవాదము జరిగెను.

ఇచట దీని నింత వివరించుట పాఠకుల యభిరుచికొరకే, స్త్రీలకుగల పాండితీపటిమను నిరూపించుటకే స్థాలీపులాకన్యాయమున యీ మాత్రము నిరూపింపబడినది. విస్తారముగా చూడదలచువారు మహాభారతమునందు శాంతిపర్వమున చూచుకొనవచ్చును. మరియు వేదములలో పేర్కొనిన విదుషీమణుల పేరులను చూడుడు.

పరిశ్రమ చేయక యెవరును పవిత్రులు గాజాలరను తత్త్వమును మనస్సులో నిడుకొనియే సామాన్యవిద్యయందుగాని, సంస్కృత విద్యయందుగాని, వేదవిద్యయందుగాని, బ్రహ్మవిద్యయందుగాని ప్రవేశింపవలయునని వారి చరిత్ర ఋజువు చేయుచున్నది. కక్షీవంతుని పుత్రిక ఘోషయను నామె ఋగ్వేదము దశమ మండలములోని అనేక సూక్తులకు ఋషిక. ఈమెయేగాక అదితి, గోదా, నదీ, యమీ, శశ్వతీ, సరమా, సూర్యా, ఊర్వశీ, ఆత్రేయీ ప్రభృతులెందరో వేదవిదుషీమణులు వేదమంత్రద్రష్టలుగా కనపడుచున్నారు. ఈ గ్రంథము ప్రారంభములో మొదట నాలుగు అధ్యాయములలో అంత వైరాగ్య యోగజ్ఞానములను గురించి కనుపించదు. కాని అచ్చటచ్చట అవసరమగు నీతులు లేకపోలేదు. అందువల్ల విరక్తులైనవారికి ప్రథమమున నిరాశ జనింప నక్కర లేదు. అచ్చటచ్చట యీ నాలుగు అధ్యాయములలోగూడ ధర్మవిషయము లనేకములు

గలవు. వాటిని మనము జీవన్ముక్తి సౌధమునకు సోపానములుగా గ్రహించుకొనిన చాలును. ఇది వ్రాయకపోయిన గ్రంధము సాంగము గాకపోవుటయు, చదువరులకు యీ మదాలసాచరిత్రము సంపూర్ణముగా తెలియకపోవుటయు నగునని దీని నిచట వ్రాయడమైనది. ఐదవ అధ్యాయమునుండి 18 అధ్యాయములు అమోఘమైన వైరాగ్య యోగజ్ఞానములను గురించి ప్రబోధించుచున్నవి. అయితే దీనిలో యజ్ఞాదులకు సంబంధించిన భాగము కొంత అధునాతనకాలమున కనుపయుక్తమని తలంచి విడిచిపెట్టబడినది. పాఠకులు గ్రహింతురుగాక! ఈ గ్రంధమునందు వైరాగ్య, యోగ, జ్ఞానములను గురించియేగాక అచ్చటచ్చట రాజనీతులు, గృహస్థాశ్రమధర్మములు, పతివ్రతాత్వము, ఏకపత్నీవ్రతత్వము మొదలగునవి సయుక్తికముగా ప్రతిపాదింపబడినవి. గృహస్థాశ్రమము నందుండియే యిట్టి యమోఘజ్ఞానమును పొంది, స్వయముగా తాను తరించుటయేగాక తన సంతానమునుకూడ తరింపజేసిన యీ మదాలసాచరిత్ర మత్యద్భుతము. కావుననే సంసారమునందుండి తరింపగోరు ప్రతి గృహస్థుడును ముఖ్యముగా ప్రతినారీమణియు యీ గ్రంథమును చదువుట అత్యంతోపయోగమనుట కెట్టి సందేహమును లేదు. ఆ యుద్దేశముతోనే సంస్కృతవాఙ్మయమున మార్కండేయమహాపురాణమునందున్న యీ చరిత్రము తెనుగున అనువదింపబడినది. ఇది ముముక్షుజనోపయుక్తము కాగలదని ఆశించుచున్నాను. ఏతద్ గ్రంథానువాదమునకు నియోగించి అన్ని విధముల నాకీసదవకాశమును గల్పించిన శ్రీ సద్గురువరేణ్యులును, మద్గురుదేవులునగు శ్రీ శ్రీ మలయాళ దేశికేంద్రుల పాదపద్మముల సన్నిధిని నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదముల సమర్పించుకొనుచున్నాను. ఇందేదైనా మంచి గనుపించినచో నది శ్రీ సద్గురుమూర్తి దివ్యచరణారవింద సేవాఫలమేగాని అన్యముగాదు.

పాఠకమహాశయుల కింకొక్క మనవి. ఇందు దత్తాత్రేయ మునీంద్రుడు అలర్కునకు "యోగస్వరూపమును" దెలుపు ఘట్టమునందు "శశాంకరశ్మి సంయోగాత్" అను శ్లోకము మొదలు "సర్వస్వే జీవవాయాలం" అను శ్లోకమువరకుగల పది శ్లోకములును మిగుల నిగూఢార్థ గర్భితములై యున్నవి. వీటికి నా బుద్ధికి గోచరమైనంతవరకు తాత్పర్యమును వ్రాసితిని. ప్రాజ్ఞపాఠకలోకమున కేదైన నూతనార్థము స్ఫురించుచో దయయుంచి తెలిపిన మరు ముద్రణమున ప్రకటింప ప్రయత్నము జరుగును.

ఇక నీ విషయమున యీ మదాలసాచరిత్ర ప్రాశస్త్యముం దెలుపు నొక చాటు శ్లోకమునుదహరించి దీని నింతటితో విరమించుచున్నాను.

"శుద్ధోఽసి బుద్ధోఽసి నిరంజనోఽసి
సంసారమాయాపరివర్జితోఽసి ।

సంసారస్వప్నం త్యజ మోహనిద్రాం
మదాలసా వాచమువాచ పుత్రమ్ ॥

బిడ్డా! నీవు శుద్ధుడవు (మాయామలినరహితుడవు), జ్ఞానస్వరూపుడవు, దోష రహితుడవు, సంసారమాయామోహమునుండి విడివడినవాడవు (జనన మరణ ప్రవాహ రూప మాయ లేనివాడవు), సంసారస్వప్నముగల మోహనిద్రను త్యజింపుము, లెమ్ము. నీ స్వస్వరూపమును గనుగొమ్ము అని మదాలస పుత్రునకు జోలపాటల నెపమున - ఉగ్గుపాలతో నుపదేశించెను. ఇది యెల్లెడల ప్రచారపథమునం దుండుట ప్రాజ్ఞులకు విదితమే.

శమిత్యోమ్

ఇట్లు,

శ్రీ సద్గురు చరణరజోరేణువు,

Ch. అప్పలస్వామి,

సాహిత్యశిరోమణి.



ఓం నమో భగవతే వాసుదేవాయ

# మదాలసా చరిత్రము

శ్లో॥ యద్యోగిభిర్భవభయార్తివినాశయోగ్య
మాసాద్య వందితమతీవ వివిక్తచిత్తైః ।
తద్వః పునాతు హరిపాదసరోజయుగ్మ
మావిర్భవత్క్రమవిలంఘితభూర్భువస్స్వః ॥

తా॥ నిరంతర ఏకాంత (పరబ్రహ్మ) చింతనాపరులగు యోగిపుంగవులకు వంద్యమై జననమరణరూప భవభయార్తివినాశయోగ్యమై వందనీయమై క్రమముగా భూర్భువస్సువస్సులనుదాటి ఆవల ప్రస్ఫుటముగా వెలుగుచున్న శ్రీహరిపాద సరోజయుగ్మము మిమ్ములను రక్షించుగాక!

శ్లో॥ ప్రాగ్బభూవ మహావీర్యః శత్రుజిన్నామ పార్థివః ।
తుతోష యస్య యజ్ఞేషు సోమావాప్త్యా పురందరః ॥

తా॥ పూర్వకాలమున ఎవనిచేత చేయబడు యజ్ఞములయందలి సోమరసము నాస్వాదించి దేవేంద్రాది దేవతలు సంతోషించిరో, అటువంటి యజనశీలుడును, మహావీర్యవంతుడునగు శత్రుజిత్తు అను పేరుగల ఒక రాజుండెను.

## ఋతధ్వజ మహారాజు జననము - బాల్యక్రీడలు

శ్లో॥ తస్యాత్మజో మహావీర్యో బభూవారివిదారణః ।
నామ్నా ఋతధ్వజః ఖ్యాతః సర్వలక్షణసంయుతః ॥

తా॥ ఆ శత్రుజిత్తునకు మహాపరాక్రమవంతుడును, శత్రువిదారకుడును, సర్వలక్షణోపేతుడునగు ఋతధ్వజుడని పేరుచేత ప్రసిద్ధిజెందిన ఒక కుమారుడుండెను.

శ్లో॥ బుద్ధివిక్రమలావణ్యైః గురుశక్రాశ్వినాం సమః ।
ససమానవయోబుద్ధిసత్త్వవిక్రమచేష్టితైః ।
నృపపుత్రో నృపసుతైర్నిత్యమాస్తే సమావృతః ॥

తా॥ బుద్ధియందు బృహస్పతితోను, పరాక్రమమునందు దేవేంద్రునితోను, రూపమునందు అశ్వినీదేవతలతోను సమానుడగు ఆ రాజకుమారుడు వయోబుద్ధి సత్వవిక్రమము లన్నింటిలోను తనతో సమానమైన రాజపుత్రులతో నెల్లప్పుడుకూడి విహరించుచు కాలము గడపుచుండెను.

శ్లో॥ కదాచిచ్ఛాస్త్రసద్భావ వివేకకృతనిశ్చయః ।
కదాచిత్కావ్యసంలాపగీతనాటకసంభవైః ॥
తథైవాక్షవినోదైశ్చ శస్త్రాస్త్రవినయేషు చ ।
యోగ్యో నియుద్ధనాగాశ్వస్యందనాభ్యాసతత్పరః ।
రేమే స్వపేంద్రపుత్రోఽసౌ నరేంద్రతనయైర్వృతః ॥

తా॥ ఆ ఋతధ్వజుడు శాస్త్రాభ్యాసముచేత కలిగిన వివేకమువలన మంచి బుద్ధిమంతుడై ఒకప్పుడు కావ్యనాటకాలంకార సంగీతాలాపాదులచేతను, మరొకప్పుడు పాచికలు మొదలగు ద్యూతవినోదములచేతను, ఒకప్పుడు శస్త్రాస్త్రాభ్యాసములచేతను, ఒకప్పుడు నీతిశాస్త్రాభ్యాసముచేతను, మరొకప్పుడు పందెములచేతను, ఇంకొకప్పుడు ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మొదలగు వాహనాదులయొక్క అభ్యాసముచేతను రాజపుత్రులతో కూడుకొని వినోదించుచుండెను.

శ్లో॥ యథైవ హి దివా తద్వద్రాత్రావపి ముదా యుతాః ।
తేషాం తు క్రీడతాం తత్ర ద్విజభూపవిశాం సుతాః ।
సమానవయసః ప్రీత్యా రంతుమాయాంత్యనేకశః ॥

తా॥ ఇట్లు సంతోషముతో కూడుకొన్నవారై రాత్రింబవళ్లు ఏక వినోదించుచు, ఆటపాటలతో కాలము గడుపుచున్న వారితో ఆడుకొనుటకు సమానవయస్కులగు యితర బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకుమారులుగూడ అనేకులు వచ్చుచుండిరి.

ఋతధ్వజుని జూచుటకు అశ్వతరుడను నాగరాజకుమారు లిరువురు వచ్చుట

శ్లో॥ కస్యచిత్త్వథ కాలస్య నాగలోకాన్మహీతలం ।
కుమారావాగతౌ నాగౌ పుత్రావశ్వతరస్య తు ।
బ్రహ్మరూపప్రతిచ్ఛన్నౌ తరుణౌ ప్రియవాదినౌ ॥

తా॥ ఇట్లు కొంతకాలము గతించిన తరువాత — నాగలోకమునుండి నిగూఢమగు బ్రహ్మతేజస్సుగలవారును, తరుణవయస్కులును, ప్రియముగా మాట్లాడువారును నగు అశ్వతరుడనువాని పుత్రులు నాగకుమారు లిరువురు భూలోకమునకువచ్చిరి.

శ్లో॥ తౌ తైర్నృపసుతైస్సార్థం తథైవాన్యైర్ద్విజాత్మజైః ।
వినోదైర్వివిధైస్తత్ర తస్థతుః ప్రీతిసంయుతౌ ॥

తా॥ ఆ నాగకుమారులు ఇరువురును మిక్కిలి సంతోషముతో కూడుకొన్నవారై, ఆ రాజపుత్రులతోను, బ్రాహ్మణకుమారులతోను, అట్లే యితరులతోనుకూడ పలువిధములగు వినోదముతో ఆనందించుచూ ఉండిరి.



శ్లో॥ పర్యే చ తే నృపసుతా స్తే చ బ్రహ్మవిశాం సుతాః।
నాగరాజాత్మజౌ తౌ చ స్నానసంవాహనాదికాం।
వస్త్రగంధాన్నసంయుక్తాం చక్రుర్భోగభుజిక్రియామ్॥

తా॥ అప్పుడు ఆ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య కుమారులందరున్నూ ఆ నాగరాజ కుమారులకు స్నానము చేయించి, ఒడలురుద్ది మంచివస్త్రములను కట్టనిచ్చి చందనాదుల నలది అనుభవయోగ్యమగు (యిష్టమగు) మృష్టాన్నభోజనమును చేయించిరి.

శ్లో॥ అహన్యహన్యనుప్రాప్తే తౌ చ నాగకుమారకౌ।
ఆజగ్మతుర్ముదా యుక్తౌ ప్రీత్యా సూనోర్మహీపతేః।
స చ తాభ్యాం నృపసుతః పరం నిర్వాణమాప్తవాన్॥

తా॥ ఇట్లు ఆ నాగకుమారులు రాజకుమారునకు ఋతధ్వజునియందుగల ప్రీతి చేతను, ఆతనికి వీరియందుగల ప్రేమచేతను, మిక్కిలి సంతోషముతో ప్రతిదినమును వచ్చుచు పోవుచుండిరి. ఆ రాజకుమారుడును వారల యీ రాకపోకలవలన మిక్కిలి ఆనందమును పొందుచుండెను.

శ్లో॥ వినోదైర్వివిధైః హాస్యసంలాపాదిభిరేవ చ।
వినా తాభ్యాం న బుభుజే న సస్నౌ న పపౌ మధు।
న రేమే చ న జగ్రాహ శాస్త్రాణ్యాత్మగుణర్ధయే॥

తా॥ వివిధ వినోదములచేతను, హాస్యసంభాషణాదులచేతను వారలవలన సంతుష్టుడగు నా రాజకుమారుడు యిక ఆ నాగకుమారులు లేనిదే భుజించుటకిష్టపడడు, స్నానము చేయడు, పానము చేయడు. ఆత్మ గుణాభివృద్ధిదాయకములగు శాస్త్రములనైనను చదువడు. తుదకు వారు లేనిదే ఏదియు నతనికి వినోదహేతువుగాదు, ఏదియు నింపు గలిగింపలేదు

శ్లో॥ రసాతలే చ తౌ రాత్రిం వినా తేన మహాత్మనా।
నిశ్వాసపరమౌ నీత్వా జగ్మతుస్తం దినేదినే॥

తా॥ ఇక్కడ పాతాళలోకమునందు ఆ నాగకుమారు లిరువురు ఆ రాజకుమారుడు లేని రాత్రి నెట్లో అతికష్టముగా గడిపి తెల్లవారునదే తడవుగ ప్రతిదినమునందును రాజకుమారునియొద్దకు పోవుచుండిరి.

శ్లో॥ మర్త్యలోకే వఃా ప్రీతిర్భవతోః కేన పుత్రకౌ।
సహేతి చ ప్రలపితౌ తావుభౌ నాగకుమారకౌ॥
దృష్టయోరత్ర వాతాౖ జహూని దివసాని మే।
దివారజన్యామేవోభౌ పశ్యామి ప్రియదర్శనౌ॥

తా॥ ఇట్లు కొంతకాలము జరిగిన పిదప ఒకదినమున ఆ నాగకుమారుల తండ్రి వారి నిట్లడిగెను. బిడ్డలారా! మర్త్యలోకములో మీకు యెవనిపై నింత ప్రీతి కలిగినది? మిమ్ముల నింతగా ఆకర్షించినవారెవరు? చాలకాలమునుండి రాత్రింబగల్లు చూచుచున్నానుగదా? మీరేదో ప్రీతిపాత్రమైన ఒకవస్తువును దర్శించి తనివి బొందకున్నట్లు గనబడుచున్నారు.

శ్లో॥ ఇతి పిత్రా స్వయం పృష్టౌ ప్రణిపత్య కృతాంజలీ।
ప్రత్యూచతుర్మహాభాగౌ వురగాధిపతేస్సుతౌ॥

తా॥ అని యీ విధముగా తమ తండ్రిచేత అడుగబడినవారై మహానుభావులగు ఆ నాగకుమారు లిరువురును తండ్రికి నమస్కరించి అంజలిపుటబద్ధులై యిట్లు చెప్పిరి.

పుత్రావూచతుః = కుమారు లిరువురు చెప్పిరి.

శ్లో॥ పుత్రశ్శత్రుజితస్తాత నామ్నా ఖ్యాత ఋతధ్వజః।
రూపవానార్జవోపేతః శూరో మానీ ప్రియంవదః॥
అనావృతకథో వాగ్మీ విద్వాన్మైత్రో గుణాకరః।
మాన్యమానయితా ధీమాన్ హ్రీమాన్వినయభూషణః॥

తా॥ తండ్రీ! భూలోకమునందు మిక్కిలి రూపవంతుడును, ఆర్జవగుణోపేతుడును, శూరుడును, మానవంతుడును, ప్రియభాషణము గలవాడును, వ్యాపకమై ప్రసిద్ధమైన చరిత్రగలవాడును, మంచివక్తృత్వము గలవాడును, విద్వాంసుడును, స్నేహపాత్రుడును, సకలసద్గుణములకు నిలయమైనవాడును, పూజింపదగినవారిని పూజించువాడును, ధీమంతుడును, ఉచితలజ్జగలవాడును, వినయమే భూషణముగా గలవాడునగు శత్రుజిత్తను రాజునకు కుమారుడగు ఋతధ్వజుడను పేరుచే ప్రసిద్ధిజెందిన రాజకుమారుడొకడు గలడు.

శ్లో॥ తస్యోపచారసంప్రీతిసంభోగాపహృతం మనః।
నాగలోకేఽన్యలోకే వా న రతిం విందతే పితః॥

తా॥ ఓ తండ్రీ! మిక్కిలి ప్రీతిపూర్వకమైన అతని సత్కారాద్యుపచారముల ననుభవించినపిదప మనస్సు అతనియందు లగ్నమై నాగలోకమునందుగాని లేక మరే లోకమునందుగాని దేనియందును ప్రీతిని జూపకున్నది.

శ్లో॥ తద్వియోగేన సా తాత నిశా పాతాళశీతలా।
పరితాపాయ తత్సంగశ్చాహ్లాదాయ రవిర్దివా॥

తా॥ ఆతనియొక్క యెడబాటువలన నాకు ప్రశాంతశీతలమగు యీ పాతళము చీకటిగుహవలె పరితాపమును కలుగజేయుచున్నది ఆతనితోడి సహవాసము (స్నేహము) పగటియందు సూర్యునివలె నాకెంతో ఆనందమును గలిగించుచున్నది.

తండ్రి వారివలన ఋతధ్వజుని చరిత్రవిని అతని గుణములను శ్లాఘించుచు

వానికేదేని ఉపకృతి చేయనెంచుట

పితోవాచ = తండ్రి చెప్పెను.

శ్లో॥ పుత్రః పుణ్యవతో ధన్యః స యస్యైవం భవద్విధైః।
పరోక్షస్యాపి గుణిభిః క్రియతే గుణకీర్తనమ్॥

తా॥ నాయనా! మీబోటి గుణవంతులచేత పరోక్షమునం దున్నవాడైనను యెవని గుణకీర్తనము యీ విధముగా చేయబడుచున్నదో, అట్టివాడెంత ధన్యాత్ముడో గదా! ఆహా! అట్టి పుత్రునిగన్న తల్లిదండ్రు లెంత పుణ్యాత్ములయ్యా!

శ్లో॥ సంతి శాస్త్రవిదోఽశీలాః సంతి మూర్ఖాస్సుశీలినః।
శాస్త్రశీలే సమం మన్యే యస్మిన్ ధన్యతరం తు తమ్॥

తా॥ లోకమునందు శాస్త్రములు బాగా చదువుకొని శాస్త్రార్థములు చేయగలవారనేకులున్నను, వారిలో ఉత్తమమగు నడవడి నున్న. అట్లే మంచినడవడిగలవారైనను శాస్త్రజ్ఞానము లేనివారనేకులున్నారు. కాని శాస్త్రము (విద్య), శీలము (మంచి ప్రవర్తనము) యీ రెండును ఎవనియందు సమానముగా నుండునో అతడే ధన్యాత్ముడనుట కేమైన సందేహమున్నదా? అయితే అట్టివారరుదు.

శ్లో॥ యస్య మిత్రగుణాన్మిత్రాణ్యమిత్రాశ్చ పరాక్రమం।
కథయంతి సదా సత్సు పుత్రవాన్ తేన వై పితా॥

తా॥ ఎవనియొక్క సద్గుణసంపత్తిని మిత్రులును, పరాక్రమాది గుణములను శత్రువులును ఎల్లప్పుడు సత్పురుషుల సమక్షమున ప్రశంసింతురో, అటువంటి పుత్రుడు గల తండ్రియే తండ్రి. అతడే పుత్రవంతుడు.

శ్లో॥ తస్యోపకారిణః కచ్చిద్భవద్భ్యామభివాంఛితం।
కించిన్నిష్పాదితం వత్సౌ పరితోషాయ చేతసః॥

తా॥ బిడ్డలారా! అటువంటి ఉపకారికి ప్రేమాస్పదునకు మీ మనస్సంతుష్టికొరకు ఏదైనా ప్రత్యుపకృతి చేసినచో బాగుండునని మీకేమైనా కోరికగలదా? అట్టి కోరిక మీకు గలిగినచో చెప్పుడు.

శ్లో॥ స ధన్యో జీవితం తస్య తస్య జన్మ సుజన్మనః ।
యస్యార్థినో న విముఖా మిత్రార్థే న చ దుర్బలః ॥

తా॥ ఎవని నర్థించి అర్థులు విముఖులును, విఫలులును గారో, ఎవడు మిత్రుల నిమిత్తము ఏమియు లేనివాడగుచున్నాడో, (ఇతరులకొరకు సర్వస్వము నర్పించుచున్నాడో) అట్టివాని జన్మయే జన్మ. అతడే ఉత్తమోత్తముడు. అతని జీవితమే జీవితము. నిజముగా అతడే ధన్యుడు.

శ్లో॥ మద్గృహే యత్సువర్ణాదిరత్నవాహనమాసనం ।
యద్వాఽన్యత్ప్రీతయే తస్య తద్దేయమవిశంకయా ॥

తా॥ మన యింట గలవానిలో సువర్ణాదిభూషణములుగాని, రత్నమాల్యాంబరములుగాని, వాహనములుగాని, ఆసనములుగాని, ఇంత యేల? అతని కిష్టమైన దేదైనను నిరాటంకముగా సమర్పింపుడు.

శ్లో॥ ధిక్తస్య జీవితం పుంసో మిత్రాణామపకారిణః ।
ప్రతిరూపమకుర్వాణో యో జీవామీత్యవగచ్ఛతి ॥
ఉపకారం సుహృద్వర్గేష్వపకారం చ శత్రుషు ।
నృమేఘో వర్షతి ప్రాజ్ఞాస్తస్యేచ్ఛంతి సదోన్నతిమ్ ॥

తా॥ మిత్రులకు అపకారము చేసినవానియొక్క జీవితము నిందితమైనది. ఉపకారమునకు తగిన ప్రతిక్రియను చేయకుండా ఉండువానియొక్క జీవిత మొక జీవితము గాదు. ప్రత్యుపకారబుద్ధి లేకయే జీవింతుననుకొనుట పరమపాపమును మూటగట్టుకొనుట. ఎవడు ఉత్తములగు సుహృద్వరుల కుపకారమును శత్రువులకు తగిన శాస్తిని (శఠే శాఠ్యం సమాచరేత్) చేయుచున్నాడో, అట్టివాని ఉన్నతిని ప్రాజ్ఞులు సదా కోరుచుందురు.

పుత్రావూచతుః = పుత్రులు చెప్పుచున్నారు.

శ్లో॥ కిం తస్య కృతకృత్యస్య కర్తుం శక్యేత కేనచిత్ ।
యస్య నర్వార్థినో గేహే సర్వకామైస్సదాఽర్చితాః ॥

తా॥ తండ్రీ! మీరు చెప్పినదంతయు నిజమేగాని, ఎవని గృహమందు నిరంతరము అర్థులు తండోపతండములుగావచ్చి సమస్త కామితములను పొంది పూజింపబడి సంతుష్టులై పోవుచుందురో, యెవనికి చేయదగినదియు, పొందదగిన దేనియూ లేదో అట్టి యాఋతధ్వజుని దేనిచేత మనము సంతృప్తునిగా జేయగలము?

శ్లో॥ యాని రత్నాని తద్గేహే పాతాళే తాని నః కుతః ।
వాహనాసనయానాని భూషణాన్యంబరాణి చ ॥

తా॥ ఆతని గృహమునందున్న రత్నములుగాని, వాహనాసనాదులుగాని, భూషణములుగాని, వస్త్రములుగాని మన పాతాళలోకమం దెక్కడున్నవి? ఆతని కేమిటను కొదువ లేదు.

శ్లో॥ విజ్ఞానం యచ్చ తత్రాస్తి తదన్యత్ర న విద్యతే ।
ప్రాజ్ఞానామప్యసౌ తాత సర్వసందేహహృత్తమః ॥

తా॥ ఓ తండ్రీ! ఇక విద్యావిజ్ఞానములయందు జాతమన్ననో, ఆతనియందుగల విజ్ఞానము మరెచ్చటను మేము జూడలేదు. ఆతడు ప్రాజ్ఞులలో ప్రాజ్ఞుడు. సర్వసందేహములను పోగొట్టగల ధీమంతుడు.

శ్లో॥ ఏకం తస్యాస్తి కర్తవ్యమసాధ్యం తచ్చ నో మతం ।
హిరణ్యగర్భగోవిందశర్వాదీనాం వరాదృతే ॥

తా॥ అయితే ఆతనికి బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులలో యే ఒక్కరి వరప్రసాదముననోగాక, యితరులచేత అసాధ్యమైన ఒక కార్యము మాత్ర మున్నట్లు మేము తలంచుచున్నాము.

పితోవాచ = తండ్రి చెప్పెను.

శ్లో॥ తథాపి శ్రోతుమిచ్ఛామి తస్య యత్కార్యముత్తమం ।
అసాధ్యమథవా సాధ్యం కిం చాసాధ్యం విపశ్చితామ్ ॥

తా॥ నాయనలారా! అట్లయినచో ఆతనికి యిష్టమైన ఆ కార్యము సాధ్యమైనదైనను, అసాధ్యమైనదైనను, మరియు ప్రాజ్ఞులకుగూడ సాధ్యమైనది కాకున్నను సరే, అదేదో ముందు దానిని వినగోరుచున్నాను.

శ్లో॥ దేవత్వమమరేశత్వం తత్పూజ్యత్వం చ మానవాః ।
ప్రయాంతి వాంఛితం చాన్యద్దృఢం యే వ్యవసాయినః ॥

తా॥ దృఢముగా పట్టుదలతో ప్రయత్నించినట్లయితే మానవులు దేవత్వమునుగాని, దేవేంద్రపదవినిగాని, ఆ దేవతలచేత పూజింపదగినస్థితినిగాని, అంతేగాదు మరి దేనిని కోరిన దానిని పొందగలరు.

శ్లో॥ నావిజ్ఞాతం న చాగమ్యం న ప్రాప్యం దివి చేహ వా ।
ఉద్యతానాం మనుష్యాణాం యతచిత్తేంద్రియాత్మనామ్ ॥

తా॥ ప్రయత్నశీలురయినట్టియు చిత్తేంద్రియ మనోనిగ్రహము గలిగినట్టియు, మానవులకు యీ లోకమందైనను, పరలోకమందైనను తెలియబడనిదిగాని, గోచరము గానిదిగాని, పొందబడనిదిగాని ఏదియులేదు.

శ్లో॥ యోజనానాం సహస్రాణి యాతి గచ్ఛన్ పిపీలికః ।
అగచ్ఛన్ వైనతేయోఽపి పదమేకం న గచ్ఛతి ॥

తా॥ నడచుటకు ప్రయత్నించిన చీమ నడచుచు నడచుచు వేలకొలది యోజనముల దూరము పోగలదు. పోవుటకే ప్రయత్నములేనిచో మహాజవసత్వసంపన్నుడగు గరుత్మంతుడైనను ఒక్కడుగుగూడ ముందుకు పోజాలడు.

శ్లో॥ క్వ భూతలం క్వ చ ధ్రౌవ్యం స్థానం యత్ప్రాప్తవాన్ధ్రువః ।
ఉత్తానపాదనృపతేః పుత్రస్సద్భూమిగోచరః ॥

తా॥ నాయనలారా! చూడుడు! భూమియెక్కడ? ధ్రువస్థానమెక్కడ? భూతల నివాసియగు ఉత్తానపాద నృపాలుని కుమారుడైన ధ్రువుడు ఆ స్థానమును పొందినాడనినచో ఆతడెంత ప్రయత్నశాలియో ప్రయత్నమువలన గలిగిన ఫలమెట్టిదో ఊహించుకొనుడు.

శ్లో॥ తత్కథ్యతాం మహాభాగౌ కార్యవాన్యేన పుత్రకౌ ।
స భూపాలసుతస్సాధుర్యేనానృణ్యం లభేత వామ్ ॥

తా॥ అందువలన ఓ పుత్రులారా! ఉత్తముడగు నా రాజకుమారుని ఋణమును మీరెట్లు తీర్చుకొనగలరో ఆతడు మీనుండి ఎట్టి ఉపకృతిని పొందదగినవాడో, అట్టి కార్యమును నేనేదైనా జేయవలసియుండిన నిస్సంశయముగా చెప్పుడు.

ఋతధ్వజుని అభీష్టము నెరిగించుటకై తండ్రికి ఆతని వృత్తాంతమును నాగకుమారులు చెప్పుట — గాలవమహర్షి వృత్తాంతము

పుత్రావూచతుః = కుమారులు చెప్పిరి.

శ్లో॥ తేనాఖ్యాతమిదం తాత పూర్వవృత్తం మహాత్మనా ।
కౌమారకే యథా తస్య వృత్తం సద్వ్రతశాలినః ।

తా॥ తండ్రీ! అట్లయిన ఉత్తమచరితుడగు నా ఋతధ్వజుని కౌమారావస్థయందు జరిగిన కథను ఆ మహాత్ముడు మాకు చెప్పినదానిని చెప్పినట్లు నీకు చెప్పెదము వినుము.

శ్లో॥ తస్య శత్రుజితం తాతం పూర్వం కశ్చిద్ద్విజోత్తమః ।
గాలవోఽభ్యాగమద్ధీమాన్ గృహీత్వా తురగోత్తమమ్ ॥

తా॥ పూర్వమొకప్పుడు ఆ ఋతుధ్వజుని తండ్రియగు శత్రుజితుని దగ్గరకు గాలవుడను పేరుగల బుద్ధిమంతుడగు నొక బ్రాహ్మణోత్తముడొక యశ్వరాజమును తీసికొనివచ్చెను.

శ్లో॥ ప్రత్యువాచ చ రాజానం సముపేత్యాశ్రమం మమ ।
కోఽపి దైత్యాధమో రాజన్విధ్వంసయతి పాపకృత్ ।
తత్తద్రూపం సమాస్థాయ సింహేభవనచారిణామ్ ॥

తా॥ అట్లు వచ్చి, రాజుతో ఆబ్రాహ్మణుడిట్లు చెప్పెను. రాజా! పాపాత్ముడగు నొక రాక్షసాధముడు, సింహము, ఏనుగు మొదలగు క్రూరజంతువుల రూపముతో ఆశ్రమమునకువచ్చి సర్వమును ధ్వంసమొనరించుచున్నాడు.

శ్లో॥ అన్యేషాం చాతికాయానామనార్నిశమకారణాత్ ।
సమాధిధ్యానయుక్తస్య మౌనవ్రతరతస్య చ ।
తథా కరోతి విఘ్నాని యథా నేచ్ఛామి పార్థివ ॥

తా॥ మరియు వికృతములగు పెద్దపెద్ద దేహములను ధరించి రాత్రింబగళ్ళు సమాధి ధ్యాననిమగ్నుడనైనట్టియు, మౌనవ్రతధారియునగు నాకెన్ని విఘ్నములు చేయవలెనో అన్ని విఘ్నములను అకారణముగా చేయుచున్నాడు. ఏది నాకిష్టముండదో దానినే తప్పక చేయుచు నన్నింతో బాధించుచున్నాడు.

శ్లో॥ దగ్ధుం కోపాగ్నినా సద్యః సమర్థాస్తం వయం న తు ।
దుఃఖార్జితస్య తపసో వ్యయమిచ్ఛామి పార్థివ ॥

తా॥ ఆ దురాత్ముడగు రాక్షసుని కోపాగ్నిచేత తక్షణమే దగ్ధమొనర్చుటకు మేము సమర్థులమైనను, మిక్కిలి కష్టపడి సంపాదించిన తపస్సు వ్యయమైపోవునే యను భయముచేత మేమాపనికి పూనుకొనలేదు.

శ్లో॥ ఏకదా తు మయా రాజన్నతినిర్విణ్ణచేతసా ।
తత్ క్లేశితేన నిశ్శ్వాసో నిరీక్ష్యాంబరముజ్ఝితః ॥

తా॥ ఒకప్పుడు ఆ రాక్షసునిచేత మిక్కిలి కష్టపెట్టబడి, ఆయాసముగల మనస్సు గలవాడనై ఆ దురాత్మునే తలంచుచు, క్లేశముతో ఆకాశమువంకజూచి ఒక నిట్టూర్పు విడచితిని.

శ్లో॥ తతోఽంబరతలాత్సద్యః పతితోఽయం తురంగమః ।
వాక్ చాశరీరిణీ ప్రాహ నరనాథ శృణుష్వ తత్ ॥

తా॥ వెంటనే ఆకాశమునుండి యీ గుఱ్ఱము నా సమీపమున దిగినది. మరియు నో రాజా! ఆకాశవాణియు నిట్లు చెప్పినది. దానిని వినుము —

శ్లో॥ అశ్రాంతః సకలం భూమేర్వ్వలయం తురగోత్తమః ।
సమర్థః క్రాంతుమర్కేణ తవాయం ప్రతిపాదితః ॥

తా॥ ఓయీ ఋషిసత్తమా! ఈ ఉత్తమాశ్వము సమస్త భూవలయమును ఒక్క క్షణములో నధిగమించుటకు సమర్థమైనదియు, మరియు నించుకయు నలసటబొందనిదియు నగు దీనిని సూర్యభగవానుడు నీ కొరకు పంపించెను.

శ్లో॥ పాతాళాంబరతోయేషు నాస్య ప్రతిహతా గతిః ।
సమస్తదిక్షు వ్రజతో న సంగః పర్వతేషు చ ॥

తా॥ పాతాళమునందుగాని, ఆకాశమునందుగాని, జలమునందుగాని, సమస్త దిక్కులయందుగాని, పర్వతములయందుగాని యెచ్చటను దీని గమనమునకు అడ్డులేదు.

శ్లో॥ యతో భూవలయం సర్వమశ్రాంతోఽయం చరిష్యతి ।
తతః కువలయో నామ్నా ఖ్యాతిం లోకేషు యాస్యతి ॥

తా॥ మరియు నిది భూవలయమునంతయు ననాయాసముగా సంచరింపగల్గుటవలన దీనికి "కువలయ" మను ప్రసిద్ధనామము లోకమున నేర్పడగలదు.

శ్లో॥ క్లిశ్నాత్యహర్నిశం పాపో యశ్చ త్వాం దానవాధమః ।
తమప్యేనం సమారుహ్య ద్విజశ్రేష్ఠ హనిష్యతి ।
శత్రుజిన్నామ భూపాలస్తస్య పుత్ర ఋతధ్వజః ॥

తా॥ ఓ భూసురోత్తమా! పాపాత్ముడగు యే రాక్షసాధముడు అహర్నిశలు నిన్ను కష్టపెట్టుచున్నాడో, అట్టి దురాత్ముని శత్రుజిత్తను భూపాలునకు కుమారుడగు ఋతధ్వజుడు యీ యశ్వము నధిరోహించి వధించగలడు.

శ్లో॥ ప్రాప్యైతదశ్వరత్నం చ ఖ్యాతిమేతేన యాస్యతి ।
సోఽహం త్వామనుసంప్రాప్తస్తపసో విఘ్నకారిణమ్ ॥
తం నివారయ భూపాల భాగభాఙ్నృపతిర్యతః ।
తదేతదశ్వరత్నం మే మయా భూప నివేదితమ్ ॥

తా॥ మరియు నీ యశ్వరత్నమును పొంది దీనిచే నాతడు మిగులఖ్యాతిని గాంచగలడు. అందువలన ఆ యాకాశవాణి చెప్పినరీతిగా నిన్ను నే నాశ్రయించితిని. కాన నో రాజా! తపోవిఘ్నకారియగు నా రాక్షసాధముని నివారింపుము. దుష్టశిక్ష

ణయు, శిష్టరక్షణయు రాజులకు విహితమేగదా! కావున నిదిగో నీ యశ్వరత్నమును సమర్పించుచున్నాను స్వీకరింపుము.

శ్లో॥ పుత్రమాజ్ఞాపయ తథా యథా ధర్మో న లుప్యతే।
స తస్య వచనాద్రాజా తం వై పుత్రమృతుధ్వజమ్॥
తదశ్వరత్నమారోప్య కృతకౌతుకమంగళం।
అప్రైషయత ధర్మాత్మా గాలవేన సమం తదా।
స్వమాశ్రమపదం సోఽపి తమాదాయ యయౌ మునిః॥

తా॥ మరియు ధర్మలోపము లేకుండునట్లుజేయుము. నీ పుత్రుని యీ కార్యము నకై యాజ్ఞాపింపుము. ఇట్లు చెప్పుచున్న ఆగాలవుని మాటలువిని ధర్మాత్ముడగు రాజు ఉత్సాహవంతుడును, శోభనశీలుడునగు తనకుమారుని అశ్వము నధిరోహింపజేసి గాలవుని వెంటబంపెను. ఆ మునియును ఋతధ్వజుని వెంటనిడుకొని తనయాశ్రమమునకుబోయెను.

ఇతి శ్రీమార్కండేయమహాపురాణే పితాపుత్రసంవాదే
మదాలసోపాఖ్యానే కువలయాశ్వీయే
అష్టాదశోఽధ్యాయః

ఇది మార్కండేయమహాపురాణమునందలి పితాపుత్రసంవాదరూపమగు
మదాలసోపాఖ్యానమునందు కువలయాశ్వవృత్తాంతమును
దెల్పెడు అష్టాదశాధ్యాయము



పితోవాచ = తండ్రిచెప్పెను.

శ్లో॥ గాలవేన సమం గత్వా నృపపుత్రేణ తేన యత్।
కృతం తత్కథ్యతాం పుత్రౌ విచిత్రాయుధయోధినా॥

తా॥ పుత్రులారా! అట్లు గాలవునితో వెళ్ళి విచిత్రాయుధయోధుడగు ఆ రాజ కుమారుడు యేమిచేసెనో చెప్పుడు.

పుత్రావూచతుః = కుమారులు చెప్పిరి.

శ్లో॥ స గాలవాశ్రమే రమ్యే తిష్ఠన్భూపాలనందనః।
సర్వవిఘ్నోపశమనం చకార బ్రహ్మవాదినామ్॥

తా॥ ఆ రాజకుమారుడు సుందరమైన ఆ గాలవుని ఆశ్రమమునందున్నవాడై, బ్రహ్మనిష్ఠులకుగల సకలాంతరాయములను తొలగించెను.

శ్లో॥ వీరం కువలయాశ్వం తం వసంతం గాలవాశ్రమే ।
మదావలేపోపహతో నాజానాద్దానవాధమః ॥

తా॥ అయితే వీరుడగు కువలయాశ్వుడు (ఋతధ్వజుడు) గాలవముని ఆశ్రమమునందున్నాడని మదోన్మత్తుడగు దానవాధముడు తెలిసికొనలేదు.

శ్లో॥ తతస్తం గాలవం విప్రం సంధ్యోపాసనతత్పరం ।
సౌకరం రూపమాస్థాయ ప్రధర్షయితుమాగమత్ ॥

తా॥ అందువలన నా రాక్షసుడు ఒక పందిరూపమును ధరించి సంధ్యోపాసనాతత్పరుడగు నా గాలవుడను మునిని భయపెట్టుటకు అచటికి వచ్చెను.

శ్లో॥ మునిశిష్యైరథోత్కృష్టే శీఘ్రమారుహ్య తం హయం ।
అన్వధావద్వరాహం తం నృపపుత్రశ్శరాసనీ ॥

తా॥ అంతట నాయాశ్రమవాసులగు మునిశిష్యులు వరాహరూపుడగు నా రాక్షసునిజూచి ఇదిగో రాక్షసుడు ఇదిగో రాక్షసుడు అని అరవగా, అదివిని ఋతధ్వజుడు శరాసనములనుధరించి శీఘ్రముగా నశ్వము నధిరోహించి, ఆ వరాహమును తరుముకొని దానివెంట నంటిపోయెను.

శ్లో॥ ఆజఘాన చ బాణేన చంద్రార్ధాకారవర్చసా ।
ఆకృష్య బలవచ్చాపం చారు చిత్రోపశోభితమ్ ॥

తా॥ మరియు, మనోజ్ఞమై చిత్రోపశోభితమగు దృఢమైన ధనుస్సును ఎక్కుబెట్టి అర్ధచంద్రాకారమై, మిగుల తేజోవంతమగు బాణముతో ఆ వరాహమును కొట్టెను.

శ్లో॥ నారాచోపహతశ్శీఘ్రమాత్మత్రాణపరో మృగః ।
గిరిపాదపసంబాధాం సోఽత్యక్రామన్మహాటవీమ్ ॥

తా॥ బాణపు దెబ్బతినిన ఆ పంది (వరాహరూపుడగు రాక్షసుడు) తన ప్రాణముల రక్షించుకొనవలెననెడి ఆతురతతో గుట్టలతోను, చెట్లతోను నిండి మిగులదట్టమైన అడవులను దాటి పారిపోసాగెను.

శ్లో॥ తమన్వధావద్వేగేన తురగోఽసౌ మనోజవః ।
చోదితో రాజపుత్రేణ పితురాదేశకారిణా ॥

తా॥ పిత్రాజ్ఞాపరిపాలనాసక్తుడగు రాజకుమారుని ప్రేరణచే, మనోజవముగల ఆ గుఱ్ఱముగూడ దానిననుసరించి మిక్కిలివేగముతో పరిగెత్తిపోయెను.

శ్లో॥ అతిక్రమ్యాథ వేగేన యోజనాని సహస్రశః।
ధరణ్యాం వివృతే గర్తే నిపపాత లఘుక్రమః॥

తా॥ ఆ వరాహమున్ను మిక్కిలి వేగముతో అనేక వేల యోజనములదూరము దాటి అలసి, క్షీణశక్తిగలదియై, ఒకచోట భూవివరములో పడిపోయెను (ప్రవేశించెను).

ఋతధ్వజుడు రాక్షసుని వెంబడించుచు పాతాళమునకు వచ్చుట

శ్లో॥ తస్యానంతరమేవాథ స చాశ్వో నృపతేస్సుతః।
నిపపాత మహాగర్తే తిమిరౌఘసమావృతే॥

తా॥ తరువాత ఆ వెంటనే ఋతధ్వజుడు గుఱ్ఱముతోగూడ దట్టమగు చీకటిచే ఆవరింపబడిన ఆ బిలములో ప్రవేశించెను.

శ్లో॥ తతో నాదృశ్యత మృగస్స తస్మిన్రాజసూనునా।
ప్రకాశం చ స పాతాళమపశ్యత్తత్ర చార్చిషా॥

తా॥ అయితే ఆ రాజకుమారునకు అచట వరాహము కనుపించలేదు. కాని జ్వాలలతో ప్రకాశింపజేయబడిన పాతాళమాతనికి దృగ్గోచరమయ్యెను.

శ్లో॥ తతోఽపశ్యత్స సౌవర్ణం ప్రాసాదశతసంకులం।
పురందరపురప్రఖ్యం పురం ప్రాకారశోభితమ్॥

తా॥ తరువాత నా రాజకుమారుడు సువర్ణమయములయిన అనేక సౌధములతో గూడినదియు, ప్రాకారములచేత శోభాయమానముగా నున్నదియు, దేవేంద్రపట్టణమగు అమరావతివలె సుందరమునగు నొక పట్టణమును జూచెను.

శ్లో॥ తత్ప్రవిశ్య స నాపశ్యత్తత్ర కంచిన్నరం పురే।
భ్రమతా చ తతో దృష్టా తత్ర యోషిత్త్వరాన్వితా॥

తా॥ ఆ పట్టణములో ప్రవేశించిచూడగా అచట ఒకమనుష్యుడుగూడ ఆతనికి గానుపించలేదు. అయితే ఆ రాజకుమారునికి అటు-నిటు తిరుగుచు మిక్కిలి త్వరిత గతితో పోవుచున్న ఒక స్త్రీమూర్తిము కనబడెను.

శ్లో॥ సా పృష్టా తేన తన్వంగీ ప్రస్థితా క్వేతి కస్య వా।
నోవాచ కించిత్ప్రాసాదమారురోహ చ భామినీ॥

తా॥ ఆ రాజకుమారునిచేత ఆమె "నీ వెవరు, ఎక్కడికి పోవుచున్నావు?" అని అడుగబడియు, ఏమియు సమాధానమును జెప్పక నే మేడమెట్లెక్కి పైకిపోయెను,

శ్లో॥ సోప్యశ్వమేకతో బద్ధ్వా తామేవానుససార వై ।
విస్మయోత్ఫుల్లనయనో నిశ్శంకో నృపతేస్సుతః ॥

తా॥ తరువాత నా రాజకుమారుడు గూడ గుఱ్ఱమునొకచోట కట్టివైచి ఆశ్చర్యముచే వికసించిన నేత్రములుగలవాడై, ఇదేదో కనుగొనవలెననెడి కుతూహలముతో, నిస్సంకోచముగా ఆమెననుసరించిపోయెను.

మదాలసావృత్తాంతము

శ్లో॥ తతోఽపశ్యత్సువిస్తీర్ణే పర్యంకే సర్వకాంచనే ।
నిషణ్ణాం కన్యకామేకాం కామయుక్తాం రతిం యథా ॥
విస్పష్టేందుముఖీం సుభ్రూం పీనశ్రోణిపయోధరాం ।
బింబాధరోష్ఠీం తన్వంగీం నీలోత్పలవిలోచనామ్ ॥
రక్తతుంగనఖాం శ్యామాం మృదుతామ్రకరాంఘ్రికాం ।
కరభోరుం సుదశనాం నీలసూక్ష్మస్థిరాలకామ్ ॥

తా॥ అచ్చట ఆ రాజకుమారుడు సువిశాలమై కాంచనమయమైన పర్యంకము (మంచము)పైని కూరుచున్నదియు, సాక్షాద్రతీదేవివలెనున్నదియు, కళంకములేని చంద్రుని వంటి ముఖముగలదియు, ఆకర్షణీయములగు మంచికనుబొమలుగలదియు, ఉన్నతములగు పిరుదులును పయోధరములుగలదియు, దొండపండువంటి అధరముగలదియు, శలాకవంటి దేహసౌష్ఠవముగలదియు, నల్లకలువరేకులవంటి విశాలములగు నేత్రములుగలదియు, ఎఱ్ఱనివై ఉన్నతమగు గోళ్ళుగలదియు, మంచి యౌవనదశయందున్నదియు, మృదులములై రక్తములగు కరచరణములుగలదియు, మంచి పలువరుసగలదియు, నీలములై సన్ననగు మృదులకేశములు గలదియునగు ఒక కన్యకను చూచెను.

శ్లో॥ తాం దృష్ట్వా చారు సర్వాంగీమనంగాంగలతామివ ।
సోఽమన్యత్పార్థివసుతస్తాం రసాతలదేవతామ్ ॥

తా॥ మన్మథమూర్తివలె కోమలమైన ఆ సర్వాంగసుందరినిచూచి రాజకుమారుడు ఈమె రసాతలదేవతయని భావించెను.

శ్లో॥ సా చ దృష్ట్వైవ తం బాలా నీలకుంచితమూర్ధజం ।
పీనోరస్కంధబాహుం తమమంస్త మదనం శుభా ॥

తా॥ ఆ బాలామణియు నల్లనై బిరుసుగల శిరోజములుగలిగినటువంటియు, ఉన్నతమగు వక్షస్థలమును భుజమూపురములును బాహువులును గలిగిన యా రాజకుమారుని మన్మథుడే ఇటకు దిగివచ్చెనా అని తలంచెను.

శ్లో॥ ఉత్థస్థా చ శుభాచారా చిత్తక్షోభమవాప సా।
లజ్జావిస్మయదైన్యానాం సద్యస్తస్వా వశం గతా॥

తా॥ సుచరితయగు నాతన్వి ఆతనిచూచి లేచినిలువబడి లజ్జావిస్మయ దైన్యము లకు వశంగతయగుచు చూచుచుండగనే చిత్తక్షోభను పొందెను.

శ్లో॥ కోఽయం దేవోఽథ యక్షోను గంధర్వో వోరగోఽపి వా।
విద్యాధరో వా సంప్రాప్తః కృతపుణ్యాపతిర్నరః॥
ఏవం విచింత్య బహుధా నిఃశ్వస్య చ మహీతలే।
ఉపవిశ్య తథా భేజే సా మూర్ఛామిందిరేక్షణా॥

తా॥ మరియు నితడు దేవతామూర్తియా, లేక యక్షుడా, గంధర్వుడా, విద్యాధరుడా, లేక నరపతియా? ఎవడితడు? నా భాగ్యవశమున నిటకువచ్చెనని తోచుచున్నది అని పెక్కువిధముల చింతించి, దీర్ఘమగు ఒక నిట్టూర్పువిడిచి, భూమిపై చతికిలబడి కొంతసేపటికి మూర్ఛనొందెను.

శ్లో॥ సోఽపి కామశరాఘాతమవాప్య నృపతేస్సుతః।
తాం సమాశ్వాసయామాస న భేతవ్యమితి బ్రువన్॥

తా॥ ఆ రాజకుమారుడును మదనశరతాడితుడై కామవికారమునకు లోనయ్యెను, పైకితెలియనీయక-దరిజేరి సుందరీ! నీవేమియు భయపడవలసిన పనిలేదు. స్వస్థచిత్తవగుము అని చెప్పుచు నామె నూరడించెను.

శ్లో॥ సా చ స్త్రీ యా తదా దృష్టా పూర్వం తేన మహాత్మనా।
తాలవృంతముపాదాయ పర్యవీజయదాకులా॥

తా॥ ఇంతలో పూర్వము ఋతధ్వజుడు పట్టణములో ప్రవేశించునప్పుడు మిక్కిలి త్వరాన్వితయైపోవుచు కనబడిన స్త్రీయే ఇప్పుడు వ్యాకులమగు మనస్సుగలదియై, వీవనతో విసరుచు ఆమె చెంతనే రాజకుమారునకు గనపడెను.

శ్లో॥ సమాశ్వస్తా తదా పృష్టా తేన సా మోహకారణం।
కించిల్లజ్జాన్వితా బాలా తస్యై సఖ్యై న్యవేదయత్॥

తా॥ ఆ రాజకుమారునిచేత నూరడింపబడిన యాబాల "నీ విట్లు (మోహ) పరవశ వగుటకు కారణమే"మని యడుగబడినదై, చెప్పుటకు కొంచెము లజ్జించి యెట్టకేలకు ఆ విషయమును తనచెలికత్తెకు తెలియజేసెను.

శ్లో॥ సా చాస్మై కథయామాస నృపపుత్రాయ విస్తరాత్।
మోహస్య కారణం సర్వం తద్దర్శనసముద్భవమ్॥

యథా తయా సమాఖ్యాతం తద్వృత్తాంతం చ భామినీ॥

తా॥ ఆ చెలికత్తెయు ఆతనిని చూచినది మొదలు కలిగిన మోహకారణమునం తయు ఆమె తనతో చెప్పినది చెప్పినట్లుగా, సవిస్తరముగా ఆ రాజకుమారునకు యీక్రింది విధముగా నెరుకపరచెను.

సఖ్యువాచ = చెలికత్తె చెప్పెను.

శ్లో॥ విశ్వావసురితి ఖ్యాతో దివి గంధర్వరాట్ ప్రభో ।
తస్యేయమాత్మజా సుభ్రూర్నామ్నా ఖ్యాతా మదాలసా ॥

తా॥ రాజకుమారా ! దేవలోకమునందు విశ్వావసుడను ప్రసిద్ధిగల గంధర్వ రాజొకడుండెను. మదాలసయను పేరుగల యీ సుందరి అతని కుమార్తె.

శ్లో॥ వజ్రకేతోస్సుతశ్చోగ్రో దానవోఽరివిదారణః ।
పాతాళకేతుర్విఖ్యాతః పాతాళాంతరసంశ్రయః ॥

తా॥ ఇట్లుండగా, వజ్రకేతువనువాని కుమారుడును, మిగుల భయంకరుడును, శత్రువిదారకుడును, పాతాళలోకనివాసియునగు పాతాళకేతువను విఖ్యాతిగల రాక్షసుడొకడు (గలడు).

శ్లో॥ తేనేయముద్యానగతా కృత్వా మాయాం తమోమయీం ।
అపహృత్య సమానీతా బాలేయం దుష్టబుద్ధినా ।
ఆగామిన్యాం త్రయోదశ్యాముద్వక్ష్యతి కిలాసురః ॥

తా॥ ఒకప్పు డుద్యానవనవిహారము చేయుచున్న ఈ బాలికను మోసగించి యీ దుష్టబుద్ధిగల పాతాళకేతువు అపహరించి దీసికొనివచ్చెను. అంతేగాదు, రాబోవు త్రయోదశినాడు ఈమెను వివాహము చేసికొనుటకుగూడ నిశ్చయించుకొనెను.

శ్లో॥ స తు నార్హతి చార్వాంగీం శూద్రో వేదశ్రుతిం యథా ।
అతీతే చ దినే బాలాం చాత్మవ్యాపాదనోద్యతామ్ ॥
సురభిః ప్రాహ నాయం త్వాం ప్రాప్స్యతే దానవాధమః ।
మర్త్యలోకమనుప్రాప్తం య ఏనం భేత్స్యతే శరైః ।
స తే భర్తా మహాభాగే హ్యచిరేణ భవిష్యతి ॥

తా॥ సుందరాంగియగు ఈమెకు, వేదశ్రుతి శూద్రునకువలె, ఆ రాక్షసుడెంతయు తగినవాడు గానందున గడచినదినము ఈమె ఆత్మహత్య చేసికొన నుద్యమించెను. అప్పుడు ఆకాశవాణి "ఓ బాలా! నీవు ఆత్మహత్యజేసికొనబోకుము. ఈ దానవాధము డెప్పుడును నిదరిజేరలేడు. ఓ పుణ్యశాలినీ! కారణాంతరముచే మర్త్యలోకమునకు వెళ్లిన యీ

రాక్షసుని యెవడు తన బాణములచేత కొట్టి భయపెట్టునో ఆతడు నీకు అచిరకాలములోనే భర్తకాగలడు అని చెప్పెను.

శ్లో॥ అహం త్వస్యాస్సఖీ నామ్నా కుండలేతి మనస్వినీ।
సుతా వింధ్యవతః పత్నీ వీరపుష్కరమాలినః॥
హతే భర్తరి శుంభేన తీర్థాత్తీర్థమనువ్రతా।
చరామి దివ్యయా గత్యా పరలోకార్థముద్యతా॥

తా॥ నేను ఈమెకు చెలికత్తెను. నాపేరు కుండలీ. మా తండ్రి వింధ్యవంతుడు. వీరపుష్కరమాలియను నతనికి నేను భార్యను. అయితే నాభర్త శుంభుడనే రాక్షసుని చేత చంపబడుటచే పరలోకము నపేక్షించి దైవభావముతో తీర్థయాత్రలు చేయుచు తిరుగుచున్నాను.

శ్లో॥ పాతాళకేతుర్దుష్టాత్మా వారాహం వపురాస్థితః।
కేనాపి విద్ధో బాణేన మునీనాం త్రాణకారణే॥

తా॥ దుష్టాత్ముడగు పాతాళకేతువు వరాహరూపమును ధరించినవాడై మునులను బాధింప, సాధువులను రక్షింపవచ్చిన ఒకానొక మహాత్మునిచే కొట్టబడెను.

శ్లో॥ తథాఽహం తత్త్వతోఽన్విష్య త్వరితాఽహమిహాగతా।
సత్యమేవ స కేనాపి తాడితో దౌష్ట్యమాచరన్॥

తా॥ అదివిని నేను నిజమును తెలిసికొనగోరి వెదకుచు యిచ్చటికి వచ్చితిని. తరువాత దుష్టుడగు నారాక్షసుడు యేదో దౌష్ట్యమాచరించి యెవనిచేతనో కొట్టబడెనను విషయము సత్యమని తెలిసికొంటిని.

శ్లో॥ ఇయం చ మూర్ఛామగమద్యేన తత్కారణం శ్రుణు॥

తా॥ ఈమె యెందుచేత యిట్లు మూర్ఛనొందెనో ఆ కారణము వినుము.

శ్లో॥ త్వయి ప్రీతిమతీ బాలా దర్శనాదేవ మానద।
దేవపుత్రోపమే చారు వాక్స్వరూపాదిశాలిని॥

తా॥ మన్మథసదృశుడవును, మనోజ్ఞమగు రూపమును, మధురవాక్కులును గల నిన్ను చూచినదిమొదలు యీమె నీయందే ప్రీతిగలదిగా నయ్యెను.

శ్లో॥ భార్యా చాన్యస్య విహితా యేన విద్ధస్స దానవః।
ఏతస్మాత్కారణాన్మోహం మహాంతమియమాగతా॥

తా॥ ఎవనిచేత నారాక్షసుడు కొట్టబడునో అట్టివానికీమె భార్యయగునని ఆకాశవాణిచేతగూడ చెప్పబడెనుగదా? ఈ కారణమువలననే యీమె యింత మోహపరవశురాలైనది.

4

శ్లో॥ యావజ్జీవం చ తన్వంగీ దుఃఖమేవోపభోక్ష్యతి ।
త్వయ్యస్యా హృదయం రాగి భర్తా చాన్యో భవిష్యతి ॥

తా॥ నీయందేలగ్నమై రాగరంజితమగు చిత్తముగల ఈమెకు ఒరుడెవ్వడేని భర్తయగుట తటస్థించెనా, యావజ్జీవమీతన్వంగి దుఃఖమనుభవింపగలదనుట నిక్కము.

శ్లో॥ యావజ్జీవమతో దుఃఖం సురభ్యా నాన్యథా వచః ।
అహం త్వస్యాః ప్రభో ప్రీత్యా దుఃఖితాఽత్ర సమాగతా ॥

తా॥ ఇందువలన యీమెకు నేను ప్రాణసఖినగుటవలన యీమెతోపాటు నాకును జీవితాంతము దుఃఖము తప్పదు. కాని ప్రభో! సత్యవాక్కుగల ఆ కామధేనువు చెప్పిన దసత్యమగునా? కావున నో రాకుమారా! ఈమెయందుగల ప్రీతిచేతనే మనోవేదనతో నేనిచటికి వచ్చితిని.

శ్లో॥ యతో విశేషో నైవాస్తి స్వసఖీనిజదేహయోః ।
యద్యేషాభిమతం వీర పతిమాప్నోతి శోభనా ॥

తా॥ ఓ వీరోత్తంసమా! పెక్కేలేల? ఏ విషయమునందును నాకంటె యీమె వేరుగాదు. ఆ కారణముచే సద్గుణరాశియగు యీమెకు అన్నిటను అనురూపుడగు భర్త లభించినట్లయినచో,

శ్లో॥ తత స్త్వహం తపః కుర్యాం నిర్వ్యళీకేన చేతసా ।
త్వం తు కో వా కిమర్థం వా సంప్రాప్తోఽత్ర మహామతే ॥

తా॥ తరువాత నేను యే విచారము లేకుండా పరిశుద్ధమైన మనస్సుతో నిర్విచారముగా తపస్సు చేసుకొందును. ఇంతకు మహాశయా! మీరెవ్వరు? ఎందుకొరకు యిచ్చటికి వచ్చితిరి?

శ్లో॥ దేవో దైత్యోఽను గంధర్వః పన్నగః కిన్నరోఽపివా ।
న హ్యత్ర మానుషగతిర్న చేదృఙ్మానుషీ గతిః ।
త త్త్వమాఖ్యాహి కోఽసి త్వం యథైవావితథం మయా ॥

తా॥ దేవలోకనివాసియా, లేక రాక్షసుడా, గంధర్వుడా, గాక నాగకుమారుడా, లేక కిన్నరుడా, కానిచో మానవుడా అని సందేహించుచున్నాము. మొదట మనుష్యులు యిచ్చటికి వచ్చుటయే పొసగదు. విశేషించి మీబోటివారువచ్చుట అసలే సంభవింపదు. కావున నీవెవ్వరో మాతో నిజముచెప్పి సందేహమును తీర్చవలెను.

కువలయాశ్వ ఉవాచ = కువలయాశ్వుడు చెప్పెను.

శ్లో॥ యన్మాం పృచ్ఛసి ధర్మజ్ఞే క స్త్వం కిం వా సమాగతః ।
తచ్ఛృణుష్వామలప్రజ్ఞే కథయామ్యాదిత స్తవ ॥

తా॥ ధర్మజ్ఞవుసు, నిర్మల ప్రజ్ఞాశాలిని నగు ఓ కుండలీ! నీవెవరు? ఎందులకై యిచ్చటికి నీరాక యని అడిగితివి గాన నా కధనంతయు నాదినుండి చెప్పెదను వినుము.

శ్లో॥ రాజ్ఞః శత్రుజితః పుత్రః పిత్రా సంప్రేషితః శుభే।
మునిరక్షణముద్దిశ్య గాలవాశ్రమమాగతః॥

తా॥ ఓ కల్యాణీ! నేను శత్రుజిత్తనురాజు కుమారుడను. మునిరక్షణార్థమై మా తండ్రిచే నియమితుండనై గాలవముహాశ్రమమునకు వచ్చియుంటిని.

శ్లో॥ కుర్వతో మమ రక్షాం చ మునీనాం ధర్మచారిణాం।
విఘ్నార్థమాగతః కోఽపి సౌకరం వపురాస్థితః॥

తా॥ ధర్మచారులగు మునులకు రక్షణము నొసగుచూ నేనచట వుండగానే వరాహరూపమును ధరించి యెవ్వడో ఒక రాక్షసుడు వారల తపస్సునకు విఘ్న మాపాదించుటకై యచటికి వచ్చెను.

శ్లో॥ మయా స విద్ధో బాణేన చంద్రార్ధాకారవర్చసా।
అపక్రాంతోఽతివేగేన తమస్యనుగతో హయా॥

తా॥ అట్లు వచ్చిన ఆ రాక్షసుడు మిక్కిలి తేజోవంతమైన అర్ధచంద్రాస్త్రమును ప్రయోగించినప్పుడు దాని తాకిడికి సహించక మిక్కిలి వేగముగా పరుగెత్తుకొని పోయెను. నేనును గుఱ్ఱముతో వానిని వెంబడించితిని.

శ్లో॥ పపాత సహసా గర్తే స క్రోధోఽశ్వశ్చ మామకః।
సోఽహమశ్వం సమారూఢస్తమస్యేకః పరిభ్రమన్।
ప్రకాశమాసాదితవాన్ దృష్టా చ భవతీ మయా॥

తా॥ ఆ రాక్షసుడు తొందరగా పరుగెత్తుకొనిపోయి ఒక బిలములో ప్రవేశించెను. కోపముతో గూడిన ఆ గుఱ్ఱమున్ను వాని వెన్నంటి ఆ గర్తములోనే ప్రవేశించెను. నేనాయశ్వముమీదున్నవాడనయ్యే ఒంటరిగా నా చీకటిలో నిటు నటు తిరుగుచూ కొంతసేపటికి ఒక ప్రకాశమును జూచితిని. తరువాత నీవు కనబడితివి.

శ్లో॥ పృష్టా చ న చ మే కించిద్భవత్యా దత్తముత్తరం।
త్వాం చైవానుప్రవిష్టోఽహమిమం ప్రాసాదముత్తమమ్॥

తా॥ నీవెవరు? నీ తండ్రి పేరేమి? అను నీ మొదలుగాగల ప్రశ్నల నాచేత నడుగబడియు నేమియు జవాబు చెప్పకనే యీ మేడపైకి పోయితివిగదా. నేనును నిన్ను వెంబడించియే యీ సౌధము నధిరోహించితిని.

శ్లో॥ ఇత్యేతత్కథితం సత్యం న దేవోఽహం న దానవః।
న పన్నగో న గంధర్వః కిన్నరో వా శుచిస్మితే॥

తా॥ ఉన్న విషయ మింతే; యథార్థముగా నీకు చెప్పితిని. నేను అమరుడనూ గాను, అనురుడనూగాను, గరుడగంధర్వ కిన్నరులలో నెవ్వడనూగాను.

శ్లో॥ సమస్తాః పూజ్యపతమా వై దేవాద్యా మమ కుండలే ;
మనుష్యోఽస్మి విశంకా తే న కర్తవ్యాఽత్ర కర్హిచిత్ ॥

తా॥ దేవాదులగువారందరు నాకు పూజనీయులు. ఓ కుండలీ! నేను మనుష్యుడను. ఈ విషయములో నీవేమీ శంకించవలసిన పనిలేదు.

శ్లో॥ తతః ప్రహృష్టా సా కన్యా సఖీవదనముత్తమం ।
లజ్జాజడం వీక్షమాణా కించిన్నోవాచ భామినీ ॥

తా॥ ఇది వినిన తరువాత సౌందర్యలహరియగు నా కన్యక మిక్కిలి సంతోషము గల హృదయముగలదియై, లజ్జాజడ వీక్షణములతో చెలికత్తె ముఖమును చూచుచు ఏమియు పలుక కూరకుండెను.

శ్లో॥ తత్సఖీ పునరప్యేనాం ప్రహృష్టా ప్రత్యువాచ హ ।
యథావత్కథితం తేన సురభ్యా వచనానుగమ్ ॥

తా॥ అప్పుడు సంతుష్టమనస్కయగు నా కుండలియే కలుగజేసికొని "సఖీ, మదాలసా! పూర్వము మనకు సురభి చెప్పినట్లేయున్నదిగదా ఈతని వృత్తాంతమంతయు" అని చెప్పి, రాజకుమారునితో,

శ్లో॥ వీర సత్యమసందిగ్ధం భవతాఽభిహితం వచః ।
నాన్యత్ర హృదయం హ్యస్యా దృష్ట్వా స్థైర్యం ప్రయాస్యతి ॥

తా॥ ఓయీ! వీరవతంసమా! నీ మాట సత్యమును, అసందిగ్ధమునైయున్నది. ఈ విషయము పూర్వమే మాకు సురభి చెప్పియుండెను. అది యట్లుండ నిమ్ము. ధీర గంభీర సౌందర్యమూర్తివగు నిన్ను చూచిన తరవాత యీ నా ప్రియసఖి హృదయము ఇంకెచ్చటికైనను పోవుటకు సాహసించునా?

శ్లో॥ చంద్రమేవాధికా కాంతిః సముపైతి రవిం ప్రభా ।
భూతిర్ధన్యం ధృతిర్ధీరం క్షాంతిరభ్యేతి చోత్తమమ్ ॥

తా॥ నిజమంతేగదా! చంద్రుని విడచి కాంతియు, సూర్యుని విడచి ప్రభయు ఉండునా? ఐశ్వర్యము పుణ్యవంతుని, ధైర్యలక్ష్మి ధీరుని, క్షమ ఉత్తమునిగదా పొందుచున్నది.

శ్లో॥ త్వయైవ విద్ధోఽసంధిగ్ధం స పాపో దానవాధమః ।
సురభిః సా గవాం మాతా కథం మిథ్యా వదిష్యతి ॥

తా॥ తప్పక పాపాత్ముడగు ఆ రాక్షసాధముడు నీచేతనే కొట్టబడెననుట నిక్కము. ఇందు సందేహ మేమియునులేదు. గోహతయగు నా కామధేనువెట్లు అబద్ధము చెప్పును?

శ్లో॥ తద్ధన్యేయం సభాగ్యా చ తత్సంబంధమవేత్య వై ।
కురుష్వ వీర యత్కార్యం విధినైవ సమాహితమ్ ॥

తా॥ అందువలన ఓయీ వీరాగ్రణీ! నీ పరిచర్యాభాగ్యము నందనున్న యీమె నిజముగా పుణ్యశాలిని, భాగ్యవతి. ఇట్టి సౌభాగ్యమును చూమటకంటె మాకు కావలసిన దేమి? అందువలన దైవనిహితమగు నీ కార్యమును యథాతథముగా జేయుము.

పుత్రావూచతుః = పుత్రులు చెప్పిరి.

శ్లో॥ పరవానహమిత్యాహ రాజపుత్రస్సదా పితుః ।
సా చ తం చింతయామాస తుంబురుం తత్కాలే గురుమ్ ॥

తా॥ ఇట్లు కుండలి చెప్పిన మాటలు విని రాజకుమారుడు "ఓ హితకారిణీ, నేనింకను అన్నిటను అస్వతంత్రుడను, ఎల్లప్పుడు తండ్రి యాజ్ఞానువర్తినై మెలగవలయు"నని చెప్పెను. ఆమెయు దానిని విని తమ కులగురువగు తుంబురుని ధ్యానించెను.

ఋతధ్వజుడు మదాలసను వివాహమాడుట

శ్లో॥ స చాపి తత్క్షణాత్ప్రాప్తో నిగృహీతసమిత్కుశః ।
మదాలసాయాః సంప్రీత్యా కుండలాగౌరవేణ చ ॥

తా॥ ఆ తుంబురుమహర్షియు మదాలసయందుగల ప్రీతిచేతను, కుండలియందుగల గౌరవభావముచేతను, సమిత్కుశలను ధరించినవాడై తత్క్షణమే అచ్చట ప్రత్యక్షమయ్యెను.

శ్లో॥ ప్రజ్వాల్య పావకం హుత్వా మంత్రవిత్కృతమంగళాం ।
వైవాహికే విధౌ కన్యాం ప్రతిపాద్య యథాగతమ్ ॥

తా॥ మంత్రార్థముల నెరిగిన యా తుంబురుడు అగ్నిని వ్రేల్చి దాని సమక్షమున మంత్రపూతయగు కల్యాణినిగా మదాలసనుచేసి పిదప ఋతధ్వజునితో వివాహ మొనరించెను.

శ్లో॥ జగామ తపసే ధీమాన్స్వమాశ్రమపదం తతః ।

తా॥ తరువాత నాతుంబురుడు తాను వచ్చినదోవనే, తన ఆశ్రమమునకు తపస్సునకై పోయెను.

శ్లో॥ సా చాహ తాం సఖీం బాలాం కృతార్థాఽస్మి వరాననే।
సంయుక్తామనయా దృష్ట్వా త్వాంఽహం రూపశాలినీం।
తప స్తప్స్యేఽహమధునా నిర్వ్యలీకేన చేతసా॥

తా॥ కుండలియు తన ప్రియసఖియగు మదాలసను జూచి, చెలీ! నిజముగా నేనిప్పుడు కృతార్థురాలనయితిని. సుగుణసుందరరూపశాలినివగు నీకు తగిన వరుడులభించి నందులకు నేనెంతయో సంతసించుచున్నాను. ఇక నేను నిర్మలమైన, నిర్విచారమైన మనస్సుతో తపస్సునకు పోవుచున్నాను.

శ్లో॥ తీర్థాంబుధౌతపాపా చ భవిత్రీ నేదృశీ యథా।
తం చాహ రాజపుత్రం స ప్రశ్రయావనతం వచః॥
గంతుకామా నిజసఖీస్నేహవిక్లబభాషిణీ॥

తా॥ తీర్థాంబువులచేత కడుగబడిన పాపములు గలదాననై పవిత్రనగుదును అని పోవుటకు నిశ్చయించుకొని, ప్రియసఖియగు మదాలసయందలి ప్రేమచే హృదయమున నేదో చెప్పనలేని బాధతో గద్గదకంఠియై మిగుల విధేయతతో రాజపుత్రునకిట్లనియె.

కుండలియను మదాలస చెలికత్తె దాంపత్యధర్మముల నెరింగించుట

శ్లో॥ పుంభిరప్యమితప్రజ్ఞే నోపదేశో భవద్విధే।
దాతవ్యః కిముత స్త్రీభిరతో నోపదిశామి తే॥

తా॥ అమితప్రజ్ఞావంతుడవగు నీబోటివానికి ప్రాజ్ఞులగు పురుషులైనను ఉపదేశించు టనవసరము అన్నచో యిక మాబోటి స్త్రీ జనసామాన్యు లుపదేశింప బూనుకొనుట సాహసకార్యమే యగును. కావున నే నీకు చెప్పుటకు వెరచుచున్నాను.

శ్లో॥ కిం త్వస్యా స్తనుమధ్యాయాః స్నేహాకృష్టేన చేతసా।
త్వయా విశ్రంభితా చాస్మి స్మారయామ్యరిసూదన॥

తా॥ అయితే గుణసుందరి యగు యీ మదాలసయందు నాకుగల ప్రేమాతిశయమున్ను, నీయందలి విశ్వాసమున్ను నన్నీపనికి పురికొల్పుచున్నది. అందువలననే నీకీవిషయమును జ్ఞాపకము చేయ సాహసించుచున్నాను.

శ్లో॥ భర్తవ్యా రక్షితవ్యా చ భార్యా హి పతినా సదా।
ధర్మార్థకామసంసిద్ధ్యై భార్యా భర్తుస్సహాయినీ॥

తా॥ భర్తకు భార్య యెల్లప్పుడును రక్షించదగినదియు భరించదగినదియునై యున్నది. ధర్మార్థకామసిద్ధికి భర్తకు భార్య సహకారిణిగదా?

శ్లో॥ యా చ భార్యా చ భర్తా చ పరస్పరమనువ్రతౌ ।
తదా ధర్మార్థకామానాం త్రయాణామపి సంగతమ్ ॥

తా॥ భార్యాభర్త లిరువురు పరస్పర మనుకూలానురాగములు గలవారుగా నున్నప్పుడే ధర్మార్థకామములు మూడున్ను సంగతములగును.

శ్లో॥ కథం భార్యా మృతే ధర్మమర్థం వా పురుషః ప్రభో ।
ప్రాప్నోతి కామమర్థం వా తస్యాం త్రితయమాస్థితమ్ ॥

తా॥ భార్యయే లేకపోయినచో పురుషుడెట్లు ధర్మార్థకామములను బొంద జాలును? ఎందుకనగా ఆ ధర్మార్థకామములు మూడున్ను ఆమెయందే ప్రతిష్ఠితమై యున్నవి.

శ్లో॥ తథైవ భర్తారమృతే భార్యా ధర్మాదిసాధనే ।
న సమర్థా త్రివర్గోఽయం దాంపత్యం సముపాశ్రితః ॥

తా॥ అదేవిధముగా భర్తలేకపోయినను ధర్మాది సాధనమునందు భార్య అసమర్థురాలేయగును. అందువలన త్రివర్గములు దంపతులిరువురి నాశ్రయించియే యుంటున్నవి.

శ్లో॥ దేవతాపితృభృత్యానామతిథీనాం చ పూజనం ।
న పుంభిః శక్యతే కర్తుమృతే భార్యాం నృపాత్మజ ॥

తా॥ ఓ రాజకుమారా! పురుషుడు భార్యలేకుండా దేవతలనుగాని, పితృదేవతలను గాని, అతిథులనుగాని, ఆశ్రితులనుగాని యెవ్వరిని ఆదరింపజాలడు.

శ్లో॥ ప్రాప్తోఽపి చార్థో మనుజై రానీతోఽపి నిజం గృహం ।
క్షయమేతి వినా భార్యాం కుభార్యాసంగ్రహేఽపి వా ॥

తా॥ మనుజుడెంతధనార్జనపరుడై పెక్కువిధముల ధనముసంపాదించి యింటికి తీసుకొనివచ్చినను, భార్యలేనియింటిలో నదిమాయమైపోవును. ఒకవేళ భార్యయున్నను నది గయ్యాళిదియైనచో నప్పుడు ధనముండదు.

శ్లో॥ కామస్తు తస్య నైవాస్తి ప్రత్యక్షేణోపలక్ష్యతే ।
దంపత్యోః సహధర్మేణ త్రయీధర్మమవాప్నుయాత్ ॥

తా॥ గయ్యాళియగు భార్య గలవాని కోరిక లెప్పుడూ ఫలించవు. అతనికి సుఖమనునదియే సున్న. ఆవిషయము ప్రత్యక్షమే. భర్త ఒకటిచెప్పిన తానొకటిచేయు స్వభావముగల భార్యగలవానిగతి యేమగును? అందువలన దంపతులిరువురు నొకేమనస్సు గలవారయినప్పుడే, ధర్మార్థకామములను పూర్తిగా అనుభవింపగలరు.

శ్లో॥ పుత్రాణాం యోనిరన్యా వై నాన్యతో భార్యయా వినా।
పితౄనృత్రై ర్నత్థై వాన్నసాధనై రతిథీనపి॥

తా॥ మరియొక ముఖ్యకారణము ఏమనగా, భార్యలేనిదే సంతానమునకు వేరు మార్గములేదుగదా! పుత్రులనుగనుటచేత పితృదేవతలను, అన్నాదిసాధనలచేత నతిథులను,

శ్లో॥ పూజాభిరమరాం స్తద్వత్సాధ్వీం భార్యాం నరోఽవతి।
స్త్రియాశ్చాపి వినా భర్త్రా ధర్మకామార్థసంతతిః।
నైవ తస్మా త్త్రివర్గోఽయం దాంపత్యమధిగచ్ఛతి॥

తా॥ పూజలచేత దేవతలను, భార్యామూలముగానే పురుషుడు ఆరాధింపగలుగుచున్నాడు. లేనిచో ఒకటియుసాగదు. భార్యకూడ భర్తలేనిదే ధర్మకామార్థసంతతులలో నొకదానినైనను పొందజాలదు. అందువలన (ఈత్రివర్గము) ధర్మార్థకామములు దంపతుల నాశ్రయించుకొనియే యున్నవి.

శ్లో॥ ఏతన్మయోక్తం యువయోర్గమిష్యామి యథేప్సితమ్।
వర్ధ త్వమనయా సార్థం ధనపుత్రసుఖాయుషా॥

తా॥ నాకుతోచినది ఇంతమాత్రము మీ దంపతులకు చెప్పితిని. ఇక నాయిష్టము వచ్చినచోటికి పోయెదను. ధన, పుత్ర, సుఖాయుష్మంతుండవై యీమెతోగూడ వర్ధిల్లుము.

శ్లో॥ ఇత్యుక్త్వా సంపరిష్వజ్య స్వసఖీం తం నమస్య చ।
జగామ దివ్యయా గత్యా యథాభిప్రేతమాత్మనః॥

తా॥ కుండల యీ విధముగా చెప్పి తనస్నేహితురాలగు మదాలసను ఆలింగన మొనర్చుకొని, ఋతధ్వజునకు నమస్కరించి, తన యిచ్ఛవచ్చినచోటికి పోయెను.

శ్లో॥ సోఽపి శత్రుజితః పుత్రస్తామారోప్య తురంగమం।
నిర్గంతుకామః పాతాళాద్విజ్ఞాతో దనుసంభవైః॥

తా॥ ఋతధ్వజుడును తన భార్యయగు మదాలసను గుఱ్ఱముపైనిడుకొని పాతాళలోకమునుండి పోవుటకు ఉద్యమించు విషయమును దానవులు తెలిసికొనిరి.

శ్లో॥ తతస్తైస్సహసోత్కృష్టం హ్రియతే హ్రియతే త్వితి।
కన్యారత్నం యదానీతం దివః పాతాళకేతునా॥
తతః పరిఘనిస్త్రింశగదాశూలశరాయుధం।
దానవానాం బలం ప్రాప్తం సహ పాతాళకేతునా।

తా॥ వెంటనే ఆ రాక్షసులు, "పోవుచున్నాడు, తప్పించుకొని పోవుచున్నాడు, రండు, పట్టుకొనుడు" అని అరచుచూ, పాతాళకేతువు మదాలసను తీసుకొనివచ్చిన కారణముచేత ఆమె తనసొత్తనితలంచి, కత్తులు, కటారులు, గుదియలు, గదలు, శూలములు, శరములు మొదలగు ఆయుధములను ధరించి, పాతాళకేతువును పురస్కరించుకొని, ఆ రాజపుత్రునిపై దలపడిరి.

శ్లో॥ తిష్ఠ తిష్ఠేతి జల్పంత స్తే తదా దానవోత్తమాః।
శరవర్షై స్తదా శూలై ర్వవర్షుర్నృపనందనమ్॥

తా॥ ఉండుము, ఉండుము అని అరచుచూ ఆ రాక్షసులు, శూలములు, బాణములు మొదలగు ఆయుధవర్షమును ఆ రాజకుమారునిపై కురిపించిరి.

శ్లో॥ స తు శత్రుజితః పుత్ర స్తతస్తాన్ప్రతి వీర్యవాన్।
చిచ్ఛేద శరజాలేన ప్రహసన్నివ లీలయా॥

తా॥ అప్పుడు పరాక్రమశాలియగు నా రాజకుమారుడు నవ్వుచూ వారు వేసిన ఆయుధముల నన్నింటిని లీలగా బాణములచేత ఛేదించెను.

శ్లో॥ క్షణేన పాతాళతలమసిశక్త్యృష్టిసాయకైః।
ఛిన్నైస్సంఛన్నమత్యర్థమృతధ్వజశరోత్కరైః॥

తా॥ ఒక్కక్షణములో ఋతధ్వజునిచేత విడువబడిన శరసమూహములచేతను, అసి కుంత శూలాద్యాయుధములచేతను పాతాళమంతయు దట్టముగా ఆచ్ఛాదింపబడినది.

శ్లో॥ తతోఽస్త్రం త్వాష్ట్రమాదాయ చిక్షేప ప్రతి దానవాన్।
తేన తే దానవాస్సర్వే సహ పాతాళకేతునా॥
జ్వాలమాలాతితీవ్రేణ స్ఫుటదస్థిచయా స్తదా।
నిర్దగ్ధాః కాపిలం తేజః సమాసాద్యేవ సాగరాః॥

తా॥ తరువాత ఆ ఋతధ్వజుడు విరోధులగు రాక్షసులపైని బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. జ్వాలాసమూహములచే మిక్కిలి తీవ్రమైన ఆ బ్రహ్మాస్త్రముచేత ఛేదించబడిన ఎముకలు గలవారై, కపిలమహామునినుండి ఉద్భవించిన అగ్నిలో సగర చక్రవర్తి సంబంధులగు సాగరులు దగ్ధమైనట్లు, పాతాళకేతువుతోగూడ రాక్షసులందరు దగ్ధమైపోయిరి.

ఋతధ్వజుడు భార్యతోగూడ తన పట్టణమునకువచ్చి తండ్రికి నమస్కరించుట

శ్లో॥ తతస్స రాజపుత్రోఽశ్వే నిహత్యాసురసత్తమాన్।
స్త్రీరత్నేన సమం తేన సమాగచ్ఛత్పితుః పురమ్॥

తా॥ అట్లు ఆ రాజపుత్రుడగు ఋతధ్వజుడు సమస్తరాక్షసులను జయించి అశ్వారూఢుడై స్త్రీరత్నమగు మదాలసతోఁగూడ తన పట్టణమునకు వచ్చెను.

శ్లో॥ ప్రణిపత్య చ తత్సర్వం స తు పిత్రే న్యవేదయత్ ।
పాతాళగమనం చైవ కుండలాయాశ్చ దర్శనమ్ ॥

తద్వన్మదాలసాప్రాప్తిం దానవైశ్చాపి సంగరం ।
వధశ్చ తేషామస్త్రేణ పునరాగమనం తథా ॥

తా॥ అట్లు వచ్చి ఆ ఋతధ్వజుడు తండ్రికి నమస్కరించి తాను పాతాళలోకమునకు వెళ్లుట, అచట కుండలినీదర్శనము, తరువాత మదాలసను పెండ్లాడుట, రాక్షసులతో యుద్ధము, బ్రహ్మాస్త్రముతో వారిని వధించుట, తిరిగి యింటికి వచ్చుట యీ మొదలుగాగల సమస్తవిషయములను తండ్రికి చెప్పెను.

శ్లో॥ ఇతి శ్రుత్వా పితా తస్య చరితం చారు చేతసః ।
ప్రీతిమానభవచ్చైనం పరిష్వజ్యాహ చాత్మజమ్ ॥

తా॥ పవిత్రప్రేమహృదయుడగు నాతని చరిత్రమును విని తండ్రి మిక్కిలి సంతోషచిత్తుడై కుమారుని కౌగలించుకొని ఆతనితో నిట్లనియెను.

శ్లో॥ సత్పుత్రేణ త్వయా పుత్ర తారితోఽహం మహాత్మనా ।
భయేభ్యో మునయస్త్రాతా యేన సద్ధర్మచారిణా ॥

తా॥ కుమారా! మహాశయుడవును, సత్పుత్రుడవునగు నీచేత నేను తరించితిని. సద్ధర్మచారివగు నీ మూలమున మునులుగూడ భయరహితులై రక్షణమును బొందిరి.

శ్లో॥ మత్పూర్వైః ఖ్యాతిమానీతం మయా విస్తారితం పునః ।
పరాక్రమవతా వీర త్వయా తద్బహులీకృతమ్ ॥

తా॥ మనపూర్వులచేత కీర్తి ఆర్జింపబడినది. అది మరల నాచేత విస్తరింపబడినది. పరాక్రమవంతుడవగు నీవు ఆకీర్తిని మరింత సువిశాలమొనరించితివి.

తండ్రియగు శత్రుజిత్తు కుమారునకు నీతులను గరపుట

శ్లో॥ యదుపాత్తం యశః పిత్రా ధనం వీర్యమథాపి వా ।
తన్న హాపయతే యస్తు స నరో మధ్యమస్స్మృతః ॥

తా॥ కీర్తిగాని, ధనముగాని, పరాక్రమముగాని, విద్యాజ్ఞానములుగాని, తండ్రిచేతగాని గురువుచేతగాని సంపాదింపబడినవానిని యెవడు పోగొట్టక, ఉన్నదున్నట్లు సంరక్షించునో అట్టివాడు మధ్యముడుగా పరిగణింపబడును.

శ్లో॥ తద్విశ్వాద్యదధికం యస్తు పునరన్యత్ స్వశక్తితః।
నిష్పాదయతి తం ప్రాజ్ఞా వదంతి నరముత్తమమ్॥

తా॥ తండ్రిచేతగాని, గురువుచేతగాని సంపాదింపబడిన ధనయశోజ్ఞానతపః పరాక్రమాదులకంటె, స్వశక్తిచేత నెవడు మరింతయెక్కువ ఉపార్జించునో ఆతడుత్తముడని పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ గురుణా సముపాత్తాని ధనవీర్యయశాంసి వై।
న్యూనతాం నయతి ప్రాజ్ఞాస్తమాహుః పురుషాధమమ్॥

తా॥ ఎవడు గురువుచేత (తండ్రి) సముపార్జించబడిన ధన, వీర్య, యశోజ్ఞానములను కించపరచునో, అట్టివాని నధముడని ప్రాజ్ఞులందురు.

శ్లో॥ తన్మయా బ్రాహ్మణత్రాణం కృతమాసీద్యథా త్వయా।
పాతాళగమనం యచ్చ యచ్చాసురవినాశనమ్।
ఏతదభ్యధికం వత్స తేన త్వం పురుషోత్తమః॥

తా॥ అందువలన ఇదివరకు నాచేత చేయబడిన బ్రాహ్మణాది సాధురక్షణము నీచేత పరిరక్షింపబడినది. ఇది యిరువురకును సమానమే. అయితే, పాతాళలోకగమనము, రాక్షసవినాశనము అను నీకార్యములు నీచేత నధికముగా చేయబడినవి గాన నీవు పురుషోత్తముడ (పురుషశ్రేష్ఠుడ) వనుటలో సందేహమేమి?

శ్లో॥ తద్ధన్యోఽస్యథవా న త్వమహమేవ గుణాధికః।
త్వాం పుత్రమీదృశం ప్రాప్య శ్లాఘ్యం పుణ్యవతామపి॥

తా॥ అందువలన నీవు ధన్యుడవు అను నీవిషయమటుండనిచ్చి, నీకంటె నేనే ధన్యతముడననుట సముచితమే. ఎందువల్లననగా, సుకృతాత్ములకుగూడ కొనియాడదగిన నీవంటిసుపుత్రుని బడసిన నేనే గుణాధికుడననుట సమంజసముగాదా?

శ్లో॥ న సత్పుత్రకృతాం ప్రీతిమన్యః ప్రాప్నోతి మానవః।
ధిక్తస్య జన్మ యః పిత్రా లోకే విజ్ఞాయతే నరః॥
యత్పుత్రాత్ఖ్యాతిమభ్యేతి తస్య జన్మ సుజన్మనః॥

తా॥ సత్పుత్రునివలనగలుగు సంతోషము పాపాత్ముడు పొందలేడు (అనగా పుణ్యవిశేషము లేనివారికి ఉత్తమసంతానమే గలుగదని భావము). తండ్రిప్రఖ్యాతివలన యీతడు ఫలానివాని కుమారుడని లోకమునకు దెలియబడునతని జీవితము నిరర్థకము. అట్టివానివలన పితరుల జీవితము వ్యర్థమగును. ఎవడు పుత్రునివలన విఖ్యాతినొందునో ఆతని జన్మయే ఉత్తమోత్తమము.

"పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడె పుట్టదు, జనులా
పుత్రుని గనుగొని పొగడగ పుత్రోత్సాహంబునాడు పొందుర సుమతీ॥

"కొరగాని కొడుకుబుట్టిన కొరగామియెగాదు తండ్రిగుణములు చెరచున్
చెరకుతుద వెన్ను బుట్టిన చెరకున తీపెల్ల చెరచు సిద్ధము సుమతీ"
అని పెద్దలవచనము.

శ్లో॥ ఆత్మజ్ఞానీ యతో ధన్యో మధ్యః పితృపితామహైః ।
మాతృపక్షేణ మాత్రా చ ఖ్యాతిం యాతి నరాధమః ॥

తా॥ స్వోపార్జితజ్ఞానముతో కీర్తిప్రతిష్ఠలనందువా డుత్తముడు. పితృపితామహుల యశస్సువలన చెప్పుకొనబడువాడు మధ్యముడు. తల్లివంకవారినుండిగాని, తల్లి వలనగాని ఖ్యాతిని బొందువాడు అధముడు.

శ్లో॥ తత్పుత్ర ధనవీర్యైస్త్వం వివర్ధస్వ సుఖేన చ ।
గంధర్వతనయా చేయం మా వియుజ్యతు వై త్వయా ॥

తా॥ ఆకారణమున నాయనా! ఉత్తమోత్తముడవగు నీవు ధన వీర్య యశో బల జ్ఞానవంతుడవై సుఖముగా వర్ధిల్లుము. గంధర్వరాజకుమారియగు నీమదాలసయు సతతము నిన్నెడబాయక నీకభిమానపాత్ర యగుగాక!

శ్లో॥ ఇతి పిత్రా బహువిధం ప్రియముక్త్వా పునః పునః ।
పరిష్వజ్య స్వమావాసం సభార్యస్స విసర్జితః ॥

తా॥ ఈ విధముగా తండ్రి, ఋతధ్వజునికి బహువిధములగు ప్రియోక్తులను జెప్పి ఆనందాతిరేకముచే మాటిమాటికి కౌగలించుకొనుచు ఆతనికొరకు యేర్పరుపబడిన నివాసమునకు భార్యయగు మదాలసతోగూడ పంపివేసెను.

శ్లో॥ స తయా భార్యయా సార్ధం రేమే తత్ర పితుః పురే ।
అన్యేషు చ తథోద్యానవనపర్వతసానుషు ॥

తా॥ ఆ ఋతధ్వజుడును భార్యతోగూడ అంతఃపురాదులయందును, యితరములగు ఉద్యానవనములయందును, పర్వతసానువులయందును విహరించెను.

శ్లో॥ శ్వశ్రూశ్వశురయోః పాదౌ ప్రణిపత్య చ సా శుభా ।
ప్రాతః ప్రాతస్తతస్తస్య ప్రణిపత్య సుమధ్యమా ॥

తా॥ శుభలక్షణాన్వితయగు నా మదాలస ప్రతినిత్యము ప్రాతఃకాలమునందు అత్తమామలకును, భర్తపాదములకు నమస్కరించి సంతోషముతో కాలముగడుపుచుండెను.

ఇతి శ్రీమార్కండేయమహాపురాణే కువలయాశ్వీయే
ఏకోనవింశోఽధ్యాయః

ఇది మార్కండేయమహాపురాణమునందలి కువలయాశ్వచరిత్రమను
పందొమ్మిదవ అధ్యాయము



పుత్రావూచతుః = కుమారులు చెప్పిరి.

శ్లో॥ తతః కాలే బహుతిథే గతే రాజా పునస్సుతం ।
ప్రాహ గచ్ఛ సువిప్రాణాం త్రాణాయ చర మేదినీమ్ ॥

తా॥ ఇట్లు కొంతకాలము గడచినపిదప శత్రుజిత్తు కుమారుని పిలచి సాధుసజ్జనుల సంత్రాణార్థము అప్పుడప్పుడు భూసంచార మొనరింపుచుండుము అని చెప్పెను.

శ్లో॥ అశ్వమేతం సమారుహ్య ప్రాతః ప్రాతర్దినే దినే ।
ఆబాధాద్విజముఖ్యానామన్వేష్టవ్యా స్సదైవ హి ॥

తా॥ ప్రతిదినమును ప్రాతఃకాలమునందు యీ యశ్వము నధిరోహించి తిరుగుచూ సాధుసత్తములగు ద్విజోత్తములకు బాధకలుగకుండునట్లు చూడదగినది.

శ్లో॥ దుర్వృత్తాస్సంతి శతశో దానవాః పాపబుద్ధయః ।
తేభ్యో న స్యాద్యథా బాధా మునీనాం త్వం తథా కురు ॥

తా॥ దుర్వృత్తులగు పాపబుద్ధిగల రాక్షసులనేకులు సాధువులకు బాధగలిగించుటకు తిరుగుచుందురు. అట్టి దుర్మార్గులనుండి మునులకు సజ్జనులకు బాధకలుగకుండునట్లు జూడుము.

శ్లో॥ స తథోక్తస్తదా పిత్రా తథా చక్రే నృపాత్మజః ।
పరిక్రమ్య మహీం కృత్స్నాం వవందే చరణౌ పితుః ॥

తా॥ అట్లు తండ్రిచేత నియోగింపబడి, రాజకుమారుడగు నా ఋతధ్వజుడును సమస్త భూమండలమును పరిభ్రమించి దుష్టనిగ్రహమును, శిష్టరక్షణ మొనరించి మరలవచ్చి తండ్రి పాదములకు నమస్కరించెను.

శ్లో॥ అహన్యహని సంప్రాప్తే పూర్వాహ్ణే నృపనందనః ।
తతశ్చ శేషం దివసం తయా రేమే సుమధ్యయా ॥

తా॥ ఇట్లు ఉదయమునందొకసారి సంచరించుచు తక్కిన సమయములయందు నా మదాలసతోగూడి విహరించుచు ఆనందముగా కాలము గడుపుచుండెను

ఋతధ్వజుడు ప్రజారక్షణార్థము పరిభ్రమించుచు తాళకేతువను రాక్షసునిచేత మోసగింపబడుట

శ్లో॥ ఏకదా తు చరన్ సోఽథ దదర్శ యమునాతటే ।
పాతాళకేతోరనుజం తాళకేతుం కృతాశ్రమమ్ ॥

తా॥ ఇట్లు సంచరించుచు, ఒకనాడు యమునాతీరమునందు ఆశ్రమ మేర్పరచుకొనియున్న పాతాళకేతువు సోదరుడగు తాళకేతువును ఆ ఋతధ్వజుడు చూచెను.

శ్లో॥ మాయావీ దానవః సోఽథ మునిరూపం సమాశ్రితః।
స ప్రాహ రాజపుత్రం తం పూర్వవైరమనుస్మరన్ ॥

తా॥ మునిరూపమును ధరించిన మాయావియగు నా రాక్షసుడు పూర్వవైరమును లోపల నిడుకొని రాజపుత్రుని వంచించవలెనను తలంపుతో నిట్లనియె.

శ్లో॥ రాజపుత్ర బ్రవీమి త్వాం తత్కురుష్వ యదీచ్ఛసి।
న చ తే ప్రార్థనాభంగః కార్యః సత్యప్రతిశ్రవ ॥

తా॥ ఓ రాజకుమారా! నీకొక విషయమును చెప్పదలంచుచున్నాను. అది నీకిష్టమైనచో ఆజ్ఞ చేయుము. అయితే సత్యప్రతిజ్ఞాపరుడవగు నో రాకుమారా! నా యీ ప్రార్థనను భంగము చేయవనియే నమ్ముచున్నాను.

శ్లో॥ యక్ష్యే యజ్ఞేన ధర్మాయ కర్తవ్యాశ్చ మయేష్టయః।
చింతయే తత్ర కర్తవ్యా నాస్తి మే దక్షిణా యతః ॥

తా॥ ధర్మసముపార్జనముకొరకు నేను యజ్ఞమును చేయదలంచితిని. అంతేగాదు అసలు యజ్ఞములు చేయుటగూడ నాకు కర్తవ్యమైయున్నది. అయినను యజ్ఞమందు దక్షిణయివ్వవలయునే? అది నావద్ద లేదుగదా! ఏమి చేయవలయును? అని విచారించుచున్నాను.

శ్లో॥ తతః ప్రయచ్ఛ మే వీర దక్షిణార్థే స్వభూషణం।
యదేతత్కంఠలగ్నం చ రక్ష చేమం మమాశ్రమమ్ ॥

తా॥ అందువలన దానవీరుడవగు నో రాజకుమారా! యజ్ఞదక్షిణార్థము నీ కంఠమునందున్న యీ ఆభరణము నిమ్ము. ఇంతమాత్రమే పుణ్యమును గట్టుకొనుము. ఈ నా ఆశ్రమమును రక్షింపుము.

శ్లో॥ యావదంతర్జలే దేవం వరుణం యాదసాం పతిం।
వైదికైర్వారుణైర్మంత్రైః ప్రజానాం పుష్టిహేతుకైః ॥
అభిష్టూయ త్వరాయుక్తః సమభ్యేమీతి వాదినం।
తం ప్రణమ్య తతః ప్రాదాత్స తస్మై కంఠభూషణమ్ ॥

తా॥ నీవీ భూషణమును యిచ్చినచో దానిని దీసికొని యీ జలములో అంతర్లీనుడైయున్న జలాధిదేవతయగు వరుణదేవుని ప్రజాపుష్టిహేతుకములును, వైదికములగు వారుణమంత్రములతో స్తుతించి, పూజించి మరల త్వరలోనే రాగలనని చెప్పుచున్న కపటవేషధారియగు నాతని మాటలను నమ్మి నిజమే యనుకొని నమస్కారపూర్వకముగా నా రాజకుమారుడు తన కంఠాభరణము నిచ్చివేసెను.

శ్లో॥ ప్రాహ చైనం భవాన్యాతు నిర్వ్యలీకేన చేతసా।
స్థాస్యామి తావదత్రైవ భవాశ్రమసమీపతః॥

తా॥ మరియు మీరు నిర్విచారమగు మనస్సుతో సంతోషముగా పోయిరండు. మీరు మరలివచ్చువరకు నేనిచ్చట నేయుండి మీ యాశ్రమమును రక్షించుచుందును అని చెప్పెను.

శ్లో॥ తవాదేశాన్మహాభాగ యావదాగమనం తవ।
న తేఽత్ర కశ్చిదాబాధాం కరిష్యతి మయి స్థితే॥

తా॥ ఓ మహాభాగా! మీ యాజ్ఞానుసారము మీరు మరల వచ్చునంతవరకు నేనిచ్చటనే వుండగలను. నేనిచట నున్నంతవరకు యెవ్వడును ఎట్టి బాధనైనను మీ ఆశ్రమమునకు కలుగజేయజాలడు.

శ్లో॥ విస్రబ్ధస్త్వం మునిశ్రేష్ఠ కురుష్వ చ మనోగతం।
ఏతదుక్తస్తత స్తేన స మమజ్జ నదీజలే॥

తా॥ ఓ మునిసత్తమా! నాయందు నమ్మకముంచి యథేష్టముగా మీ కార్యమును జేసికొనుడు అని రాజకుమారుడు చెప్పగా విని మునివేషధారియగు నా రాక్షసుడు తక్షణమే నదీజలమునందు మునిగిపోయెను.

శ్లో॥ అరక్షతోఽపి తస్యైవ మాయావిహితమాశ్రమం।
గత్వా జలాశయాత్తస్మాత్తాలకేతుశ్చ తత్పురమ్॥

తా॥ తరువాత ఆ రాజకుమారుడున్ను కృత్రిమనిర్మితమగు ఆ రాక్షసుని ఆశ్రమమును ఆవిధముగనే రక్షించుచుండెను. తాళకేతువున్ను ఆ జలాశయమునుండియే కొంతదూరముపోయి దానినుండి బయలువెడలి ఋతధ్వజుని పట్టణము జేరుకొనెను.

శ్లో॥ మదాలసాయాః ప్రత్యక్షమన్యేషాం చైతదుక్తవాన్।
వీరః కువలయాశ్వోఽసౌ మమాశ్రమసమీపతః॥
కేనాపి దుష్టదైత్యేన కుర్వన్ రక్షాం తపస్వినాం।
యుధ్యమానో యథాశక్తి నిఘ్నన్బ్రహ్మద్విషో యుధి॥
మాయామాశ్రిత్య పాపేన భిన్నః శూలేన వక్షసి।
మ్రియమాణేన తేనేదం దత్తం మే కంఠభూషణమ్॥

తా॥ తరువాత అంతఃపురములో ప్రవేశించి మదాలసయొక్కయు ఇతరులగు మరికొందరి అంతఃపురజనులయొక్కయు సమక్షమున, తల్లులారా! వీరుడగు కువలయాశ్వుడు (ఋతధ్వజుడు) మా యాశ్రమసమీపమునందు తపఃసంపన్నులగు మునిజనరక్షణార్థము ఒకానొక దుష్టరాక్షసునితో యుద్ధముచేయుచు, యథాశక్తి బ్రహ్మద్వేషులగు నా

రాక్షసులను చంపుచు తుదకు, మాయావియగు నొకరాక్షసునిచేత శూలాయుధముచే వక్షస్థలమునందు కొట్టబడినవాడై ప్రాణములను విడమటకుముందు నాకీయాభరణము నొసంగి అసువులను బాసెను.

శ్లో॥ ప్రాపితశ్చాగ్నిసంయోగం శోకార్తైః స తు తాపసైః।
కృతార్తహాహాశబ్దో వై త్రస్తః సాశ్రువిలోచనః॥

తా॥ దుఃఖముతో కూడుకొన్న తాపసులు ఆ ఋతధ్వజునికి అగ్నిసంస్కారమొనరించిరి. అశ్వమున్నూ మిగుల దుఃఖముతో భయాందోళిత హాహారవము గలదియై కన్నీరుకార్చుచూ ఉండగా,

శ్లో॥ నీతః సోఽశ్వశ్చ తేనైవ దానవేన దురాత్మనా।
ఏతన్మయా నృశంసేన దుష్టం దుష్కృతకారిణా॥

తా॥ దానిని ఆ దురాత్ముడగు రాక్షసుడే తీసికొనిపోయెను. దురదృష్టవశాత్తు ఆ దుర్ఘటనమును నేనుచూచుట తటస్థించినందున దానిని చెప్పి పరులకు బాధగలిగించిన పాపాత్ముడనైతిని.

శ్లో॥ యదత్రానంతరం కృత్యం కురుష్వోత్తరకాలికం।
హృదయాశ్వాసనం చైతద్గృహ్యతాం కంఠభూషణమ్॥

తా॥ ఆ కారణమువల్ల యిటుపైని చేయదగిన ఔత్తరకాలికక్రియలను చేయుండు. ఈ కంఠభూషణమువలన మనస్సునకు కొంత ఊరట కలుగగలదు దీనిని తీసికొనుడు.

శ్లో॥ నాస్మాకం హి సువర్ణేన కృత్యమస్తి తపస్వినాం।
ఇత్యుక్త్వోత్సృజ్య తద్భూమౌ స జగామ యథాగతమ్॥

తా॥ తపస్వులమగు మాకు యీ బంగారముతో నేమి కార్యము? దీనితో మాకు పనిలేదు అని చెప్పి దానినచ్చటనే భూమిపైనిడి తాను వచ్చినట్లోవనే మరలిపోయెను.

శ్లో॥ నిపపాత జనః సోఽథ శోకార్తో మూర్ఛయాతురః।
క్షణేన చేతనాం ప్రాప్య సర్వాస్తా నృపయోషితః॥

తా॥ ఈ వార్తవినగానే మిగుల ఆందోళితమనస్సుగలదై, అంతఃపురజనము శోకార్తనాదములతో మునిగి మూర్ఛనొందెను. మరల కొంతసేపటికి తెలివినొంది, రాజకాంతలందరును,

శ్లో॥ రాజపత్న్యశ్చ రాజా చ విలేపురతిదుఃఖితా।

తా॥ రాజపత్నులును, రాజును మిగుల దుఃఖముతో విలపించిరి.

శ్లో॥ మదాలసా తు తద్దృష్ట్వా తదీయం కంఠభూషణం।
మృతో భర్తేతి నిశ్చిత్య కథం జీవామి తం వినా॥

తత్యాజ సుప్రియా న్ప్రాణాన్ శ్రుత్వా వినిహతం ప్రియం।
తతః పురే మహాక్రందః పౌరాణాం భవనేష్వభూత్ ॥

తా॥ మదాలసయితే, తనభర్త సంబంధమైన ఆ కంఠాభరణమును చూచి, తన భర్త మృతినొందెనని చెప్పినమాటలు నిజమని నిశ్చయించుకొని, మిక్కిలి ప్రియతమములగు ప్రాణములను వెంటనే విడిచెను. అందువలన పట్టణమునందలి ప్రతియింటను రోదనధ్వని ద్విగుణీకృతముగా అలముకొనెను.

శ్లో॥ యథైవ తస్య నృపతేః స్వగృహే సమవర్తత।
రాజా చ తాం మృతాం దృష్ట్వా వినా భర్త్రా మదాలసామ్॥

తా॥ ఏ విధముగా రాజగృహమునందు ఆక్రందనాదులు బయలు వెడలినవో, అట్లే పురజనుల గృహములును రోదనములతో నిండిపోయినవి. రాజును, పతిలేని కారణమున మృతినొందిన యీమదాలసను చూచి —

శ్లో॥ ప్రత్యువాచ జనం సర్వం విమృశ్య స్వస్థమానసః।
న రోదితవ్యం పశ్యామి భవతామాత్మన స్తథా॥

తా॥ తనలోతాను నిత్యానిత్యములనుగూర్చి విమర్శించుకొని, స్వస్థచిత్తుడై, జనుల నుద్దేశించి యిట్లనియెను. ఈ విషయమునందు మనము దుఃఖించవలసిన పనేమియులేదు.

శ్లో॥ సర్వేషామేవ సంచింత్య సంబంధానామనిత్యతాం।
కిన్ను శోచామి తనయం కిన్ను శోచామ్యహం స్నుషామ్॥

తా॥ ఎందుకనగా, సమస్తప్రాణులకుగల సంబంధములును అనిత్యములని విచారించి తెలుసుకొనిన పిదప, కొడుకైననేమి? కోడలైననేమి? మరెవరైనను దుఃఖమెట్లు గలుగును? ఎవనినిగూర్చి దుఃఖింతును?

శ్లో॥ విమృశ్య కృతకృత్యత్వాన్మన్యేఽశోచ్యావుభావపి।
మచ్ఛుశ్రూషుర్మద్వచనాద్ద్విజరక్షణతత్పరః॥

తా॥ ఆలోచించినట్టయితే కృతకృత్యులగుటవలన ఆ యిద్దరినిగూర్చి గూడ దుఃఖింపవలసిన పనిలేదనియే అనుకొనుచున్నాను. నిరంతరము నాసేవచేయుచు, నా యాజ్ఞచొప్పునసే బ్రహ్మజ్ఞానసంపన్నులగు సాధుపురుషుల రక్షణమునందు తత్పరుడై,

శ్లో॥ ప్రాప్తో మేఽద్య సుతో మృత్యుం కథం శోచ్యస్స ధీమతాం।
అవశ్యమత్యజద్దేహం తద్ద్విజానాం కృతే యది॥
మమ పుత్రేణ సంత్యక్తం నన్వభ్యుదయకారి తత్।
ఇయం చ సత్కులోత్పన్నా భర్తర్యేవమనువ్రతా॥

తా॥ నా కుమారుడు నేడు మృత్యువును పొందినాడన్న చో, ఆవిషయమై బుద్ధిమంతులు దుఃఖించవలసిన పనేమున్నది? సాధుసంరక్షణకొరకే నాకుమారుడు దేహత్యాగమును చేసెనన్నచో, అది మిగుల సంభావనమును సుశ్లాఘ్యమునైన విషయము. సత్కులసంజాతయగు ఈ మదాలసయు భర్త ననుసరించినదగుటవలన విచారింపదగినదిగాదు.

శ్లో॥ కథం తు శోచ్యా నారీణాం భర్తురన్యన్న దైవతం।
అస్మాకం బాంధవానాం చ తథాఽన్యేషాం దయావతామ్॥

తా॥ స్త్రీలకు భర్తకంటె మరియొకదైవము లేనికారణమున మనకుగాని, బంధువులకుగాని, కరుణార్ద్రహృదయులగు యితరులకుగాని, ఈమెనుగూర్చి దుఃఖించవలసిన పనిలేదు.

శ్లో॥ శోచ్యా హ్యేషా భవేదేవం యది భర్త్రా వియోగినీ।
యా తు భర్తృవధం శ్రుత్వా తత్ క్షణాదేవ భామినీ॥
భర్తారమనుయాతేయం న శోచ్యాతో విపశ్చితాం।
తాశ్శోచ్యా యా వియోగిన్యః సహ భర్త్రా కులాంగనాః॥

తా॥ ఒకవేళ యీమె భర్తృవియోగమును బొంది జీవించియున్నచో మనము విచారింపవలసినదే. కాని భర్త మరణించె నన్నవార్త వినినవెంటనే యీమెయు భర్త ననుసరించిపోయినది. ఇక నీమెను గురించి ప్రాజ్ఞులు విచారించవలసినపనేమున్నది? భర్త మరణించిన పిదపగూడ జీవించియుండిన కులాంగనలనుగూర్చి తప్పక విచారపడవలసినదే.

శ్లో॥ కష్టప్రాంత్యా న గచ్ఛంతి కష్టదాస్స్యుః కులాత్మజాః।
భర్తుర్వియోగ స్త్వనయా నానుభూతః కృతజ్ఞయా॥

తా॥ కష్టమనెడి (అన్నిటికంటె ప్రాణములు తీపిగావున) భ్రాంతితో యెవరు సహగమన మాచరింపరో అట్టివారు తమకును కులమునకుగూడ కష్టమును గలిగించినవారగుదురు. కృతజ్ఞతాస్వరూపిణియగు నీమెచేత భర్తృవియోగము అనుభవింపబడలేదు.

శ్లో॥ దాతారం సర్వసౌఖ్యానామిహ చాముత్రచోభయోః।
లోకయోః కా హి భర్తారం నారీ మన్యేత మానుషమ్॥

తా॥ ఇహపరములగు ఉభయలోకములలోను సర్వసౌఖ్యప్రదాతయగు భర్తను పతివ్రతయగు యే స్త్రీ మనుష్యమాత్రునిగా తలంచును? అనగా సాక్షాద్దైవమనియే భావించునని భావము.

శ్లో॥ న స శోచ్యో న చైవేహ నాయం తజ్జననీ న చ।
త్యజతా బ్రాహ్మణార్థాయ ప్రాణాన్స్వే స్మ తారితాః॥

తా॥ ఈ విధముగా మరణించిన నా కుమారుని గురించిగాని, బ్రతికయుండిన నా గురించిగాని, వాని తల్లినిగూర్చిగాని యేమియు చింతింపవలసిన అవసరములేదు. ఎందుకనగా బ్రాహ్మణరక్షణార్థమై ప్రాణముల నర్పించి తాను తరించుటయేగాక మమ్ముల నందరిని తరింపజేసెను.

శ్లో॥ విప్రాణాం మమ ధర్మస్య గతః స తు మహీపతిః।
ఆనృణ్యం పితృభక్తస్య త్యాగాద్దేహస్య మే సుతః॥

తా॥ బ్రాహ్మణరక్షణమను అట్టి ధర్మముకొరకును, నా యాజ్ఞాపాలనమను ధర్మము నిమిత్తము ఆ మహారాజు (నా కుమారుడు) పరలోకగతుడయ్యెను. పూర్ణానుభవము లేనివాడైనను మా ఋణమునుండి విముక్తుడై నా కుమారుడు గతించెను.

శ్లో॥ మాతృః సతీత్వం మద్వంశవైమల్యం శౌర్యమాత్మనః।
సంగ్రామే సంత్యజన్ప్రాణాన్ సోఽవిందద్ద్విజరక్షణాత్॥

తా॥ బ్రహ్మజ్ఞానసంపన్నులగు బ్రాహ్మణులను రక్షించుటవలన యుద్ధమునందు ప్రాణసమర్పణము గావించినను మాతృసతీత్వమును మా వంశముయొక్క నిర్మలప్రతిష్ఠను తనయొక్క శౌర్యమును ఆతడు ప్రకటించి నిర్మల యశోవంతుడయ్యెను.

శ్లో॥ తతః కువలయాశ్వస్య మాతా భర్తురనంతరం।
శ్రుత్వా పుత్రవధం తాదృక్ ప్రాహ హృష్టా తు తత్పతిమ్॥

తా॥ తరువాత కువలయాశ్వుని తల్లి అట్టి ఘోరమగు కుమారుని మరణమును విని శోకించుటకు బదులుగా మిక్కిలి సంతుష్టాంతరంగయై భర్తతో నిట్లనెను.

శ్లో॥ న మే మాత్రా న మే స్వస్రా ప్రాప్తా ప్రీతిర్నృపేదృశీ।
శ్రుత్వా మునిపరిత్రాణే హతం పుత్రం యథా మయా॥

తా॥ నృపోత్తమా! మునిజనరక్షణార్థమై నా కుమారుడు ప్రాణత్యాగమును జేసెనని వినుటవలన గలిగిన సంతోషముకన్న అధికమగుప్రీతి, నాతల్లినుండిగాని, లేక తోడబుట్టువులనుండిగాని, లేక మరెవ్వరినుండిగాని కలుగలేదు.

శ్లో॥ శోచతాం బ్రాహ్మణానాం యే నిస్వనేనాతిదుఃఖితాః।
మ్రియంతే వ్యాధినా క్లిష్టాస్తేషాం మాతా వృథా ప్రజా॥

తా॥ బ్రాహ్మణులు కష్టపడుచూ దుఃఖించుచుండగా దానికితగిన ప్రతిక్రియ జేయలేక తాము కష్టపడుచూ యెవరు పెద్దరోదనముజేయుచూ మరణింతురో అట్టి

వారితల్లి గన్నసంతానము వ్యర్థము. అనగా అట్టి కుమారులుండియు లేనివారనియే భావము.

శ్లో॥ సంగ్రామే యుద్ధ్యమానా యే భీతా గోద్విజరక్షణే ।
క్షుణ్ణాః శస్త్రైర్విపద్యంతే త ఏవ భువి మానవాః ॥

తా॥ గో, ద్విజరక్షణమునందు భీతిగలవారై వారికొరకు యెట్టిపోరాటమునైనను సాగించుచు, యుద్ధమునందు శస్త్రములచేత చిందరవందర చేయబడియెడు శరీరముగల విపత్తులనైనను యెవరెదుర్కొందురో వారే నిజమగు మానవులు.

శ్లో॥ అర్థినాం మిత్రవర్గస్య విద్విషాం చ పరాఙ్ముఖః ।
యేన యాతి పితా తేన పుత్రీ మాతా చ వీరసూః ॥

తా॥ యాచకులకు యిచ్చుటయందును, మిత్రవర్గము నాదరించుటయందును, శత్రువుల నెదిరించుటయందును పరాఙ్ముఖత్వమును యెవడు పొందడో, అట్టివానిగన్న వాడే పుత్రవంతుడు, ఆతనిగన్న తల్లియే వీరమాత.

శ్లో॥ గర్భక్లేశః స్త్రియో మన్యే సాఫల్యం భజతే తదా ।
యదారివిజయీ వా స్యాత్సంగ్రామే వా హతః సుతః ॥

తా॥ తనకుమారుడు శత్రుంజయుండైనను లేక యుద్ధమునందు వీరస్వర్గమలంకరించినను, ఆతల్లి నాకడుపు ఫలించినదనియు, నాజన్మ సాఫల్యమైనదనియు తలంచును. లేనిచో ఆమెకు యౌవనోచ్ఛేదకుతారమైన వీనివలన కడుపుచేటు తప్ప మరేమియు లేదని తలంతును.

శ్లో॥ తతః స రాజా సంస్కారం పుత్రపత్న్యమలంభయత్ ।
నిర్గమ్య చ బహిః స్నాతో దదౌ పుత్రాయ చోదకమ్ ॥

తా॥ తరువాత ఆశత్రుజిత్తు కోడలికి అగ్నిసంస్కారాదులను చేయించి, వెలుపలికి వెడలి స్నాతుడై కుమారునకు జలాంజలి నిచ్చెను.

శ్లో॥ తాళకేతుశ్చ నిర్గమ్య తథైవ యమునాజలాత్ ।
రాజపుత్రమువాచేదం ప్రణయాన్మధురం వచః ॥

తా॥ తాళకేతువుగూడ మొదట తానువచ్చినదారినే (యమునానదీతోయముల నుండియే) బయలువెడలి, మిక్కిలిప్రేమ నభినయించుచు రాజపుత్రునితో మృదుమధురమగు వాక్కులతో నిట్లనెను.

శ్లో॥ గచ్ఛ భూపాలపుత్ర త్వం కృతార్థోఽహం కృత స్త్వయా ।
వాంఛితం తు కృతం కార్యం త్వయ్యత్రావిచలే స్థితే ॥

తా॥ ఓ రాజకుమారా! నీవిక వెళ్లవచ్చును. నీవు నన్ను కృతార్థునిగా జేసితివి. నీవిచట స్థిరచిత్తుడవై నిలిచినందున నాయభీష్టము నెరవేరినది.

శ్లో॥ వారుణం యజ్ఞకార్యం చ జలేశస్య మహాత్మనః।
తన్మయా సాధితం సర్వం యన్మమాసీదభీప్సితమ్॥

తా॥ మహాత్ముడగు వరుణదేవునకు ప్రీతికరమగు వారుణయజ్ఞము మొదలు నా యభీష్టములగు సర్వకార్యములును నీవలన నెరవేర్పబడినవి.

శ్లో॥ ప్రణిపత్య స తం ప్రాగాద్రాజపుత్రః పురం పితుః।
సమారుహ్య తమేవాశ్వం సుపర్ణానిలవిక్రమమ్॥

తా॥ ఇట్లు చెప్పుచున్న ఆ కపటమానికి నమస్కరించి రాజకుమారుడు గరుడ, వాయువేగముగల ఆ యశ్వము నెక్కి తన పట్టణమునకు పోయెను.

ఇతి మార్కండేయమహాపురాణే కువలయాశ్వీయే వింశోఽధ్యాయః

ఇది మార్కండేయమహాపురాణమునందలి కువలయాశ్వీయచరితమునందు
ఇరువదవ అధ్యాయము.

---

శ్లో॥ స రాజపుత్రః సంప్రాప్య వేగాదాత్మపురం తతః।
పిత్రోర్వివందిషుః పాదౌ దిదృక్షుశ్చ మదాలసామ్॥

తా॥ ఆ రాజకుమారుడు తండ్రికి నమస్కరించవలెననియు, మదాలసను జూడవలెననియు ఆతురతతో పట్టణమును ప్రవేశించి,

శ్లో॥ స దదర్శ తదుద్విగ్నమప్రహృష్టముఖం పురం।
పునశ్చ విస్మితాకారం ప్రహృష్టవదనం పునః॥

తా॥ ఆ రాజకుమారుడు మొదట ప్రవేశించగానే కలతజెంది సంతోషచిహ్నములు లేక దీనభావముతోగూడి కళావిహీనమైన పట్టణమును జూచెను. తనను (రాజకుమారుని) జూచిన తరువాత విస్మితమును, ప్రసన్నమును బొందుటను జూచెను.

శ్లో॥ అన్యముత్ఫుల్లనయనం దిష్ట్యా దిష్ట్యేతి వాదినం।
పరిష్వజంతమన్యోన్యమతికౌతూహలాన్వితమ్॥
స రాజపుత్రో మిత్రం తు ఉత్ఫుల్లనయనం శుభం।
ఆలిలింగ తదా కాలే సౌహృదేన పరేణ చ॥

తా॥ మరియు వికసించిన నేత్రములు గలిగి "అదృష్టవంతులము, అదృష్టవంతులము" అని చెప్పుచు మిక్కిలి కుతూహలముతో గూడుకొని ఒకరినొకరు ఆలింగనము

చేసికొనుచున్నటువంటి పట్టణమును జూచెను. అనగా రాజకుమారుని జూచినందువలన ఆ పట్టణమునందున్న ప్రజలు మిక్కిలి సంతోషముతో ఒకరినొకరు ఆలింగనము చేసికొనుచు, అదృష్టవంతులమని ఒకరితో నొకరు చెప్పుకొనుచు ఉత్సాహముతో నుండిరి. మరియు నా రాజకుమారుడు పట్టణాని ఆనందముతో వికసితనేత్రములుగల మిత్రులను ఆలింగనము చేసికొనెను.

శ్లో॥ తతః పౌరాస్తదాలోక్య దిష్ట్యా దిష్ట్యేతి వాదినః।
చిరంజీవోరుకల్యాణహా తాస్తే పరిపంథినః॥

తా॥ తరువాత పురజనులు "అదృష్టము ఎంత అదృష్టము" అని చెప్పుచూ రాజకుమారుని జూచి "ఓ కల్యాణమూర్తీ! చిరకాలము జీవింపుము. నీ శత్రువులందరు నశింతురుగాక!" అని దీవించిరి.

శ్లో॥ పిత్రోః ప్రహ్లాదయాశు న స్తథాస్మాకమకంటకః।
ఇత్యేవం వాదిభిః పౌరైః పురః పృష్ఠే చ సంవృతః॥

తా॥ అదేవిధముగా తండ్రిని సంతోషపెట్టుము. మమ్ములను దయతో జూడుము అని యిట్లు చెప్పుచున్న పురజనులతో వెనుక ముందు చుట్టుకొనబడినవాడై,

శ్లో॥ తత్క్షణప్రభవానందః ప్రవివేశ పితుర్గృహం।
పితా చ తం పరిష్వజ్య మాతా చాన్యే చ బాంధవాః॥

తా॥ తాత్కాలికముగా పొడసూపిన ఆనందముతో పితృనివాసభవనమును ప్రవేశించెను. తండ్రియు, తల్లియు, అచటగల బంధువులును ఆతనిని కౌగలించుకొని,

శ్లో॥ చిరంజీవోరుకల్యాణ దదా చాస్మై తదాశిషః।
ప్రణిపత్య తతః సోఽథ కిమేతదితి విస్మితః।
పప్రచ్ఛ పితరం చాథ సోఽస్మై సర్వం తదుక్తవాన్॥

తా॥ "శుభము లొందుము, చాలకాలము జీవింపుము" అని ఆతని నాశీర్వదించిరి. తరువాత ఆ రాజకుమారుడు వారలకు నమస్కరించి మిక్కిలి విస్మయముగలవాడై "ఇది యేమి" యని తండ్రి నడిగెను. తండ్రియు అతనికి జరిగిన యావద్వృత్తాంతమును చెప్పెను.

శ్లో॥ స భార్యాం తాం మృతాం శ్రుత్వా హృదయేష్టాం మదాలసాం।
పితరౌ చ పురో దృష్ట్వా లజ్జాశోకవిమధ్యగః॥
చింతయామాస సా బాలా మాం శ్రుత్వా నిధనం గతమ్॥

తా॥ ఆ రాకుమారుడు తన మనోభీష్టయు, ప్రాణప్రదయు నగు భార్య పరలోకగతురాలయ్యెనని విని యెదుటనున్న తల్లిదండ్రులనుజూచి లజ్జాశోకముల మధ్య పెనగు

లాడుము, అయ్యో! ఆ నా యపూర్వప్రేమలహరి పతిగతప్రాణ నేను మృతినొందితినని వినినంతనే ప్రసువులను వీడెనే యని చింతించెను.

శ్లో॥ తత్యాజ జీవితం సాధ్వీ ధిఙ్మాం నిష్ఠురమానసం।
నృశంసోఽహమనార్యశ్చ వినా తాం మృగలోచనామ్।
మత్కృతే నిధనం ప్రాప్తాం యజ్జీవామ్యతినిర్ఘృణః॥

తా॥ నాకొరకు ప్రాణవాయువులను ధారవోసిన యట్టి త్యాగశీలయగు సాధ్వీమణిని విడచి జీవించియుండిన దయావిహీనుడను కఠినహృదయుడను పరులకు బాధ గలిగించిన మహాపాపిని. అయ్యో! నా ప్రియురాలు నాకొరకు జీవితమును వీడిపోయినదే. పాషాణ హృదయుడనగు నేనింకను జీవించియున్నాను. ఇట్టి నా జీవిత మొక జీవితమేనా!

ఋతధ్వజుడు తననిమిత్తము మదాలస మరణించెనని విని విలపించుచు జీవితములో మరియొక స్త్రీని పెండ్లాడనని ప్రతిజ్ఞ జేయుట

శ్లో॥ పునః సంచింతయామాస పరిసంస్తభ్య మానసం।
మోహోద్గమమపాస్యైవం నిశ్వస్యోచ్ఛ్వస్య చాతురః॥

తా॥ ఇట్లు పలువిధముల చింతించుచు, మరల మనస్సును నిలుపుకొని మోహమును దూరీకరించి కొంచెము ఆలోచించి నిట్టూర్పుచు మరల కలతజెందిన మనస్సు గలవాడై యిట్లు చింతించెను.

శ్లో॥ మృతేతి సా మన్నిమిత్తం త్యజామి యదిది జీవితం।
కిం మయోపకృతం తస్యాః శ్లాఘ్యమేతత్తు యోషితామ్॥

తా॥ ఒకవేళ ఈమె నా నిమిత్తముగా జీవితము విడిచినదని, తన్నిమిత్తము నేనును జీవితము త్యజించితినేని యిందువలన ఆమెకు నావల్ల గలిగిన ఉపకృతియేమి? పురుషునితో సహగమించుట స్త్రీలకు సహజధర్మము. అందువలన ఆమె యీ త్యాగము మిగుల కొనియాడదగినదే.

శ్లో॥ యది రోదిమి వా దీనం హా ప్రియేతి వదన్ ముహుః।
తథాప్యశ్లాఘ్యమేతన్నో వయం హి పురుషాః కిల॥

తా॥ హా ప్రియా! ప్రేయసీ! నా జీవితపరమావధీ! యని మాటిమాటికి పలవించుచు అతిదీనముగా నేడ్చి ఊరటబొందుదమన్నను అదియు నంత శ్లాఘనీయమైనది కాదు. ఎందుకనగా పురుషులు యేడ్చుట లోకమునం దసహజము.

శ్లో॥ అథ శోకజడో దీనోఽస్నజాహీనో బలాన్వితః।
విపక్షస్య భవిష్యామి తతః పరిభవాస్పదమ్॥

తా॥ మరియు ఒకప్పుడతిబలాన్వితుడనై నేడీదుఃఖముతో జడుడను, దీనుడను బలహీనుడనైనచో శత్రువులకు పరిభవాస్పదుడను కాకతప్పదు.

శ్లో॥ మయారిశాతనాత్కార్యం రాజ్ఞః శుశ్రూషణం పితుః।
జీవితం తస్య చాయత్తం సంత్యాజ్యం తత్కథం మయా॥

తా॥ కావున యీ దశలో నేను శత్రువులను జయించి మహారాజగు నా తండ్రి గారికి శుశ్రూష చేయవలసియున్నది. సర్వథా నా జనకునకు దత్తమైన యీ జీవితమును నేనెట్లు త్యజింపగలను?

శ్లో॥ కిం త్వత్ర మేఽస్త్యకర్తవ్యం త్యాగో భోగస్య యోషితః।
స చాపి నోపకారాయ తన్వంగ్యాః కిం తు సర్వథా॥

తా॥ అయితే యీ విషయమై నేను చేయదగినదిమాత్ర మొకటున్నది. అదేదన యావజ్జీవితమును స్త్రీ సంబంధమగు సమస్తభోగములను విసర్జించుటయే ఆమెయెడ నేను జూపుకొను కృతజ్ఞత. ఈ నా త్యాగమనునది అన్నివిధముల ఆమె కుపకరించినను, ఉపకరించకున్నను,

శ్లో॥ మయాఽనృశంస్యం కర్తవ్యం నాపకార్యుపకారి వా।
యా మదర్థేఽత్యజత్ప్రాణాం స్తదర్థేఽల్పమిదం మమ॥

తా॥ నేను మాత్రము నానుండి ఒకరికి కలిగిన బాధారూపమగు పాపమును తొలగించుకొనవలయును. అది ఉపకారమేయగుగాక? గాకపోవుగాక? జీవితనిర్విశేష యగు ఏ సాధ్వి నాకొరకు ప్రాణములను త్యజించెనో, ఆమెకొరకు నా యీ అల్పత్యాగ మగుగాక!

శ్లో॥ ఇతి కృత్వా మతిం సోఽథ నిష్పాద్యోదకదానికం।
క్రియాశ్చానంతరం కృత్వా ప్రత్యువాచ ఋతధ్వజః॥

తా॥ అని నిశ్చయించుకొని తరువాత నాతడు ఆమెకొరకు జలతర్పణమునిచ్చి, అనంతరము జరుగవలసిన క్రియలను యథావిధిగచేసి పిదప అతడిట్లనుకొనెను.

శ్లో॥ యది సా మమ తన్వంగీ న స్యాద్భార్యా మదాలసా।
అస్మిన్జన్మని నాన్యా మే భవిత్రీ సహచారిణీ॥

తా॥ తనులతాంగి యగు ఆ మదాలసయే నాకు భార్యగానిచో, యీ జన్మలో యింకొక స్త్రీ నాకు సహధర్మచారిణి గాకుండుగాక!

శ్లో॥ తా మృతే మృగశాబాక్షీం గంధర్వతనయామహం।
న భోక్ష్యే యోషితం కాంచిదితి సత్యం మయోదితమ్॥

తా॥ గంధర్వరాజకుమారియగు నా కురంగాక్షిని విడచి యింకొక స్త్రీతో నేను రాగభోగముల ననుభవించను. ఇది ముమ్మాటికి సత్యము. ఇది నా హృదయపూర్వక మగు మాట.

శ్లో॥ స ధర్మచారిణీం పత్నీం తాం ముక్త్వా గజగామినీం।
కాంచిన్నార్యాం కరిష్యామి కేన సత్యం మయోదితమ్॥

తా॥ గజగామినియు, సహధర్మచారిణియు నగు ఆ మదాలసను విడచి నే నింకొకతె నెన్నడును భార్యగా గైకొనను. దీనిని నేను సత్యప్రతిజ్ఞ జేసి మరొకసారి చెప్పుచున్నాను.

శ్లో॥ ఏవం సర్వాన్పరిత్యజ్య స్త్రీభోగాన్తాత సర్వదా।
క్రీడన్నాస్తే సమం తుల్యైర్వయస్యైః శీలసంపదా॥

తా॥ ఈ ప్రకారముగా నా రాజకుమారుడు సమస్తభోగములను విడిచిపెట్టి ఉత్తమస్వభావాచరణములు గలవాడై, సమవయస్కులగు స్నేహితులతో క్రీడించుచు కాలము గడపుచుండెను.

శ్లో॥ ఏతత్తస్య పరం కార్యం తాత తత్కేన సాధ్యతే।
కర్తుమత్యంతదుష్ప్రాప్యమీశ్వరైః కిము తేతరైః॥

తా॥ తండ్రీ! ఆతనికి చేయదగిన ఉత్కృష్టకార్యమిది, ఇది యెట్లు సాధ్య మగును? దేవాదిదేవతలచేతగూడ సాధ్యపడని యీ కార్యము యితరులచేత యెట్లు సాధ్యపడును?

శ్లో॥ ఇతి వాక్యం తయోః శ్రుత్వా విమర్శమగమత్పితా।
విమృశ్య చాహ తౌ పుత్రౌ నాగరాట్ప్రహసన్నివ॥

తా॥ ఈ విధముగా చెప్పుచున్న వారి మాటలను విని తండ్రి ఆలోచనానిమగ్ను డయ్యెను. మరియు బాగుగా తర్కించి ఆ నాగరాజు చిరునవ్వు నవ్వుచు కుమారులతో నిట్లని చెప్పెను.

శ్లో॥ యద్యశక్యమితి శ్రుత్వా న కరిష్యంతి మానవాః।
కర్మణ్యుద్యమముద్యోగహాన్యా హానిస్తతః పరమ్॥

తా॥ ఈ పని చేయుటకు శక్యముగాదని విన్నంతమాత్రమున మానవులు కర్మము నందలి ప్రయత్నమును విరమించుకొన్నచో, దానివలన ఉద్యమహానియు, ఆ పిమ్మట వెంటనే నాశనమును గలుగును.

శ్లో॥ ఆరభేత నరః కర్మ స్వపౌరుషమహాపయన్।
నిష్పత్తిః కర్మణాం దైవే పౌరుషే చ వ్యవస్థితా॥

తా॥ అందువలన మానవుడు స్వకీయమగు పురుషప్రయత్నమునకు లోటురానీయక కర్మ నారంభించుగాక! కర్మఫలము, దైవము పురుషప్రయత్నము యీ రెండింటిపైని ఆధారపడియున్నది.

శ్లో॥ తస్మాదహం తథా యత్నం కరిష్యే పుత్రకార్యతః ।
తపశ్చర్యాం సమాస్థాయ యథైతత్సాధ్యతేఽచిరాత్ ॥

తా॥ అందువలన యిది నా పుత్రులరగు మీ కార్యమగుటవలన త్వరలో నిదెట్లు సాధ్యమగునో, అట్లు తపశ్చర్య నవలంబించి ప్రయత్నము చేసెదను.

మదాలసను పునరుజ్జీవింప జేయుటకై అశ్వతరుడు సరస్వతీదేవిని గురించియు ఈశ్వరుని గురించియు తప మొనరించుట

శ్లో॥ ఏవముక్త్వా స నాగేంద్రః ప్లక్షావతరణం గిరేః ।
తీర్థం హిమవతో గత్వా తప స్తేపే సుదుశ్చరమ్ ॥

తా॥ ఇట్లు చెప్పి ఆ నాగరాజు హిమవత్పర్వతసంబంధమగు ప్లక్షావతరణమను తీర్థమునకుపోయి అచట మిక్కిలి దుశ్చరమగు తపస్సును చేసెను.

శ్లో॥ తుష్టావ వాగ్భిరిష్టాభి స్తత్ర దేవీం సరస్వతీం ।
తన్మనా నియతాహారో భూత్వా త్రిషవణప్లుతః ॥

తా॥ అచ్చట తదేకతత్పరుడై, నియతాహారియై మూడువేళల స్నానాద్యనుష్ఠానములు గలవాడై శ్రీసరస్వతీదేవి నుద్దేశించి ప్రియకరములగు వాక్కులతో నిట్లని స్తుతించెను.

శ్లో॥ జగద్ధాత్రీమహం దేవీమారిరాధయిషుః శుభాం ।
స్తోష్యే ప్రణమ్య శిరసా బ్రహ్మయోనిం సరస్వతీమ్ ॥

తా॥ జగదాధారభూతయు, శోభనశీలయు నగు సరస్వతీదేవిని ఆరాధించుటకు యిచ్ఛగలవాడనై బ్రహ్మకారణమగు ఆ దేవికి శిరసా నమస్కార మాచరించి స్తుతించెను.

శ్లో॥ సదసద్దేవి యత్కించిన్మోక్షబంధార్థవత్పదం ।
తత్సర్వం త్వయ్యసంయోగం యోగవద్దేవి సంస్థితమ్ ॥

తా॥ ఓ దేవీ! మోక్షరూపముగను లేక బంధరూపముగను గనుపించు సదసద్వస్తుజాతమంతయు నీ సంబంధముగలదిగనే తోచును. కాని నీవు దేనిని అంటవు.

శ్లో॥ త్వమక్షరం పరం దేవి యత్ర సర్వం ప్రతిష్ఠితం ।
అక్షరం పరమం బ్రహ్మ జగచ్చైతత్ క్షరాత్మకమ్ ॥

తా॥ సాకారసహితమగు ఏ పరబ్రహ్మమునందు యీ సర్వము ప్రతిష్ఠితమైయున్నదో ఆ యక్షరపరబ్రహ్మమే నీవు. ఓ దేవీ! ఈ జగత్తంతయు నశించునది. శాశ్వతమైన దా బ్రహ్మ మొక్కటియే.

శ్లో॥ దారువ్యవస్థితో వహ్నిర్భౌమాశ్చ పరమాణవః ।
తథా త్వయి స్థితం బ్రహ్మ జగచ్చేదమశేషతః ॥

తా॥ దారువునందు అగ్నియు, భూమియందు పరమాణువులును నిగూఢమై యున్నట్లు నీయందు బ్రహ్మమున్నది. ఆ పరబ్రహ్మస్వరూపమనకంటె భిన్నముగాని యీ జగత్తంతయు నీయందు ప్రచ్ఛన్నమైయున్నది.

శ్లో॥ ఓంకారాక్షరసంస్థానం యత్తు తే దేవి స్థిరాస్థిరం ।
తత్ర మాత్రాత్రితయం సర్వమస్తి యద్దేవి నాస్తి చ ॥

తా॥ ఓ దేవీ! ఓంకారాక్షరసంస్థితమగు యీ చరాచరప్రపంచ మేదిగలదో, అదంతయు మాత్రాత్రయవిశిష్టమై, సదసద్రూపములతో నీయందేయున్నది.

శ్లో॥ త్రయో లోకాస్త్రయో వేదాస్త్రైవిద్యం పావకత్రయం ।
త్రీణి జ్యోతీంషి వర్గాశ్చ త్రయో ధర్మాదయస్తథా ॥
త్రయోగుణాస్త్రయశ్శబ్దాస్త్రయో దోషాస్తథాశ్రమాః ।
త్రయః కాలాస్తథాఽవస్థా పితరోఽహర్నిశాదయః ।
ఏతన్మాత్రాత్రయం దేవి తవ రూపం సరస్వతి ॥

తా॥ ఓ తల్లీ! సరస్వతీ! స్వర్గ, మర్త్య, పాతాళములను మూడులోకములును, త్రైవిద్యలనబడు, ఋగ్యజుస్సామములను మూడువేదములును, దక్షిణాగ్ని, గార్హపత్య, ఆహవనీయములను మూడగ్నులును, చంద్రసూర్యాగ్ని సంబంధములగు మూడుజ్యోతులున్ను, ధర్మార్థకామములను త్రివర్గములున్ను, సత్వరజస్తమములను మూడుగుణములున్ను మంద్ర, మధ్య, తారములను మూడుశబ్దములును, మలవిక్షేపావరణములను మూడుదోషములును, అదేవిధముగా ఆశ్రమములును, భూతభవిష్యద్వర్తమానములను మూడు కాలములును, జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలును, పితరులును, అహర్నిశలును ఇవన్నియు మాత్రాత్రయనిర్దిష్టములగు నీరూపములైయున్నవి.

శ్లో॥ విభిన్నదర్శినామాద్యా బ్రహ్మణో హి సనాతనాః ।

తా॥ ఇవియును బ్రహ్మాంశసంభూతమగుటచే, సనాతనములై, విభిన్నమార్గములు గలవిగానున్నవి.

శ్లో॥ సోమసంస్థా హవిః సంస్థాః పాకసంస్థాశ్చ సప్త యాః ।
తాస్త్వదుచ్చారణాద్దేవి క్రియంతే బ్రహ్మవాదిభిః ॥

శ్లో॥ అనిర్దేశ్యం తథా చాన్యదర్ధమాత్రాశ్రితం పరం।
అవికార్యక్షరం దివ్యం పరిణామవివర్జితమ్।
తవైవ చ పరం రూపం యన్న శక్యం మయేరితుమ్॥

తా॥ ఈ మూడుమాత్రలకు పరమై అర్ధమాత్రాశ్రితమైనదియు, దీనికంటె భిన్నమైనదియు, అవికారియు, అక్షరమును, దివ్యమును, పరిణామరహితమునగు ఆపరబ్రహ్మస్వరూపము నీయొక్క రూపమే, ఆరూపమును నేను ఇట్టిదని వర్ణింపజాలను.

శ్లో॥ న చాస్యేన న వా జిహ్వా తాల్వోష్ఠాదిభిరుచ్యతే।
ఇంద్రోఽపి వసవో బ్రహ్మా చంద్రార్కౌ జ్యోతిరేవ చ॥

తా॥ తల్లీ! నీరూపము ముఖముచేతగాని, జిహ్వచేతగాని, తాలువు, ఓష్ఠము మొదలగు స్థానములనుండి జనితమైన శబ్దములచేతగాని వర్ణింపనలవిగానిది (తాల్వాది స్థానములందుత్పన్నములైన వర్ణసమామ్నాయముచేత వర్ణింపశక్యముగానిది). శబ్దాతీతమైనది. మరియు ఇంద్రుడు, వసువులు, బ్రహ్మ, సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలగువారు నిరంతరము ఆరాధించునట్టి దానీదివ్యరూపము.

శ్లో॥ విశ్వావాసం విశ్వరూపం విశ్వేశం పరమేశ్వరం।
సాంఖ్యవేదాన్తవేదోక్తం బహుశాఖాస్థిరీకృతమ్॥
అనాదిమధ్యనిధనం సదసన్న సదేవ తు।
ఏకం త్వనేకమప్యేకం భవభేదసమాశ్రితమ్॥

తా॥ సమస్తప్రాణికోట్లయందును ఆత్మరూపముతో నున్నటువంటియు, విశ్వరూపముతో నొప్పుచున్నటువంటియు, సమస్తమునకు ప్రభువైనటువంటియు, పరమేశ్వరస్వరూపమును, సాంఖ్యముచేతను, వేదాన్తశాస్త్రముచేతను, వేదములచేతను స్తుతింపబడినదియు, అనేక శాఖోపశాఖలచేత విస్తరింపబడి స్థిరమైనదియు, ఆదిమధ్యాన్తరహితమైనదియు, సత్తుగాక, అసత్తుగాక, సదసద్భిన్నమైనదై సత్తామాత్రస్వరూపము గలదియు, ఏకమై, అనేకమునుపొందినదియు, నిజమునకొక్కటే అయినదియు, జీవుల జన్మభేదములకాశ్రితమైనదియు,

శ్లో॥ అనాఖ్యం షడ్గుణాఖ్యం చ షట్కాఖ్యం త్రిగుణాశ్రయం।
నానాశక్తిమతామేకం శక్తివైభావికం పరమ్।
సుఖాసుఖమహాసౌఖ్యరూపం తవ విభావ్యతే॥

తా॥ మరియు నామరూపరహితమైనదియు, ఐశ్వర్యము, వీర్యము, కీర్తి మొదలగు షడ్గుణములచేత ఒప్పునదియు, శమాదిషట్కసంపత్తిచేత తెలియబడునదియు, త్రిగు

ణములకు ఆశ్రయమైనదియు, అనేకములగు భిన్న భిన్న శక్తులుగలదిగా తోచుచున్నను ఏకశక్తియైనదియు, సుఖాసుఖములకు పరమగు మహాసుఖస్వరూపమునైనదిగా భావింప బడుచున్నది.

శ్లో॥ ఏవం దేవి త్వయా వ్యాప్తం సకలం నిష్కలం జగత్ ।
అద్వైతావస్థితం బ్రహ్మ యచ్చ ద్వైతే వ్యవస్థితమ్ ॥

తా॥ అద్వైతస్వరూపమగు బ్రహ్మము దేనినాశ్రయించుటచే ద్వైతస్థితిగలదిగా కనబడుచున్నదో అట్టి కళారహితమగు జగత్తునందంతటను నీవు వ్యాపించియున్నావు.

శ్లో॥ యేఽర్థా నిత్యా యే వినశ్యంతి చాన్యే
యే వా స్థూలా యే చ సూక్ష్మాచ్చ సూక్ష్మాః ।
యే వా భూమౌ యేఽంతరిక్షేఽన్యతో వా
తేషాం సత్యం త్వత్త ఏవోపలబ్ధిః ॥

తా॥ తల్లీ! ఏపదార్థములు అనిత్యములో, ఏవి నశించునవో, ఏవి స్థూలములో, ఏవస్తువులు సూక్ష్మాతిసూక్ష్మములో, భూమిమీదగాని, ఆకాశమునగాని, లేక మరెచ్చట నైనను, ఏపదార్థములుండినను వాటిని పొందుట నీ యనుగ్రహలేశముండిననే తప్ప లేనిచో పొందజాలరు.

శ్లో॥ యచ్చామూర్తం యచ్చ మూర్తం సమస్తం
యద్వా భూతేష్వేకమేకం చ కించిత్ ।
యద్దివ్యేఽస్తి క్ష్మాతలే ఖేఽన్యతో వా
తత్సంబంధత్వాత్స్వరైర్వ్యంజనైర్వా ॥

తా॥ ఓ దేవి! వ్యక్త స్వరూపముగాని, అవ్యక్త స్వరూపముగాని, యీ సమస్త భూతములలో నేది ఏకరూపమైయున్నదో, స్వర్గ మర్త్య పాతాళ ఆకాశములయందు గాని, మరెచ్చటనైనను అదంతయు నీ సంబంధమగు స్వరవ్యంజనములచేతనే ప్రకటిత మగుచున్నది.

శ్లో॥ ఏవం స్తుతా తదా దేవీ విష్ణోర్జిహ్వా సరస్వతీ ।
ప్రత్యువాచ మహాత్మానం నాగమశ్వతరం తతః ॥

తా॥ ఈ విధముగా నాగమహాశయుడగు అశ్వతరునిచేత స్తుతించబడినదై, విష్ణు జిహ్వాయనబడు నా సరస్వతీదేవి అప్పుడు అతనినిగూర్చి యిట్లు చెప్పెను.

శ్లో॥ వరం తే కంబలభ్రాతః ప్రయచ్ఛామ్యురగాధిప ।
తదుచ్యతాం ప్రదాస్యామి యత్తే మనసి వర్తతే ॥

తా॥ కంబల సహోదరుడవగు నో నాగరాజా! నీకు నేను వరమిచ్చెదలంచుచున్నాను గాన నీ మనస్సునందుగల కోరికను చెప్పుము తప్పక యిత్తును

అశ్వతర ఉవాచ = అశ్వతరుడు చెప్పెను.

శ్లో॥ సాహాయ్యం దేవి దేహి త్వం పూర్వం కంబలమేవ చ।
సమస్తస్వరసంబద్ధముభయోస్సంప్రయచ్ఛత॥

తా॥ ఓ దేవి! మొదట కంబలునకే నాకు సహాయముగా నొసంగుము. మా యిద్దరికిని సమస్తస్వరసంబద్ధమగు జ్ఞానమును ప్రసాదింపుము.

సరస్వతీదేవి ప్రత్యక్షమై అశ్వతరునకు కోరిన వరము నిచ్చుట

సరస్వత్యువాచ = సరస్వతీదేవి చెప్పెను.

శ్లో॥ సప్తస్వరా గ్రామరాగాః సప్తపన్నగసత్తమ।
గీతకాని చ సప్తైవ తావత్యశ్చాపి మూర్ఛనాః॥
తానాశ్చైకోనపంచాశ త్తథా గ్రామత్రయం చ తత్।
ఏతత్సర్వం భవాన్వేత్తా కంబలశ్చైవ తేఽనఘ॥

తా॥ నీవు కోరినట్లు సప్తస్వరములు, గ్రామములు, రాగములు, గీతములు, అదే విధముగ మూర్ఛనలు, తానములు, కీర్తనలు మొదలగునవన్నియు నీకువచ్చుగాక! కంబలుడుకూడా నీతో సమానుడగుగాక!

శ్లో॥ జ్ఞాస్యతే మత్ప్రసాదేన భుజంగేంద్ర పరం తథా।
చతుర్విధం పరం తాలం త్రిప్రకారం లయత్రయమ్॥
గతిత్రయం తథా కాలం మయా దత్తం చతుర్విధం।
ఏతద్భవాన్మత్ప్రసాదాత్పన్నగేంద్ర పరం చ యత్॥

తా॥ ఓయీ నాగరాజా! మరియు సమస్తవిధతాళములు, త్రివిధములగు లయ ప్రకారములు, మూడువిధములగు గతులు, నాలుగుకాలములు, యీ మొదలగు వాటి నన్నింటిచేత నన్ను బాగుగా ఆరాధించితివి గాన నిన్ను నే ననుగ్రహించుచున్నాను. ఇంకను యింతేగాదు దీనికి సంబంధించిన యితరమగునదేదైనను నీకు లభించుగాక!

శ్లో॥ ఆస్యాంతర్గతమాయత్తం స్వరవ్యంజనయోశ్చ యత్।
తదశేషం మయా దత్తం భవతః కంబలస్య చ॥

తా॥ మరియు దీనికి సంబంధించిన స్వరసాహిత్యములు యెల్లప్పుడును మీ ముఖస్థములైయుండుగాక! అట్లు నీకును కంబలునకును నేను వరమునొసంగుచున్నాను.

శ్లో॥ యథా వాన్యస్య భూలోకే పాతాళే వాపి పన్నగ।
ప్రణేతారా భవంతౌ చ సర్వస్యాద్య భవిష్యతః॥

తా॥ ఓ నాగరాజా! భూలోకములోగాని, పాతాళలోకములోగాని, యింక మరెచ్చటనైనను యితరులకు మీరు పూజనీయులగుదురుగాక!

శ్లో॥ ఇత్యుక్త్వా సా తదా దేవీ సర్వజిహ్వా సరస్వతీ।
జగామాదర్శనం సద్యో నాగస్య కమలేక్షణా॥

తా॥ ఇట్లుచెప్పి సకలజిహ్వారూపిణియగు నా సరస్వతీదేవి ఆతనికి కనబడకుండ అచ్చటనే అంతర్ధానమయ్యెను.

శ్లో॥ తయోశ్చ తద్యథా వృత్తం భ్రాత్రోస్సర్వమజాయత।
విజ్ఞానముభయోరగ్ర్యం పదతాళస్వరాదికమ్॥

తా॥ తరువాత అన్నదమ్ములగు అశ్వతరకంబళు లను ఆ నాగరాజులిద్దరికి సరస్వతీదేవి చెప్పినట్లు ప్రధానమైన పదతాళస్వరాదివిజ్ఞానమంతయు కలిగెను.

శ్లో॥ తతః కైలాసశైలేంద్రశిఖరస్థితమీశ్వరం।
గీతకైస్సప్తభిర్నాగౌ తంత్రీలయసమన్వితైః।
ఆరిరాధయిషుర్దేవమనంగాంగహరం హరమ్॥

ప్రచక్రతుః పరం యత్నముభౌ సంహితవాక్కలౌ।
ప్రాతర్నిశాయాం మధ్యాహ్నే సంధ్యయోశ్చాపి తత్పరౌ॥

తా॥ తరువాత వారిరువురును, కైలాసపర్వతశిఖరమునందున్న, కామదహనుడగు ఈశ్వరుని తంత్రీలయస్వరాన్వితములగు గీతములతో ఆరాధింపదలంచినవారై, ఒకేస్వర సాహిత్యములుగలవారై ఉదయ మధ్యాహ్న సాయంతనసంధ్యాసమయములందు మిక్కిలి ఆసక్తితో తీవ్రప్రయత్నమును చేసిరి.

ఈశ్వరుడు అశ్వతరుని తపస్సునకు మెచ్చి అభీష్టము లొసంగుట

శ్లో॥ తతః కాలేన మహతా స్తూయమానో మహేశ్వరః।
తుతోష గీతకైస్తౌ చ ప్రాహ సంగృహ్యతాం వరః॥

తా॥ ఇట్లు చాలకాలము స్తోత్రముచేయగా, చేయగా ఈశ్వరుడు ఆ స్తోత్రగీతములచేత సంతోషించి, ఓయీ! మీగీతములకు సంతోషించితిని. మీకేవరముకావలయునో కోరుకొనుడు అనెను.

శ్లో॥ తతః ప్రణమ్యాశ్వతరః కంబలేన సమం తదా।
విజ్ఞాపయామాస మహాదేవం శితికంఠముమాపతిమ్ ॥

తా॥ అప్పుడు ఉమాపతియును, శితికంఠుడునగు మహాదేవునకు కంబలునితో గూడ నమస్కరించి అశ్వతరుడు యిట్లని విన్నవించెను.

శ్లో॥ యది నౌ భగవన్ప్రీతో దేవదేవ త్రిలోచన।
తతో యథాభిలషితం వరమేనం ప్రయచ్ఛ నౌ ॥

తా॥ ఓ భగవన్, దేవదేవ, త్రిలోచన, మాయందు నీకు అనుగ్రహము కలిగినట్లయితే మాయభీష్టమగు యీవరము నిమ్ము.

శ్లో॥ మృతా కువలయాశ్వస్య పత్నీ దేవ మదాలసా।
తేనైవ వయసా సద్యో దుహితృత్వం ప్రయాతు మే ॥

తా॥ ఓదేవా! కువలయాశ్వుని ధర్మపత్నియగు మదాలస మృతినొందినది. ఆమె ఆవయసుతోనే ఆరూపముతోనే నా కిప్పుడు కుమార్తెయగునట్లు వరమిమ్ము.

శ్లో॥ జాతిస్మరా యథా పూర్వం తద్వత్ కాంతిసమన్వితా।
యోగినీ యోగమాతా చ జాయతాం వచనాత్తవ ॥

తా॥ ఓ సర్వేశ్వరా! నీయనుగ్రహమువలన ఆమె పూర్వమువలె జాతిస్మృతి గలదై, మిక్కిలి ఓరిమిగలదియై, యోగమాతయగు గాక!

ఈశ్వర ఉవాచ = ఈశ్వరుడు చెప్పెను.

శ్లో॥ యథోక్తం పన్నగశ్రేష్ఠ సర్వమేతద్భవిష్యతి।
మత్ప్రసాదాదసందిగ్ధం శ్రుణు చేదం భుజంగమ ॥

తా॥ ఓ నాగరాజా! నీవు కోరినట్లు నా యనుగ్రహమువలన అంతయు కాగలదు. మరియు దీనిని వినుము.

శ్లో॥ శ్రాద్ధావసానే ప్రాప్తే త్వం మధ్యమం పిండమాత్మనా।
కామం చేమామనుధ్యాయన్ కురు త్వం పితృపూజనమ్ ॥

తా॥ శ్రాద్ధావసానమునందు యీ మదాలసను ధ్యానించుచు, మధ్యమపిండమును అరగించుము. మరియు ఆమెను స్మరించుచు, పితృదేవతలను ఆరాధింపుము.

శ్లో॥ తత్‌క్షణాదేవ సా సుభ్రూర్భవతో మధ్యమాత్ఫణాత్।
సముత్పత్స్యతి కల్యాణీ తథా రూపా యథా మృతా ॥

తా॥ అట్లొనరించితివేని నీ మధ్యమఫణము (పడిగ) నుండి శుభలక్షణాంగియగు నా మదాలస పూర్వమెట్లుండెనో అదేరూపముతో నుద్భవింపగలదు.

శ్లో॥ స్వయమేవోపభుంజస్వ తతః సర్వం భవిష్యతి ।
ఉత్పత్స్యతే తతః సా తు సద్యః శ్రాద్ధే మధ్యమాత్ఫణాత్ ॥

తా॥ స్వయముగానే నీవా శ్రాద్ధకార్యమునందలి పిండమును భుజింపుము. పిదప అంతయు నేను చెప్పినట్లు జరుగును. తప్పక నీపడిగమధ్యమునుండి ఆ బాలిక పుట్టగలదు.

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా తతస్తౌ తు ప్రణిపత్య మహేశ్వరం ।
రసాతలమనుప్రాప్తౌ పరితోషసమన్వితౌ ॥

తా॥ ఇట్లు ఈశ్వరునిచే చెప్పబడిన దానినంతయువిని, అయశ్వతరకంబలు లిద్దరు మహేశ్వరునకు నమస్కరించి మిక్కిలి ఆనందముతో రసాతలమునకు పోయిరి.

శ్లో॥ తథా చ కృతవాన్ శ్రాద్ధం స నాగః కంబలానుజః ।
పిండం చ మధ్యమం తద్వద్యథావదుపభుక్తవాన్ ॥

తా॥ ఆ విధముగానే అశ్వతరుడు పితృతర్పణమునుజేసి ఈశ్వరాదేశానుసారము ఆ మధ్యమపిండమును భుజించెను.

శ్లో॥ ఉపభుంక్తే తతః పిండే తస్య నాగస్య మధ్యమాత్ ।
జజ్ఞే నిశ్వసతః సద్యస్తద్రూపా మధ్యమాత్ఫణాత్ ॥

తా॥ అట్లు పిండము భుజింపబడగానే ఆ నాగముయొక్క మధ్యమఫణమునుండి నిశ్వాసముద్వారా ఆ మదాలస పూర్వమేరూపముగలదో ఆదేరూపముతో మరల జన్మించెను.

శ్లో॥ న చాపి కథయామాస కస్యచిత్స భుజంగమః ।
అంతర్గృహే తాం సుదతీం స్త్రీభిర్గుప్తామధారయత్ ॥

తా॥ అయితే మదాలస యీ విధముగా పుట్టినదని అతడెవరికిని చెప్పలేదు. గుప్తముగా నొక అంతర్గృహములో నుంచెను. ఆమెకు కావలసిన సదుపాయములను దాస్యులగు పనికత్తెలతో చేయించుచుండెను.

శ్లో॥ తౌ చానుదినమాగత్య పుత్రౌ నాగపతేస్సుఖం ।
ఋతధ్వజేన సహితౌ చిక్రీడాతేఽమరావివ ॥

తా॥ ఇక్కడ ఆ నాగపతికుమారు లిరువురును ప్రతిదినమును వచ్చి ఋతధ్వజునితో సుఖముగా నాడుకొనుచు పోవుచుండిరి.

శ్లో॥ ఏకదా తు స తౌ ప్రాహ స నాగోఽశ్వతరో ముదా ।
తన్మయా పూర్వముక్తం తు క్రియతే కిం ను తత్తథా ॥

తా॥ ఇట్లుండగా ఒకనాడు ఆ నాగరాజు తనకుమారులను పిలిచి సంతోషముతో "నేను మీతో చెప్పిన ప్రకారము చేయబడినదా? ఆ రాజకుమారునకు ప్రత్యుపకార మేదైన యోచించితిరా?

శ్లో॥ స రాజపుత్రో యువయోరుపకారీ మమాంతికం ।
కిన్ను నానీయతే వత్సావుపకారాయ మానదః ॥

తా॥ బిడ్డలారా! మీకు మిక్కిలి ఉపకారియగు నారాజకుమారుడేల నాదగ్గరకు తీసుకొనిరాబడలేదు? అతనికుపకారము చేయవలయునని చెప్పితిరిగదా!"

నాగకుమారులు ఋతధ్వజుని తమలోకమునకు రమ్మనికోరుట

శ్లో॥ ఏవముక్తౌ పునస్తేన పుత్రౌ స్నేహవతా తు తౌ ।
గత్వా తస్య పురం సఖ్యా రేమాతే తేన ధీమతా ॥
తతః కువలయాశ్వం తం కృత్వా కించిత్కథాంతరం ।
అబ్రూతాం ప్రణిపాతేన స్వగృహాగమనం ప్రతి ॥

తా॥ ఇట్లు తండ్రి చెప్పగా విని వారు మరల కువలయాశ్వునివద్దకువెళ్లి యథా ప్రకారము ఆటలాడుకొనుచు, మాటలసందర్భమున తమగృహమునకు రావలసినదని నమస్కారపూర్వకముగా కువలయాశ్వుని కోరిరి.

శ్లో॥ తావాహ నృపపుత్రోఽసౌ నన్విదం భవతోర్గృహం ।
ధనవాహనవస్త్రాదియన్మదీయం తదేవ వామ్ ॥

తా॥ అట్లు చెప్పుచున్న నాగకుమారులనుద్దేశించి అయ్యా! ఈ గృహము మీదే గదా! దీనియందుగల ధనవస్త్రవాహనాది సమస్తవస్తువులును మీవిగాక మరెవరివి?

శ్లో॥ యస్య వాం వాంఛితం దాతుం ధనం రత్నమథాపి వా ।
తద్దీయతాం ద్విజసుతౌ యది వాం ప్రణయో మయి ॥

తా॥ నిజముగా నాయందుమీకు ప్రేమయేయున్నచో, ఇందుగల ధనముగాని, ధాన్యములుగాని, రత్నములుగాని, వస్త్రములుగాని, మరేవస్తువులైనను, యెవరెవరికి యేదేదికావలెనో దానినంతయు యథేచ్ఛముగా నిండు.

శ్లో॥ ఏతావతాఽహం దైవేన వంచితోఽస్మి దురాత్మనా ।
యద్భవద్భ్యాం మమ త్వం నో మదీయే క్రియతాం గృహే ॥

తా॥ ఇంతవరకు నేను యీ విధముగా దుష్టవిధిచే వంచింపబడితినని మీకు నాయందుగల ఆదరభావము, నా గృహారామాదులయందును ఉండుగాక! ఇవన్నియును మీవే.

శ్లో॥ యది వా మే ప్రియం కార్యమనుగ్రాహ్యోఽస్మి వా యది।
తద్ధనే మమ గేహే చ మమత్వమనుకల్ప్యతామ్॥

తా॥ మీరు నాకు అభీష్టమగు కార్యమును చేయదలంచినవారైనట్టయితే, నాయందు మీకు అనుగ్రహభావమున్నట్లయితే నా ధనారామగృహాదులు మీవిగా భావించగోరెదను.

శ్లో॥ యువయోర్యన్మదీయం తన్మామకం యువయోస్స్వయం।
ఏతత్సర్వం విజానీయాత్సఖా ప్రాణో బహిశ్చరః॥

తా॥ మీకు సంబంధించిన సంపదంతయునాదే: నాకు సంబంధించిన యీఐశ్వర్య మంతయు మీదే అను యీవిషయమును మీరు తెలుసుకొనగోరుచున్నాను. స్నేహితు డనగా యెట్టివాడు? వెలుపల సంచరించుచున్న ప్రాణమేగదా?

శ్లో॥ పునర్నైవం విభిన్నార్థం వక్తవ్యం ద్విజసత్తమా।
మత్ప్రసాదపరా ప్రీత్యా శాపితౌ హృదయేన మే॥

తా॥ ఈ విషయమున మీరు వేరుగా చెప్పరాదు. నాయందు ప్రసన్నభావముగల మిమ్ములనుగూర్చి ప్రేమభావముతో నా హృదయసాక్షిగా ఒట్టుబెట్టుచున్నాను.

శ్లో॥ తతః స్నేహార్ద్రవదనౌ తావుభౌ నాగనందనౌ।
ఊచతుర్నృపతేః పుత్రం కించిత్ప్రణయకోపితమ్॥

తా॥ ఇట్లా ఋతధ్వజుడు చెప్పినదానిని విని ఆ నాగకుమారులిద్దరును కొంచెము ప్రణయకోపముతో గూడుకొన్నవానివలె నుండు ఆరాజకుమారునితో నిట్లనిరి.

శ్లో॥ ఋతధ్వజ న సందేహో యథా వాహ భవానిదం।
తథైవ చాస్మన్మనసి నాత్ర చింత్యమతోఽన్యథా॥

తా॥ ఓ ఋతధ్వజుడా! నీవు చెప్పినదానిలో సందేహమేమియులేదు. మామనస్సు నందుగూడ అట్లేఉన్నది. నీకును, మాకును భేదములేదనియు, నీకుగల సర్వముమాదనియు, మాసర్వస్వము నీదనియు మేమెప్పుడో అనుకొనియున్నాము. ఈ విషయమున వేరుగా చింతించవలసిన పనిలేదు.

శ్లో॥ కిం త్వావయోః సమం పిత్రా ప్రోక్తమేతన్మహాత్మనా।
ద్రష్టుం కువలయాశ్వం తమిచ్ఛామీతి పునఃపునః॥

తా॥ అయితే పెద్దవాడగు మాతండ్రి మాతో మాటిమాటికి "కువలయాశ్వునొకసారి చూడవలెనని యున్న" దని చెప్పుచున్నాడు. అందుచేతనే మే మిట్లు కోరితిమి.

శ్లో॥ తతః కువలయాశ్వోఽథ సముత్థాయ వరాసనాత్ ।
యథాహ తాతేతి వదన్ ప్రణామమకరోద్భువి ॥

తా॥ ఈ మాట వినగానే కువలయాశ్వుడు తాను కూరుచున్న ఆసనమునుండి లేచి 'తండ్రిగారికిట్టి కోరిక గలదా! అయిన వారిమాటకు అడ్డేమి?' అని చెప్పుచు నాగరాజునకు మారుగా, భూమికి నమస్కరించెను.

శ్లో॥ ధన్యోఽహమతిపుణ్యోఽహం కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యత్తాతో మామభిద్రష్టుం కరోతి ప్రవణం మనః ॥
తదుత్తిష్ఠత గచ్ఛామ తాతాజ్ఞాం క్షణమప్యహం ।
నాతిక్రాంతుమిహేచ్ఛామి పద్భ్యాం తస్య శపామ్యహమ్ ॥

తా॥ తండ్రియగు అశ్వతరుపాదుడ నన్ను జూడ తలంపుజనించినచో నిక నాకంటె ధన్యుడెవడు? నేను పుణ్యాత్ముడను. ఇక నాతో సమానుడెవ్వడునులేడు. అందువలన లెండు, తొందరగా పోదిమురండు. తండ్రిగారి ఆజ్ఞను ఒక్కక్షణముగూడ అతిక్రమించుటకు యిష్టపడను. ఆతనిపాదముల సాక్షిగా ప్రతిజ్ఞచేయుచున్నాను. ఒట్టుబెట్టుకొనుచున్నాను.

శ్లో॥ ఏవముక్త్వా తతయా సోఽథ సహ తాభ్యాం నృపాత్మజః ।
ప్రాప్తశ్చ గౌతమీం పుణ్యాం నిర్గమ్య నగరాద్బహిః ॥

తా॥ ఇట్లు చెప్పి ఆ రాజకుమారుడు నాగకుమారు లిరువురితోడ బయలుదేరి నగరము వెలువడి పవిత్రయగు గౌతమీనదిని చేరెను.

శ్లో॥ తన్మధ్యేన యయుస్తే వై నాగేంద్రనృపనందనాః ।
మేనే చ రాజపుత్రోఽసౌ పారే తస్యాస్తయోర్గృహమ్ ॥

తా॥ ఆ రాజకుమార, నాగకుమారులు ముగ్గురను ఆ గౌతమీనది మధ్యభాగమునుండిపోయిరి. ఇది దాటిన తరువాత ఆవైపైని వీరి గృహము వుండవచ్చునని రాజకుమారుడు తలంచెను.

శ్లో॥ తతశ్చాకృష్య పాతాళం తాభ్యాం నీతో నృపాత్మజః ।
పాతాళే దదృశే చోభౌ స పన్నగకుమారకౌ ।
ఫణామణికృతోద్ద్యోతౌ వ్యక్తౌ స్వస్తికలక్షణౌ ॥

తా॥ తరువాత వారు ఆ రాజకుమారుని పాతాళలోకమునకు తీసుకొనిపోయిరి. అక్కడ యిదివరకు మనుష్యాకారములతోనున్న ఆ నాగకుమారు లిప్పుడు ఫణులయందు మణులతో ప్రకాశించుచున్నవారై స్వస్తికాది లక్షణములు గలిగినవారుగా వుండుటను ఆ రాజకుమారుడు చూచెను.

శ్లో॥ విలోక్య తౌ సురూపాంగౌ విస్మయోత్ఫుల్లలోచనః ।
విహస్య చాబ్రవీత్ప్రేమ్ణా సాధు భో ద్విజసత్తమౌ ॥

తా॥ సురూపాంగులగు వారలను చూచి ఆశ్చర్యముతో వికసించిన నేత్రములు గలవాడై చిన్న చిరునవ్వు నవ్వుచు ఆహా! ఎంత బాగున్నదని ప్రేమతో వారలను చూచుచు చెప్పెను.

ఋతధ్వజుని పాతాళలోకాగమనము

శ్లో॥ కథయామాసతుస్తౌ తు పితరం పన్నగేశ్వరం ।
శాంతమశ్వతరం నాగం మాననీయం దివౌకసామ్ ॥

తా॥ అప్పుడు వారు మేము నాగకుమారులమనియు, శాంతస్వరూపుడును, దివ్యులలో మాననీయుడును, అశ్వతరుడను పేరుగల నాగరాజు మా తండ్రియనియు నతనికి చెప్పిరి.

శ్లో॥ రమణీయం తతోఽపశ్యత్పాతాళం స నృపాత్మజః ।
కుమారైస్తరుణైర్వృద్ధైరురగైరుపశోభితమ్ ॥

తా॥ తరువాత కుమారులును, తరుణులును, వృద్ధులు నగు ఉరగులతో మిగుల శోభాయమానమైనదియు, అత్యంతరమణీయము నగు పాతాళలోకమును ఆ రాజకుమారుడు చూచెను.

శ్లో॥ తథైవ నాగకన్యాభిః క్రీడంతీభిరితస్తతః ।
చారుకుండలహారాభిస్తారాభిర్గగనం యథా ।
గీతశబ్దైస్తథాఽన్యత్ర వీణావేణుస్వరానుగైః ॥
మృదంగపణవాతోద్యహారివేశ్మశతాకులం ।
వీక్ష్యమాణస్స పాతాళం యయౌ శత్రుజితస్సుతః ॥

తా॥ మరియు మనోజ్ఞమగు కటక కుండల హారాదులు ధరించి యిటునటు సంచరించుచు, క్రీడించు నాగకన్యకలతోడనున్నది గావుననే నక్షత్రములుగల ఆకాశమువలె నున్నటువంటిన్ని, వీణావేణుస్వరయుక్తమగు గీతములతోడను, మృదంగ పణవాది వాద్య

ములతో మనోహరమగు నా పాతాళలోకమును జూచుచు ఆ రాజకుమారుడు ముందుకు పోయెను.

శ్లో॥ సహ తాభ్యామభీష్టాభ్యాం పన్నగాభ్యామరిందమః ।
తతః ప్రవిశ్యతే సర్వే నాగరాజనివేశనమ్ ॥
దదృశు స్తే మహాత్మానమురగాధిపతిం స్థితం ।
దివ్యమాల్యాంబరిధరం మణిభూషణభూషితం ॥
స్వచ్ఛముక్తాఫలలతాహారిహారోపశోభితం ।
కేయూరిణం మహాభాగమాసనే సర్వకాంచనే ।
మణివిద్రుమవైడూర్యజాలాంతరితరూపకే ॥

తా॥ తరువాత ఆ రాజకుమారుడు ప్రీతిపాత్రులగు ఆ నాగకుమారులతో నాగరాజ భవనమును ప్రవేశించి అచ్చట వజ్రవైడూర్యాదిమణులతో స్థాపితమగు బంగారుసింహాసనమున ఆసీనుడై యున్నటువంటిన్ని, దివ్యమాల్యాంబరధరుడై మణిభూషణముల చేతను, ముక్తాహారముల చేతను, కేయూరాదుల చేతను సుశోభితుడగు నా నాగరాజును చూచెను.

శ్లో॥ స తాభ్యాం దర్శిత స్తస్య తాతోస్మాకమసావితి ।
వీరః కువలయాశ్వోఽయం పిత్రే చాఽసౌ నివేదితః ॥

తా॥ తరువాత వారు ఆ రాజకుమారుని చూపించుచు యితడే వీరుడగు ఆ కువలయాశ్వుడని తండ్రికి నివేదించిరి.

శ్లో॥ తతో ననామ చరణౌ నాగేంద్రస్య ఋతధ్వజః ।
సముత్థాయ బలాద్గాఢం స నాగః పరిషస్వజే ॥

తా॥ పిమ్మట ఋతధ్వజుడు నాగేంద్రుని పాదములకు నమస్కరించెను. అతడును సింహాసనమునుండి లేచి ఋతధ్వజుని గాఢముగా కౌగిలించుకొనెను.

శ్లో॥ మూర్ధ్ని చైవముపాఘ్రాయ చిరంజీవేత్యువాచ హ ।
నిహతా మిత్రవర్గశ్చ పిత్రోశ్శుశ్రూషణం కురు ॥

తా॥ అట్లే శిరము మూర్కొని "చిరంజీవ" అని దీవించెను. సమస్తశత్రుజయము గలవాడవై పితృసేవ జేయుము.

శ్లో॥ వత్స ధన్యస్య కథ్యంతే పరోక్షస్యాపి తే గుణాః ।
భవతో మమ పుత్రాభ్యామాభ్యాం యేమే నివేదితాః ॥

తా॥ వత్సా! నిన్ను నేను ప్రత్యక్షముగా చూడకపోయినను, ధన్యతముడవగు నీ గుణగణములను నా కుమారులు చెప్పినట్లుగా యితరులుగూడ చెప్పుకొనుచున్నారు.

శ్లో॥ తదేతై రేవ వర్ధేథా మనోవాక్కాయచేష్టితైః।
జీవితం గుణినః శ్లాఘ్యం జీవన్నపి మృతోఽగుణీ॥

తా॥ ఆ కారణములవలన మనోవాక్కాయ కర్మములచేత యిటువంటి గుణములు గలవాడవై వర్ధిల్లుము. లోకమున గుణవంతునియొక్క జీవితమే శ్లాఘనీయమైనది. గుణరహితుడు బ్రతికియుండియు చచ్చినవాడే.

శ్లో॥ గుణవాన్నిర్వృతిం పిత్రోః శత్రూణాం దృశ్యతే జ్వరం।
కరోత్యాత్మహితం కుర్వన్ విశ్వాసం చ మహాజనే॥

తా॥ గుణవంతుడు తండ్రికి సుఖమును, శత్రువులకు జ్వరమును కలుగజేయుచున్నాడు. మహాత్ములయందు విశ్వాసమును ఆత్మహితమును చేయుచున్నాడు.

శ్లో॥ దేవతాః పితరో విప్రా మిత్రార్థివిభవాదయః।
బాంధవాశ్చ తథేచ్ఛంతి జీవితం గుణినశ్చిరమ్॥

తా॥ దేవతలు, పితృదేవతలు, తల్లిదండ్రులు, మిత్రులు, అర్థులు, బంధువులు మొదలగువారందరు గుణవంతుని చిరకాలము జీవించునటుల కోరుచుందురు.

శ్లో॥ పరవాదనివృత్తానాం దుర్గతేషు దయావతాం।
గుణినాం సఫలం జన్మ సంశ్రితానాం విపద్గణైః॥

తా॥ ఇతరులతో కలహము చేయనటువంటిన్ని, దీనులయందు దయగలిగినటువంటిన్ని, ఆపన్నులకు ఆశ్రితులైనటువంటి గుణవంతులయొక్క (బుద్ధిమంతులయొక్క) జన్మమే సఫలమైనది.

శ్లో॥ ఏవముక్త్వా స తం వీరం పుత్రావిదమథాబ్రవీత్।
పూజాం కువలయాశ్వస్య కర్తుకామో భుజంగమః॥

తా॥ ఇట్లు వీరుడగు ఋతధ్వజు నుద్దేశించి చెప్పి ఆతనిని పూజించుటకు కోరిక గలవాడై నాగరాజు తన కుమారులతో నిట్లనెను.

శ్లో॥ స్నానాదికక్రమం కృత్వా సర్వమేవ యథాక్రమం।
మధుపానాదిసంభోగమాహారం చ యథేప్సితమ్॥

తా॥ యథాక్రమముగా స్నానాదికార్యములనుచేసి తేనె మొదలగు మధుర పదార్థములతోగూడిన భోజనమును యథేప్సితముగా చేయించెను.

శ్లో॥ తతః కువలయాశ్వేన హృదయోత్సవభూతయా।
కథయా స్వల్పకంకాళం స్థాస్యామో హృష్టచేతసః।
అనుమేనే చ తం మానీ వచశ్శత్రుజితః సుతః॥

తా॥ కువలయాశ్వునకు హృదయోత్సవభూతమగు కథచేత ఒక చిన్న అక్షిపంజరము చూపించుగలము అని చెప్పగా యీ మాటలను విని ఋతధ్వజుడు అనుమానించెను.

శ్లో॥ తథా చకార చ పటః పన్నగానాముదారధీః ।

తా॥ నాగరాజగు నా అశ్వతరుడు అదేవిధముగ జేసెను.

శ్లో॥ సమేత్య తై రాత్మజభూపనందనై
ర్మహోరగాణామధిపస్స సత్యవాక్ ।
ముదాయుతోన్నాని మధూని చాత్మవా
యథోపజోషం బుభుజే స భోగభాక్ ॥

తా॥ తరువాత ఆ నాగరాజు కుమారులతోను, రాజకుమారునితోను గూడుకొని సంతోషముతో మధురపదార్థములను భుజించెను.

ఇతి శ్రీమార్కండేయమహాపురాణే కువలయాశ్వీయే
పాతాళప్రవేశో నామైకవింశోఽధ్యాయః.

ఇది మార్కండేయమహాపురాణమునందు కువలయాశ్వచరిత్రమున పాతాళప్రవేశము
అను పేరుగల ఇరువది ఒకటవ అధ్యాయము



పుత్ర ఉవాచ = పుత్రుడు చెప్పెను.

శ్లో॥ కృతాహారం మహాత్మానమధిపం పవనాశినాం ।
ఉపాసాంచక్రిరే పుత్రౌ భూపాలతనయ స్తథా ॥

తా॥ భోజనము చేసియున్న మహాత్ముడగు ఆనాగరాజును నాగకుమారులున్ను, రాజకుమారుడున్ను పూజించిరి.

శ్లో॥ కథాభిరనురూపాభిః ప్రకృష్టాత్మా భుజంగమః ।
ప్రీతిం సంజనయామాస పుత్ర సఖ్యురువాచ హ ॥

తా॥ అప్పుడానాగరాజు సంతోషచిత్తముగలవాడై అనురూపములగు కథలతో ఆ కువలయాశ్వుని సంతోషింపజేయుచు — యీ క్రిందివిధముగా చెప్పెను.

శ్లో॥ తవ భద్ర సుఖం బ్రూహి గేహమభ్యాగతస్య యత్ ।
కర్తవ్యముత్సృజాశంకాం పితరీవ సుతో మయి ॥

తా॥ నాయనా! ఋతధ్వజా! తండ్రిదగ్గర కొడుకువలె నాదగ్గర యే సందేహములును వుంచుకొనక మా యింటికి అతిథిగావచ్చిన నీకు ఏమి చేయదగినదో సంతోషముతో ఏ అభ్యంతరము నుంచుకొనక చెప్పుము.

శ్లో॥ హిరణ్యం వా సువర్ణం వా వస్త్రవాహనమాసనం।
యద్వాఽభిమతమత్యర్థం దుర్లభం తద్వృణుష్వ మామ్॥

తా॥ సువర్ణమును గాని, తద్వికారములగు వస్త్రములు వాహనములు ఆసనములు గాని లేక నీకభీష్టమయిన మరి దేనినైనను యెట్టి దుర్లభమగుదానినైనను కోరుకొనుము.

కువలయాశ్వ ఉవాచ = కువలయాశ్వుడు చెప్పెను.

శ్లో॥ భవత్ప్రసాదాద్భగవన్ సువర్ణాది గృహే మమ।
పితురస్తి మమాద్యాపి న కించిత్కార్యమీదృశైః॥

తా॥ అయ్యా! తమయొక్క అనుగ్రహమువలన సువర్ణాది సమస్తవస్తువులును మా గృహమునందున్నవి. నాకు యిట్టివాటితో పనేమియు లేదు.

శ్లో॥ తాతే వర్షసహస్రాయుః శాసతీమాం వసుంధరాం।
తథైవ త్వయి పాతాళం న మే యాచ్ఞోన్ముఖం మనః॥

తా॥ తండ్రి సహస్రాయువుగలవాడై భూమిని శాసించుచుండగా, అట్లే మీరు గూడ పాతాళమును పాలించుచుండగా నా మనస్సు యాచ్ఞోన్ముఖమెన్నటికిని గాదు.

శ్లో॥ తే సుభాగ్యాస్సుపుణ్యాశ్చ యేషాం పితరి జీవతి।
తృణం కోటిసమం విత్తం తారుణ్యం విత్తకోటిషు॥

తా॥ ఎవని తండ్రి జీవించియుండునో ఆతడే మిగుల భాగ్యవంతుడు, పుణ్యాత్ముడు. కోటిధనము ఒక తృణముతో సమానముగా గలస్థితియు అనేకకోట్లధనమున్నను ఆ ధనమున్నప్పుడే యౌవనముగూడ వుండుటయు,

శ్లో॥ మిత్రాణి తుల్యశిష్టాని తద్వద్దేహమనామయం।
జనే వా ధ్రియతే విత్తం యౌవనం కిం తు నాస్తి మే॥

తా॥ అన్ని విధముల తనకు తగిన మిత్రులు గలుగుటయు, ఆరోగ్యవంతమగు దేహమున్ను గలవారు ధన్యులు; పుణ్యాత్ములు. ధనము కావలసినచో జనులనుండి గ్రహించవచ్చును గాని యౌవనము నాకు లేదు (అనగా లభింపనేరదు.)

శ్లో॥ అసత్యర్థే నృణాం యాచ్ఞా ప్రవణం జాయతే మనః।
సత్యశేషే కథం యాచ్ఞాం మమ జిహ్వా కరిష్యతి॥

తా॥ ధనము లేనప్పుడు జనుల మనస్సు యాచనాతత్పరమగుచున్నది. సమస్తము వున్నప్పుడు నా నోరెట్లు యాచనాపరములగు దీనవాక్కులను పల్కును?

శ్లో॥ యైర్న చింత్యం ధనం కించిన్మమ గేహేఽస్తి నాస్తి వా।
పితృబాహుతరుచ్ఛాయాం సంశ్రితాస్సుఖినో హి తే॥

తా॥ తండ్రి హస్తమనే చెట్టునీడ నాశ్రయించి మా యింటివద్ద "ఇది ఉన్నది, అది లేదు" అనే చింతగూడ యెవరికుండదో వారే నిజముగా సుఖవంతులు.

శ్లో॥ యే తు బాల్యాత్ప్రభృత్యేవ వినా పిత్రా కుటుంబినః।
తాన్సుఖస్వాదవిభ్రంశాన్మన్యే ధాత్రైవ వంచితాన్॥

తా॥ ఎవరు బాల్యమాదిగా తండ్రి లేనివారో, వారలను సుఖలేశానుభవమునకు గూడ నోచుకొననివారై బ్రహ్మదేవునిచేత వంచింపబడినవారని నేను తలంతును.

శ్లో॥ తద్వయం తత్ప్రసాదేన ధనరత్నాదిసంచయం।
పితృభక్తాః ప్రయచ్ఛామః కామతో నిత్యమర్థినామ్॥

తా॥ అందువలన పైజెప్పిన కొఱత లేవియు లేక మా తండ్రిగారి యనుగ్రహము వలన ధనరత్నాది సమస్తవస్తుచయమును పితృభక్తిపరుడనై అర్థులకు యథేచ్ఛగా నిచ్చుచుందును.

శ్లో॥ తత్సర్వమిహ సంప్రాప్తం యదంఘ్రియుగళం తవ।
మచ్చూడామణినా ఘృష్టం యచ్చాంగస్పర్శమాప్తవాన్॥

తా॥ మరియు యిప్పుడు నా శిరోభూషణముచేత ఒరుచుకొనుచున్నదై మీ దేహసంస్పర్శనము గలిగిన తమ పాదపద్మయుగళము దొరికినందున అంతయు నేను పొందినవాడనే అయితిని.

శ్లో॥ ఇత్యేవం ప్రశ్రితం వాక్యముక్తః పన్నగసత్తమః।
ప్రాహ రాజసుతం ప్రీత్యా పుత్రయోరుపకారిణమ్॥

తా॥ ఇట్లు వినమ్రమైన ఆ రాజకుమారు నుద్దేశించి తన పుత్రుల కుపకారియని దలంచి ప్రీతితో ఆ నాగరాజిట్లనెను.

శ్లో॥ యది రత్నసువర్ణాది మత్తోఽవాప్తుం న తే మనః।
యదన్యన్మనసః ప్రీత్యై బ్రూహి తత్తే దదామ్యహమ్॥

తా॥ ఓ రాజకుమారా! ఒకవేళ నీవు మానుండి సువర్ణాదివస్తువులను తీసికొనుట కిష్టపడకపోయినచో నీ మనస్సునకు ప్రీతిని గలిగించెడు మరి దేనినైనను కోరుకొనుము. దానిని నీకు నేనిచ్చెదను.

కువలయాశ్వ ఉవాచ = కువలయాశ్వుడు చెప్పెను.

శ్లో॥ భగవన్ త్వత్ప్రసాదేన ప్రార్థితస్య గృహే మమ।
సర్వమస్తి విశేషేణ సంప్రాప్తం తవ దర్శనాత్॥

తా॥ ఓ పూజ్యుడా! తమదయవలన నేను కోరినదంతయు నా గృహముననున్నది. ఇప్పుడు తమదర్శనమువలన అది మరింత విశేషమైనది.

శ్లో॥ కృతకృత్యోఽస్మి చైతేన సఫలం జీవితం మమ।
యదంగసంశ్లేషమిత స్తవ దేవస్య మానుషః॥

తా॥ దివ్యపురుషులగు తమ అంగసంస్పర్శనమువలన మనుష్యలోకసంబంధినగు నేను కృతకృత్యుడనైతిని. ఈ మీ దర్శనము చేత నా జీవితము సఫలమైనది.

శ్లో॥ మమోత్తమాంగే త్వత్పాదరజసా యదిహాస్పదం।
కృతం తేనైవ స ప్రాప్తం కిం మయా పన్నగేశ్వర॥

తా॥ నా శిరస్సునందు మీ పాదధూళికి ఆస్పదమేర్పడినప్పుడు ఇక నా చేత పొందబడనిదేది? ఓ పన్నగేంద్రా! నాచేత నన్నియు పొందబడినవి. నాకేమియు కొదువలేదు.

శ్లో॥ యది త్వవశ్యం దాతవ్యో వరో మే మనసేప్సితః।
తత్పుణ్యకర్మసంస్కారో హృదయాన్మా వ్యపైతు మే॥

తా॥ ఒకవేళ నా మనోభీష్టమగు వరమేదైన తప్పక యిచ్చెదరే తీరవలెనని మీ కున్నట్లయితే నా హృదయమునుండి పుణ్యకర్మ సంస్కారమెప్పుడును బాయకుండునట్లు వరమనుగ్రహింపుడు.

శ్లో॥ సువర్ణమణిరత్నాదివాహానం గృహమాసనం।
స్త్రియోఽన్నపానం పుత్రాశ్చ చారు మాల్యానులేపనమ్॥
ఏతే చ వివిధా భోగా గీతవాద్యాదికం చ యత్।
సర్వమేతన్మను మతం ఫలం పుణ్యవనస్పతేః॥

తా॥ ఎందుకనగా సువర్ణమణిరత్నాదులు, వాహనములు, గృహములు, ఆసనములు, స్త్రీలు, అన్నపానాదులు, పుత్రులు, మనోహరములగు మాల్యానులేపనములు, గీతములు, వాద్యములు మొదలగు యీ సమస్త భోగములును పుణ్యవృక్షముయొక్క ఫలములని నా యభిప్రాయము.

శ్లో॥ తస్మాన్నరేణ తన్మూలసేకే యత్నః కృతాత్మనా।
కర్తవ్యః పుణ్యసక్తానాం న కించిద్భువి దుర్లభమ్॥

తా॥ ఆ కారణమువలన మానవుడు నిశ్చయబుద్ధిగలవాడై ఆ ఫలమునకు కారణమగు మూలమునందు నీరుపోయుటకు యత్నించవలెను. పుణ్యకార్యపరులకు లోకములో దుర్లభమగునదేదియు లేదు.

అశ్వతర ఉవాచ = అశ్వతరుడు చెప్పెను.

శ్లో॥ ఏవం భవిష్యతి ప్రాజ్ఞ తవ ధర్మాశ్రితా మతిః।
సత్యం చ తత్ఫలం సర్వం ధర్మస్యోక్తం యథా త్వయా॥

తా॥ జ్ఞానసంపన్నుడవగు నో కుమారా! ధర్మాశ్రితమగు నీ బుద్ధి యెట్లున్నదో అట్లే కాగలదు. ఐశ్వర్యభోగములును పుణ్యఫలములని నీవు చెప్పినదంతయు సత్యమే. పుణ్యాత్ముడవగు నీకవి లభించుటయు సత్యమే

శ్లో॥ తథాప్యవశ్యం మద్గేహమాగతేన త్వయాఽధునా।
గ్రాహ్యం యన్మానుషే లోకే దుష్ప్రాపం భవతో మతమ్॥

తా॥ అయినప్పటికి మా యింటికి అతిథిగావచ్చిన నీ చేత యిప్పుడు మనుష్యలోకములో పొందుటకు శక్యముగాదని దేనిని నీ వనుకొందువో అట్టిది మానుండి తప్పక గ్రహించబడవలసియున్నది.

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా స తదా నృపనందనః।
ముఖావలోకనం చక్రే పన్నగేశ్వరపుత్రయోః॥

తా॥ అతనియొక్క ఆ మాటలనువిని అప్పుడా రాజకుమారుడు నాగకుమారుల ముఖముల నవలోకించెను.

శ్లో॥ తతస్తౌ ప్రణిపత్యోభౌ రాజపుత్రస్య యన్మతం।
తత్పితుః సకలం వీరౌ కథయామాసతుస్స్ఫుటమ్॥

తా॥ దానిని గ్రహించి వీరులగు నాగకుమారులిరువురు తండ్రికి నమస్కరించి, రాజపుత్రుని యభీష్టమునంతయు విస్పష్టముగా చెప్పివేసిరి.

శ్లో॥ తాతాస్య పత్నీ దయితా శ్రుత్వేమం వినిపాతితం।
అత్యజద్దయితా ప్రాణాన్విప్రలబ్ధా దురాత్మనా॥

తా॥ తండ్రీ! ఈతనియందు బద్ధానురాగయగు ధర్మపత్ని, వంచకుడగు నొక రాక్షసునిచేత నీతడు చనిపోయినట్లుగావిని, పతివ్రతయగు నామె ప్రాణమునువిడిచెను.

శ్లో॥ గంధర్వరాజస్య సుతా నామ్నా ఖ్యాతా మదాలసా।
కేనచిత్కృతవైరేణ దానవేన కుబుద్ధినా॥

తా॥ ఆమె గంధర్వరాజుకుమార్తె, మదాలసయను పేరుగలది. పూర్వవైరముగల కుత్సితుడగు నొకరాక్షసునిచేత నిట్లు చేయబడినది.

శ్లో॥ కృతజ్ఞోఽయం తతస్తాత ప్రతిజ్ఞాం కృతవానిమాం।
నాన్యా భార్యా భవిత్రీ మే వర్జయిత్వా మదాలసామ్॥

తా॥ కృతజ్ఞుడగు నీ రాజపుత్రుడు యీ క్రిందివిధముగా ప్రతిజ్ఞ జేసెను: "మదాలస తప్ప యింకెవతెయు నాకు భార్య కాజాలదు" అని.

శ్లో॥ ద్రష్టుం తాం చారు సర్వాంగీమయం వీరో ఋతధ్వజః।
తాత వాంఛతి యద్యేతత్క్రియతే తత్కృతం భవేత్ ॥

తా॥ తండ్రీ! వీరుడగు నీ ఋతధ్వజు డిప్పుడు సర్వాంగసుందరియగు నా మదాలసను జూడగోరుచున్నాడు. ఒకవేళ నీచేత నిది చేయబడినట్లయితే అతనికి ఉపకారము చేసినట్లగును.

అశ్వతర ఉవాచ = అశ్వతరుడు చెప్పెను.

శ్లో॥ భూతై ర్వియోగినో యోగస్తాదృశై రేవ తాదృశః।
కథమేతద్వినా స్వప్నం మాయాం వా శంబరోదితామ్ ॥

తా॥ గతించినవారితో వియోగులకు కలయిక యెట్లు సంభవమగును? అటువంటి వారయిననే అట్టివారితో కలయిక సంభవించును. గతించినవారిని స్వప్నములోనైనా చూడవలెను, లేదా శాంబరీమాయచేతనైనా చూడవలెనుగాని వేరు మార్గములేదు.

శ్లో॥ ప్రణిపత్య భుజంగేశం పుత్రశ్శత్రుజిత స్తతః।
ప్రత్యువాచ మహాత్మానం ప్రేమలజ్జాసమన్వితః ॥

తా॥ ఇది విని ఆ రాజకుమారుడు నాగేశ్వరునకు నమస్కరించి లజ్జా ప్రేమ సమన్వితుడై ఆ మహాత్మునితో నిట్లు చెప్పెను.

శ్లో॥ మాయామయీమప్యధునా మమ తాతో మదాలసాం।
యది దర్శయతే మన్యే పరం కృతమనుగ్రహమ్ ॥

తా॥ ఓ తండ్రీ! మాయామయి అయినాసరే యిప్పుడు మదాలసను నాకు చూపించినచో నాయందు గొప్ప అనుగ్రహము గలవాడవని తలంతును.

అశ్వతరుడు మదాలస మరల బ్రతికిన తెఱంగు జెప్పి ఋతధ్వజున కొసంగుట

అశ్వతర ఉవాచ = అశ్వతరుడు చెప్పెను.

శ్లో॥ తస్మాత్త్వ శ్యేహ వత్స త్వం మాయాం చేద్ద్రష్టుమిచ్ఛసి।
అనుగ్రాహ్యో భవాన్ గేహే బాలోప్యభ్యాగతో గురుః ॥

తా॥ ఓ వత్సా! అట్లయినచో నీవు మాయాకృతమగు మదాలసను చూడదలంచినచో చూడుము. ఇంటికి వచ్చిన అతిథి బాలుడయినను గురువే. అందువలన చూచుటకు నీకభ్యంతరమేమి?

శ్లో॥ ఆనయామాస నాగేంద్రో గృహే గుప్తాం మదాలసాం।
దర్శయామాస చ తదా రాజపుత్రాయ తాం శుభామ్॥

తా॥ ఇట్లు చెప్పి యింటిలో రహస్యముగా దాచియుంచిన మదాలసను తీసికొనివచ్చి రాజపుత్రునకు చూపించెను.

శ్లో॥ తేషాం సమ్మోహనార్థాయ జజల్ప చ తతః స్ఫుటం।
సేయం నవేతి తే భార్యా రాజపుత్ర మదాలసా॥

తా॥ వారలను మోహింపజేయుటకై ఓయీ! రాజకుమారా! ఈమె నీ భార్యయగు మదాలసయేనా? అని స్ఫుటవాక్కులతో నడిగెను.

శ్లో॥ స దృష్ట్వా తాం తదా తన్వీం తత్క్షణాద్విగతత్రపః।
ప్రియేతి తామభిముఖం యయౌ వాచముదీరయన్॥

తా॥ ఆ రాజకుమారుడు ఆమెను చూచి వెంటనే లజ్జావిరహితుడై "హా ప్రియా" అని అరచుచు ఆమెకు యెదురుగా పోయెను.

శ్లో॥ నివారయామాస చ తం నాగసోఽశ్వతర స్త్వరన్।
మాయేయం పుత్ర మాస్ప్రాక్షీః ప్రాగేవ కథితం తవ।
అంతర్ధానముపైత్యాశు మాయాసంస్పర్శనాదిభిః॥

తా॥ అప్పుడు నాగరాజు త్వరపడి ఆతని నివారించుచు, కుమారా! ఇది మాయ అని ముందుగానే చెప్పియుంటిని. అట్లు ప్రశ్నించకుము. స్పర్శ తగిలినచో ఆమె శీఘ్రముగా అంతర్ధానమొందును.

శ్లో॥ తతః పపాత మేదిన్యాం స తు మూర్ఛాపరిప్లుతః।
హా ప్రియేతి వదన్ సోఽథ చింతయామాస భామినీమ్॥

తా॥ తరువాత ఆ రాజకుమారుడు మూర్ఛలో మునిగినవాడై భూమిపైనిపడెను. పిమ్మట "హా ప్రియా" అని చెప్పుచు ఆమెనుగూర్చి మిగుల దుఃఖించెను.

శ్లో॥ మోహహో మమాయం నోవేతి నాలం ప్రత్యయవానహం।
అహో మమేత్యహం చేతి బలం ప్రత్యయయోర్మహత్॥

తా॥ అహో! ఏమి నా యీ మోహము! ఇది నాది కాదని నేను నమ్మజాలకున్నాను. నాది యనియు నేను అనియు గల యీ విశ్వాసము (భ్రాంతి)యొక్క బలమెంత గొప్పది!

శ్లో॥ యేనాహం పాతనోఽరీణాం వినా శస్త్రం నిపాతితః।
మమేతి దర్శితాఽనేన మిథ్యా మాయేతి విస్ఫుటమ్।
వాయ్వంబుతేజసాం భూమేరాకాశస్య చ చేష్టయా॥

తా॥ పంచభూతములచేత రచింపబడిన యీమె మిథ్యాభూతమైన మాయ యని చెప్పి శస్త్రమును ప్రయోగింపకనే నన్నీతడు పడద్రోసెనుగదా!

శ్లో॥ తతః కువలయాశ్వం స సమాశ్వాస్య భుజంగమః।
కథయామాస తత్సర్వం మృతసంజీవనాదికమ్॥

తా॥ తరువాత ఆ నాగరాజు కువలయాశ్వుని ఊరడించి యీమె జీవించిన విధానమునంతయు జెప్పెను.

శ్లో॥ తతః ప్రహృష్టః ప్రతిలభ్య కాంతాం
ప్రణమ్య నాగం నిజమాజగామ।
సంస్తూయమానశ్చ పురం తమశ్వ
మారుహ్య సంచింతితమభ్యుపేతమ్॥

తా॥ అది విని ఆ ఋతధ్వజుడు మిక్కిలి సంతోషించినవాడై తిరుగ తన భార్యతో కూడుకొన్నవాడై నాగరాజునకు నమస్కరించి, స్తుతించి జరిగిన సంఘటనను చింతించుచు కువలయమను అశ్వము నధిరోహించి నిజనగరమునకు పోయెను.

శ్లో॥ శృణుయాద్భక్తిపూర్వం యో నైరంతర్యేణ మానవః।
వేదఘోషఫలం తేన ప్రాప్తం వై భువి దుర్లభమ్॥
సంప్రాప్తోఽతిసుఖం నిత్యం సర్వకామసమన్వితః।
లోకే చ దుర్లభం తస్య నాస్తి కించిన్న విద్యతే॥

తా॥ ఈ చరిత్రమును భక్తిపూర్వకముగా నే మానవుడు వినునో, అతడు లోకమున నతిదుర్లభమగు వేదఘోషఫలమును పొందును. సమస్తకోరికలు తీరినవాడై నిత్యసుఖమును పొందును. అతనికి లోకములో దుర్లభమైనది లేనేలేదు.

ఇతి శ్రీ మార్కండేయమహాపురాణే కువలయాశ్వీయే మదాలసోపాఖ్యానం నామ ద్వావింశోఽధ్యాయః

ఇది శ్రీ మార్కండేయమహాపురాణమునందు కువలయాశ్వచరిత్రమున మదాలసోపాఖ్యానమను పేరుగల ఇరువదిరెండవ అధ్యాయము.



శ్లో॥ ఆగత్య స పురం సోఽథ పిత్రోస్సర్వమశేషతః।
కథయామాస తన్వంగీ యథా ప్రాప్తా పునర్మృతా॥

తా॥ తరువాత ఋతధ్వజుడు తన పట్టణమునకు వచ్చి మరణించిన మదాలస తిరుగ యెట్లు జనించినదో, యెట్లు లభ్యమైనదో యీ మొదలుగాగల విషయముల నన్నింటిని తండ్రికి చెప్పెను.

శ్లో॥ ననామ సాఽపి చరణౌ శ్వశ్రూశ్వశురయోశ్శుభా।
స్వజనం చ యథాపూర్వం వందనాశ్లేషణాదిభిః॥
పూజయామాస తన్వంగీ యథాన్యాయం యథావయః।
తతో మహోత్సవో జజ్ఞే పౌరాణాం తత్ర వై పురే॥

తా॥ ఆ మదాలసయు అత్తమామల పాదములకు నమస్కరించి, తక్కినవారలను యథాయోగ్యముగా వయస్సునుబట్టి, యోగ్యతనుబట్టి, వందన ఆలింగనాదికములచే పూజించెను. తరువాత ఆ పట్టణమునందు పురజనులలో నొక గొప్ప ఫుత్సాహముతో గూడిన ఉత్సవము జనించెను.

శ్లో॥ ఋతధ్వజశ్చ సుచిరం తయా రేమే సుమధ్యయా।
నిర్ఝరేషు చ శైలానాం నిమ్నగా పులినేషు చ॥

తా॥ ఋతధ్వజుడున్ను చాలకాలము ఆ మదాలసతో శైలములయందలి సెలయేళ్ళచెంతను, నదీపులినతలములయందును,

శ్లో॥ కాననేషు చ రమ్యేషు వనేషూపవనేషు చ।
పుణ్యక్షయం వాంఛమానా సాఽపి కామోపభోగతః।
సహ తేనాతికాంతాసు రేమే రమ్యాసు భూమిషు॥

తా॥ మహారణ్యములయందును మనోహరములగు ఉపవనములయందును విహరించెను. ఆ మదాలసయు తన పూర్వపుణ్యవశమున సంప్రాప్తములయిన భోగములను అనుభవించుచు మిక్కిలి మనోజ్ఞములగు ఆయాస్థలములయందు ఆ ఋతధ్వజునితో విహరించెను.

శ్లో॥ తతః కాలేన మహతా శత్రుజిత్స నరాధిపః।
సమ్యక్ ప్రశాస్య వసుధాం కాలధర్మముపేయివాన్॥

తా॥ తరువాత చాలకాలమువరకు రాజగు శత్రుజిత్తు భూమినేలి పిదప కాలధర్మము నొందెను.

శ్లో॥ తతః పౌరా మహాత్మానం పుత్రం తస్య ఋతధ్వజం ।
అభ్యషించత రాజానముదారాచారచేష్టితమ్ ॥

తా॥ పిమ్మట పౌరులు మహాత్ముడును శత్రుజిత్తుకుమారుడును ఉదారములగు ఆచారవ్యవహారములుగల ఋతధ్వజుని రాజుగా నభిషేకించిరి.

ఋతధ్వజునకు మదాలసయందు పుత్రులు జన్మించుట, జోలపాట నెపమున మదాలస మొదటి ముగ్వురు పుత్రులను ఆత్మజ్ఞానులనుగా జేయుట

శ్లో॥ సమ్యక్పాలయత స్తస్య ప్రజాః పుత్రానివౌరసాన్ ।
మదాలసాయాం సంజజ్ఞే పుత్రః ప్రథమజ స్తతః ॥

తా॥ తరువాత తన కన్నబిడ్డలవలె ప్రజలను పరిపాలించుచున్న ఆ ఋతధ్వజునకు కొన్నాళ్ళకు మదాలసయందు మొదటిపుత్రుడు కలిగెను.

శ్లో॥ తస్య చక్రే పితా నామ విక్రాంత ఇతి ధీమతః ।
తుతుషు స్తేన వై భృత్యా జహాస చ మదాలసా ॥

తా॥ రూపాద్యంగసౌష్ఠవములు నవలోకించి ఆ శిశువునకు బుద్ధిమంతుడగునని తండ్రి విక్రాంతుడను పేరిడెను. ఆ పేరు విని అనుచరులును, అంతఃపురవాసులందరును సంతోషించిరి. కాని మదాలస మాత్రము నవ్వెను. ఆ పేరు ఆమెను తృప్తినొందింపలేదు.

శ్లో॥ సా వై మదాలసా పుత్రం బాలముత్తానశాయినం ।
ఉల్లాపనచ్ఛలేనాహ రుదమానమవిశ్వరమ్ ॥

తా॥ ఆ మదాలస ఎత్తైన ఉయ్యేలలో పండుకొని వికస్వరముతో నేడ్చుచున్న తన పుత్రు నుద్దేశించి ఓదార్పు నెపముతో నిట్లనెను.

శ్లో॥ శుద్ధోఽసి రే తాత న తేఽస్తి నామ
కృతం చ తే కల్పనయాఽధునైవ ।
పంచాత్మకం దేహమిదం న తేఽస్తి
నైవాస్య త్వం రోదిషి కస్య హేతోః ॥

తా॥ ఓ తండ్రీ! నీవు పరిశుద్ధుడవగు పరబ్రహ్మవు. నీకు పేరే లేదు. నీవు నామ రూపాతీతుడవు. నీకీపేరిప్పుడే క్రొత్తగా కల్పించబడినది. పంచభూతాత్మకమగు యీ దేహముగూడ నీకు లేదు. దీనికిని నీకును యెట్టి సంబంధములేదు. మరి నీవెందు కేడ్చుచున్నావో నాకు తెలియదు.

శ్లో॥ న వా భవాన్రోదితి వై స్వజన్మా
శుద్ధోఽయమాసాద్య మహీసమూహం।
వికల్ప్యమానో వివిధై ర్గుణార్థై
ర్గుణాశ్చ భౌతాః సకలేంద్రియేషు ॥

తా॥ పరిశుద్ధస్వరూపుడవగు నీవు పృథివ్యాదిపంచభూతాత్మకమగు నీ దేహమును పొంది, వివిధములగు విషయగుణముల చేత వికల్ప్యమానుడవై, అశుద్ధుడనైతినని యేడ్చుచున్నావా? సకలేంద్రియములయందలి గుణములు భూతకల్పితములు. వాటికిని నీకును యెట్టి సంబంధమును లేదు. ఇక నీకీదుఃఖ మెందుకు?

శ్లో॥ భూతాని భూతైః పరిదుర్బలాని
వృద్ధిం సమాయాంతి యథేహ పుంసః।
అన్నాంబుపానాదిభిరేవ కస్య
న తేఽస్తి వృద్ధిర్న చ తేఽస్తి హానిః ॥

తా॥ భూతములు భూతములచేతనే దుర్బలములగుచున్నవి, వృద్ధిని బొందుచున్నవి. అదేవిధముగ పురుషునియొక్క దేహము అన్నము, నీరు మొదలగువాటిచేత వృద్ధినొందుచున్నది. దేహవిలక్షణుడవైన నీకు వృద్ధిగాని, హానిగాని లేదు.

శ్లో॥ త్వం కంచుకే శీర్యమాణే నిజేఽస్మిన్
తస్మింశ్చ దేహే మూఢతాం మా వ్రజేథాః।
శుభాశుభైః కర్మభిర్దేహమేత
న్మదాదిమూఢైః కంచుకస్తే పినద్ధః ॥

తా॥ తొడుగుకొన్న చొక్కాయి శిథిలమై జీర్ణించిపోయినను శరీరమున కెట్టి బాధయు లేనట్లు, యీ శరీరము జీర్ణించిపోయినను ఆత్మస్వరూపుడవగు నీకెట్టి లోపమును లేదు. కావున దేహమునుగూర్చి మోహపడకుము. శుభాశుభకర్మకారకులగు మదమాత్సర్యాదులనే మూఢులచేత యీ దేహమనే కంచుకము నీకంటగట్టబడినది.

శ్లో॥ తాతేతి కించి త్తనయేతి కించి
దంబేతి కించిద్దయితేతి కించిత్।
మమేతి కించిన్న మమేతి కించి
ద్భౌతం హి సంఘం బహుధా లపేథాః॥

తా॥ తండ్రియని కొంతసేపు, తనయుడని కొంతసేపు, తల్లియని కొంతసేపు, భార్యయని కొంతసేపు, నాదని కొంతసేపు, నాది కాదని కొంతసేపు యిట్లే యీ భూతసంఘము అనేకవిధములుగా ప్రలపించును.

శ్లో॥ దుఃఖాని దుఃఖోపగమాయ భోగా
న్సుఖాయ జానాతి విమూఢచేతాః ।
తాన్యేవ దుఃఖాని పునస్సుఖాని
జానాతి విద్వానవిమూఢచేతాః ॥

తా। అజ్ఞానులు దుఃఖకరములగు భోగములను సుఖములని తలంచి అనుభవమున దుఃఖమునే పొందుచున్నారు. మోహదూరులగు జ్ఞానులు ఆ సుఖములనే దుఃఖములని తలంతురు.

శ్లో॥ హాసోస్థిసందర్శనమక్షియుగ్మ
మత్యుజ్జ్వలం యత్కలుషం వసాయాః ।
కుచాదిపీనం పిశితం ఘనం త
త్స్థానం రతేః కిం నరకో న యోషిత్ ॥

తా॥ నవ్వులు, విలాసములు, అస్థిపంజరముతో గూడుకొన్న అవయవములు, ఆ కండ్లు, క్రొవ్వుతో కలుషితమై ఉజ్వలమైన శరీరము, పీనములగు కుచములు, బలిసిన కండరములుగల స్త్రీ నరకద్వారముగాదా!

శ్లో॥ యానం క్షితౌ యానగతశ్చ గేహో
దేహోఽపి చాన్యః పురుషో నివిష్టః ।
మమత్వముర్వ్యాం న తథా యథా స్వే
దేహేఽతిమాత్రం చ విమూఢతైషా ॥

తా॥ భూమియందు వాహనమున్నది. వాహనమునందు దేహమధిష్ఠించియున్నది. దేహమునందు పురుషుడున్నాడు. అయితే స్వదేహమునందున్న అభిమానము భూమిపైన లేదు. మరి దేహమునం దెందుకుండవలెను? అట్లు దేహముపైన అభిమానించుట మూఢత్వమేగదా?

శ్లో॥ త్యజ ధర్మమధర్మం చ ఉభే సత్యానృతే త్యజ ।
ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ ॥

తా॥ ధర్మాధర్మములను విడువుము. సత్యానృతముల రెంటిని విడువుము. వాటిని విడిచిన పిదప దేనిచేత విడివడితో దానిని విడువుము.

"అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాచ్చాన్యత్రాస్మాత్కృతాకృతాత్ ।
అన్యచ్చ భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద॥"

శ్లో॥ వర్ధమానం సుతం సా తు రాజపత్నీ దినేదినే ।
తముల్లాపాదినా బోధమనయన్నిర్మలాత్మకమ్ ॥

తా॥ రాజపత్నియగు మదాలస దినదినము వృద్ధిని బొందుచున్న ఆ కుమారుని యిట్టి ఊరడింపుల నెపముతో నిర్మలమగు ఆత్మబోధ కలవానినిగా జేసెను.

శ్లో॥ యథా యథా బలం లేభే యథా లేభే మతిం తతః ।
తథా తథాఽఽత్మబోధం చ సోఽవాపన్మాతృభాషితైః ॥

తా॥ శరీరమునకు దార్ఢ్యమేర్పడినకొలది, బుద్ధిబల మధికరించినకొలది యాతడు తల్లిబోధలచేత మరింత అధికజ్ఞానమును పొందెను.

శ్లో॥ ఇత్థం తయా స తనయో జన్మప్రభృతి బోధితః ।
చకార న మతిం ప్రాజ్ఞో గార్హస్థ్యం ప్రతి నిర్మమః ॥

తా॥ ఈ విధముగా పుట్టినదాది తల్లిచేత ప్రబోధితుడై జ్ఞానసంపన్నుడును మమత్వరహితుడగు నాతడు గృహస్థధర్మమును స్వీకరించుట కిష్టపడలేదు.

శ్లో॥ ద్వితీయోఽస్యాస్సుతో జజ్ఞే తస్య నామాకరోత్పితా ।
సుబాహురయమిత్యుక్తే సా జహాస మదాలసా ॥

తా॥ తరువాత మదాలసకు రెండవకుమారుడు పుట్టెను. ఆ పుత్రునికి తండ్రి "సుబాహువు" అను నామకరణమును చేసెను. ఆ పేరు విని మదాలస మరల నవ్వెను.

శ్లో॥ తమప్యేవం యథాపూర్వం బాలముల్లాపవాదినీ ।
ప్రాహ బాల్యాత్స చ ప్రాప తథా బోధం మహామతిః ॥

తా॥ ఆ బాలునికిగూడ మదాలస పూర్వమువలెనే జోలపాటల నెపమున ఆత్మజ్ఞానము నుపదేశించెను. ఆతడు నట్లే ఆత్మబోధమును పొందెను.

శ్లో॥ తృతీయం తనయం జాతం తం రాజా శత్రుమర్దనం ।
యదాహ తేన సా సుభ్రూ జహాసాతిచిరం పునః ॥

తా॥ మరల మూడవసంతానముగూడ మగశిశువేయైనందున రాజాతనికి "శత్రుమర్దను"డను పేరిడెను. ఆ పేరు విని మదాలస మరల మిక్కిలి నవ్వెను.

శ్లో॥ తథైవ సోఽపి తన్వంగ్యా బాలత్వాదేవ బోధితః ।
క్రియాశ్చకార నిష్కామా న కించిత్ఫలకారణమ్ ॥

తా॥ అదేప్రకారము యీతడుగూడ తల్లిచేత ప్రబోధింపబడి నిష్కామకర్మలను జేయుచు సాంసారికసుఖముల నపేక్షింపలేదు.

శ్లో॥ చతుర్థస్య సుతస్యాథ చికీర్షుర్నామ భూపతిః ।
దదర్శ తాం శుభాచారామీషద్ధాసాం మదాలసామ్ ॥

తా॥ నాలుగవపుత్రునకు నామకరణము చేయఁగోరుచు ఆ రాజు, కొంచెము మందహాసము చేయుచు అక్కడే నిలుచున్న మదాలసను చూచెను.

శ్లో॥ తామాహ రాజా హసతీం కించిత్కౌతూహలాన్వితః ।
క్రియమాణేఽసకృన్నామ్ని కథ్యతాం హాస్యకారణమ్ ॥

తా॥ అట్లు నవ్వుచున్న మదాలసను జూచి కొంచెము కుతూహలచిత్తుడై రాజు "నేను పెట్టిన పేరులకు అన్నిటికి నీవు నవ్వుటకు కారణమేమియో చెప్పుము". అని అడిగెను.

శ్లో॥ విక్రాంతశ్చ సుబాహుశ్చ యథాఽన్యః శత్రుమర్దనః ।
శోభనానీతి నామాని తాని మన్యే కృతాని వై ॥

తా॥ విక్రాంతుడనియు, సుబాహుడనియు మరియు శత్రుమర్దనుడనియు నుంచబడిన యీ నామధేయములు మనోహరములును, శుభంకరములునైనవనియే నేననుకొనుచున్నాను.

శ్లో॥ యోగ్యాని క్షత్రబంధూనాం శౌర్యాటోపయుతాని చ ।
అసంత్యేతాని వై భద్రే యది తే మనసి స్థితమ్ ॥

తా॥ శౌర్యాటోపయుతములగు యీ పేర్లు క్షత్రియులకు తగినవేగదా! ఒకవేళ యీ నామములు బాగులేవని నీవనుకొన్నట్లయితే,

శ్లో॥ తదస్య క్రియతాం నామ చతుర్థస్య సుతస్య మే ॥

తా॥ ఈ నాలుగవవానికి నీవు నామకరణ మొనరింపుము.

మదాలసోవాచ = మదాలస చెప్పెను.

శ్లో॥ మయాజ్ఞా భవతః కార్యా మహారాజ యథాత్థ మాం ।
తథా నామ కరిష్యామి చతుర్థస్య సుతస్య తే ॥

తా॥ ఓ రాజా! నీవు వివాహకాలమందు చేసిన ప్రతిజ్ఞాప్రకారము చేయుటకు అంగీకరించినట్లయితే యీ బాలునికి నేను నామకరణము చేసెదను.

శ్లో॥ అలర్క ఇతి ధర్మజ్ఞః ఖ్యాతిం లోకే గమిష్యతి ।
కనీయానేష తే పుత్రో మతిమాంశ్చ భవిష్యతి ॥

తా॥ అనిన ఆ మాటకు రాజు ఒడంబడగా మదాలస ఆ పుత్రునికి "అలర్కుడు" అను నామధేయము నిడి, రాజా! కడపటివాడగు యీ నీ కుమారుడు ధర్మజ్ఞుడును ధీశాలియునై లోకమునందు యశస్సును ఆర్జించగలడు.

శ్లో॥ తచ్ఛ్రుత్వా నామ పుత్రస్య కృతం మాత్రా మహీపతిః ।
అలర్క ఇత్యసంబద్ధం ప్రహస్యేదమథాబ్రవీత్ ॥

తా॥ కుమారునకు తల్లిచేత పెట్టబడిన "అలర్కుడు" అను అసంబద్ధమగు నీ పేరును విని రాజు నవ్వి అసహ్యించుకొని భార్యతో నిట్లనెను.

శ్లో॥ భవత్యా య ఇదం నామ మత్పుత్రస్య కృతం శుభే ।
కిమిదం త్వసంబద్ధమర్థః కోఽస్య మదాలసే ॥

తా॥ ఓసీ మదాలసా! అసంబద్ధమైన యిటువంటి నామధేయము యీ కుమారున కుంచబడినదే దీని కర్థమేమి? "అలర్క" శబ్దమున కర్థము వెర్రికుక్క యనిగదా? ఇట్టి నామకరణము చేయుటయందు నీ యుద్దేశ్యమేమి?

మదాలసోవాచ = మదాలస చెప్పెను.

శ్లో॥ కల్పనేయమ్మహారాజ కృతా సా వ్యావహారికీ ।
త్వత్కృతానాం తథా నామ్నాం శ్రుణు భూప నిరర్థతామ్ ॥

తా॥ ఓ మహారాజా! నాచేత చేయబడిన యీకల్పనయు వ్యావహారికమునకే. దీనినిగూర్చి తరువాత చెప్పెదను. మొదట నీచేత చేయబడిన నామములకు నిరర్థకత యెట్టిదో యిప్పుడు చెప్పెద వినుము.

శ్లో॥ వదంతి పురుషా ప్రాజ్ఞా వ్యాపినం పురుషం సతః ।
క్రాంతిశ్చ గతిరుద్దిష్టా దేశాద్దేశాంతరం తు యా ॥

తా॥ ప్రాజ్ఞులగు సత్పురుషులు పురుషుని (ఆత్మను) సర్వవ్యాపకునిగా చెప్పుచున్నారు. క్రాంతియనగా గతి, అనగా ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు పోవు గమనమునకు శాస్త్రజ్ఞులు అర్థము చెప్పుచున్నారు. వి అను ఉపసర్గమునకు విశేష మని అర్థము. అందువలన "విక్రాంతః" అను పదమునకు విశేషగమనము గలవాడనిగదా అర్థము.

శ్లో॥ సర్వగో న ప్రయాతీహ వ్యాపీ దేహేశ్వరో యతః ।
తతో విక్రాంతసంజ్ఞోఽయం మతా మమ నిరర్థికా ॥

తా॥ సర్వగుడును, అంతట వ్యాపించియున్నవాడు నగు ఆత్మస్వరూపుడగు ఈశ్వరుడు యెక్కడికి పోవును? ఎక్కడికి వచ్చును? సర్వవ్యాపకుడగు నాతనికి రాకపోకలు లేనేలేవుగదా! కనుక అట్టివానికి అంతట పోవువాడనుట సంగతముగాదు కనుక యీ విక్రాంతుడను నామధేయము వ్యర్థమనియే నా వుద్దేశ్యము.

శ్లో॥ సుబాహురితి యా సంజ్ఞా కృతాఽన్యస్య సుతస్య తే।
నిరర్థా సాప్యమూర్తస్య పురుషస్య మహీపతే॥

తా॥ ఇక ని రెండవకుమారునకు నీచేత పెట్టబడిన సుబాహుడు (మంచి బాహువులు కలవాడు) అను పేరేదిగలదో అదియు వ్యర్థమనియే నా వుద్దేశ్యము. ఎందుకనగా ఆకారమే లేనివానికి అవయవము లెక్కడ? "నిరాకారో నిర్వికారః" అందువలన యీ నామమును సంగతముగాదు. మొదలులేని కొమ్మలుండునా?

శ్లో॥ పుత్రస్య యత్కృతం నామ తృతీయస్యారిమర్దనః।
మన్యే తచ్చాప్యసంబద్ధం శృణు చాప్యత్ర కారణమ్॥

తా॥ మరియు మూడవవానికి వుంచబడిన "అరిమర్దనుడు" అను నామధేయము గూడ అసంబద్ధమయినదే. దాని నిరర్థకతకు కారణమేమందురా! వినుడు.

శ్లో॥ ఏక ఏవ శరీరేషు సర్వేషు పురుషో యథా।
తదాఽస్య రాజన్ కశ్శత్రుః కో వా మిత్రమిహేష్యతే॥

తా॥ సమస్తశరీరములలోగల (ఆత్మరూప) పురుషుడు ఒకడే అయ్యున్నప్పుడు తనకంటె అన్యుడే లేనప్పుడు యిక నాతనికి శత్రువెవడు? మిత్రుడెవడు? రెండవవాడుండినగదా శత్రుత్వ మిత్రత్వముల కవకాశము "ద్వితీయాద్ధి భయం భవతి" అనిగదా శ్రుతి.

శ్లో॥ భూతైర్భూతాని మర్ద్యంతే అమూర్తో మర్ద్యతే కథం।
క్రోధాదీనాం పృథగ్భావాత్కల్పనేయం నిరర్థికా॥

తా॥ భూతములచేత భూతములు మర్దింపబడుచున్నవి. అనగా ఆకారముగల వాటిచేత ఆకృతిగల భూతములు మర్దింపబడుచున్నవి. ఆకారమే లేనిచో నిక మర్దన మెక్కడ? కామక్రోధాదులు పురుషునికన్న వేరైనవనుట విస్పష్టము. కావున యీ కల్పనయు నిరర్థకము.

శ్లో॥ యది సంవ్యవహారార్థమసన్నామ ప్రకల్ప్యతే।
నామ్ని కస్మాదలర్కాఖ్యే నైరర్థ్యం భవతో మతమ్॥

తా॥ ప్రపంచవ్యవహారార్థము లేనిదే ఉన్నదని యేదో ఒక అబద్ధపు (అడ్డ దిడ్డపు) వెర్రికుక్క అను పేరు నాచేత పెట్టబడినదనుకొనుడు. అది నిరర్థకమైనదని మీరు చెప్పు టెందులకు? నిజ మాలోచించిన అది సార్థకమైనదేయగును. స్వరూపజ్ఞానము లేని వాడు చేయుపను లెట్లుండును? వెర్రికుక్కవంటివేగదా! అదిగాక అలర్కశబ్దమునకు తనంతట తనకు బుట్టిన వెర్రిగాక ఔషధప్రయోగమువలన కలిగిన వెర్రి. మాయాకల్పితమగు మందును తిన్న జీవుని వెర్రి ప్రపంచమున కనబడుచునేయున్నది.

శ్లో॥ ఏవముక్తస్తయా సాధు మహిష్యా స మహీపతిః ।
తథేత్యాహ మహాబుద్ధిర్దయితాం తథ్యవాదినీమ్ ॥

తా॥ ఇట్లు భార్యయగు మదాలసచేత చెప్పబడినవాడై మహాబుద్ధిమంతుడగు నా రాజు ఆమె నుద్దేశించి నీవు చెప్పినది యథార్థమని శ్లాఘించెను.

భర్త కోరికపై మదాలస కడసారి పుత్రుడగు అలర్కునకు రాజధర్మములను, ఆత్మధర్మములను బోధించుట

శ్లో॥ తం చాపి సా సుతం సుభ్రూః యథా పూర్వసుతాం స్తథా ।
ప్రాహావబోధజననం తామువాచ స పార్థివః ॥

తా॥ మదాలస మొదటి ముగ్గురుకుమారులకు బోధించినట్లు యీతనికిగూడ బోధింప మొదలిడెను. దానినిచూచి రాజు వ్యథగల మనస్సుగలవాడై భార్యతో నిట్లనెను.

శ్లో॥ కరోషి కిమిదం మూఢే మమాభావాయ సంతతేః ।
దుష్టావబోధదానేన యథా పూర్వసుతేషు మే ॥

తా॥ ఓసీ అమాయకురాలా! మొదటి ముగ్గురుని చేసినట్లే వీనినిగూడ జేయ దలంచితివేమి? నా వంశవిచ్ఛేదము చేయుట నీ యభీష్టమా?

శ్లో॥ యది తే మత్ప్రియం కార్యమనుగ్రాహ్యం వచో మమ ।
తదేనం తనయం మార్గే ప్రవృత్తే సన్నియోజయ ॥

తా॥ ఓ మదాలసా! నీవు నాకు ప్రీతికరమగు కార్యమును చేయదలంచినట్లయితే, నా మాటను పాటించు సదభిప్రాయము నీకు వున్నట్లయితే యీ కుమారునైనా ప్రవృత్తి మార్గములో ప్రవేశింపజేయుము.

శ్లో॥ కర్మమార్గసముచ్ఛేదం నైవ దేవి గమిష్యతి ।
పితృపిండనివృత్తిశ్చ నైవ సాధ్వి భవిష్యతి ॥

తా॥ ఓ దేవీ! కర్మమార్గతంతువు తెగిపోగూడదు. పితృదేవతలకు తర్పణాది కార్యములు నిలిచిపోగూడదు.

శ్లో॥ పితరో దేవలోకస్థాస్తథా తిర్యక్త్వమాగతాః ।
తద్వన్మనుష్యతాం యాతా భూతవర్గేషు యే స్థితాః ॥

తా॥ పితరులు, దేవతలు, తిర్యక్కులగు పశుపక్ష్యాదులు, మనుష్యులు యింకను భూతవర్గములలో నేవిగలవో అవి యన్నియును,

శ్లో॥ స పుణ్యానసపుణ్యాంశ్చ క్షుత్ క్షామాం స్తృట్ పరిప్లుతాన్ ।
పిండోదకప్రదానేన నరః కర్మణ్యవస్థితః ।
సదాహ్యాయయతే సుభ్రూ స్తద్వద్దేవాతిథీనపి ॥

తా॥ పుణ్యజీవులేగాని, లేక పాపజీవులేగాని, క్షుధార్తులను దాహపీడితులను పిండోదకప్రదానముచేత సదా మానవుడు కర్మమార్గావలంబియై తృప్తులనుగా జేయుచున్నాడు. అదేవిధమున దేవతలను అతిథులనుగూడ తృప్తి నొందించుచున్నాడు.

శ్లో॥ దేవైర్మనుష్యైః పితృభిః ప్రేతైర్భూతైస్సగుహ్యకైః ।
వయోభిః కృమిభిః కీటైర్నర ఏవోపజీవ్యతే ॥

తా॥ దేవతలు, మనుష్యులు, పితృదేవతలు, భూతములు, పక్షులు, క్రిమికీటకాదులు యివన్నియును మనుష్యునిపై ఆధారపడియే జీవించుచున్నవి.

శ్లో॥ తస్మాత్త్వంగి మే పుత్రం యత్కార్యం క్షత్రయోనిభిః ।
ఐహికాముష్మికాయాలం తత్కర్మ ప్రతిపాదయ ॥

తా॥ అందువలన నో మదాలసా! నా పుత్రుడగు నీ యలర్కుని ఐహికాముష్మికముల కాలవాలమగు ఉత్తమకర్మతునిగా చేయుము.

శ్లో॥ తేనైవముక్తా సా సాధ్వీ వరనారీ మదాలసా ।
అలర్కం నామ తనయం ప్రోవాచోల్లాపవాదినీ ॥

తా॥ పతివ్రతాశిరోరత్నమగు నా మదాలస భర్తచేత నిట్లు చెప్పబడినదై అలర్కుడను పేరుగల ఆ కుమారుని అనునయించుచు యిట్లు చెప్ప దొడంగెను.

శ్లో॥ పుత్ర వర్ధస్వ మే భర్తుర్మనో నందయ కర్మభిః ।
ఐహికాముష్మికఫలం తత్సమ్యక్పరిపాలయ ॥

తా॥ కుమారా! ఆయురారోగ్యములతో వర్ధిల్లుదువుగాక! ఉత్తమకర్మలచేత నీ తండ్రి మనస్సును సంతోషపెట్టుము. ఐహికాముష్మిక ఫలదాయకమగు నా కర్మయోగమును బాగుగా అనుష్ఠింపుము.

శ్లో॥ మిత్రాణాముపకారాయ దుర్హృదాం నాశనాయ చ ।

తా॥ సహృదయులగు స్నేహితులను రక్షించుటకును, దుర్మార్గులను శిక్షించుటకును నీవీ కర్మమార్గము ననుసరింపుము.

శ్లో॥ ధన్యోఽసి రే యో వసుధామశత్రు
రేకశ్చిరం పాలయితాఽసి పుత్ర ।
తత్పాలనాదింద్రసమోపభోగ్యం
ధర్మం ఫలం ప్రాప్స్యసి చామరత్వమ్ ॥

తా॥ కుమారా! ఈ భూమిని చిరకాలము ఏకచ్ఛత్రముగా నెవడు పాలించునో అతడు ధన్యుడు. అట్టి యదృష్టము గలవాడవగుటవలన నీవును ధన్యుడవు. అట్టి రాజ్య పరిపాలనమువలన దేవేంద్రసమానవైభవమును, ధర్మమును, ఐహికాముష్మికఫలమును, అమరత్వమును పొందగలవు.

శ్లో॥ ధరామరాన్పర్వసు తర్పయేథాః
సమీహితం బంధుషు పూరయేథాః ।
హితం పరస్మై హృది చింతయేథాః
మనః పరస్త్రీషు నివర్తయేథాః ॥

తా॥ పర్వదినములయందు బ్రాహ్మణాది సత్పురుషులను భోజనాదికముచేత తృప్తి నొందించుము. బంధుజనుల కోరికలను పూరించుము. పరులహితము నెప్పుడు మనస్సునందు చింతించుము. పరస్త్రీలనుండి మనస్సును మరలించుము.

శ్లో॥ సదా మురారిం హృది చింతయేథాః
తద్ధ్యానతోఽంతః షడరీన్జయేథాః ।
మాయాం ప్రబోధేన నివారయేథాః
హ్యానిత్యతామేవ విచింతయేథాః ॥

తా॥ సదా సర్వకాలములయందును హృదయమున భగవంతుని చింతించుము. ఆ భగవద్ధ్యానముచే అరిషడ్వర్గమగు కామ క్రోధ లోభ మోహ మద మత్సరము లను అంతః శత్రువులను జయించుము. నిరంతరప్రబోధము (జ్ఞానము)చేత మాయను నివారింపుము. ఈ జగత్తంతయు మిథ్యయని, విషయములును తదనుభవసాధనమగు యీ దేహమును అనిత్యమని యెల్లప్పుడు చింతించుము.

శ్లో॥ అర్థాగమాయ క్షితిపాన్జయేథాః
యశోఽర్జనాయార్థమపి వ్యయేథాః ।
పరాపవాదశ్రవణాద్బిభీథాః
విపత్సముద్రాజ్జనముద్ధరేథాః ॥

తా॥ ధనసంపాదనముకొరకు రాజులను జయించుము. కీర్తి సంపాదనమునకై ధనమును వ్యయించుము. పరులను నిందించుటకుగాని, పరులచేత నిందింపబడుటకుగాని భయపడుము. విపత్సముద్రమునుండి జనుల నుద్ధరించుటకే సదా ప్రయత్నింపుము.

"శాంతా మహాంతో నివసంతి సంతః వసంతవల్లోకహితం చరంతః ।
తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనానహేతునాఽన్యానపి తారయంతః ॥"
అనిగదా పెద్దల వాక్యము.

శ్లో॥ యజ్ఞైరనేకై ర్విబుధానజస్ర
మన్నైశ్చ ద్విజాన్ప్రీణయ సంశ్రితాంశ్చ।
స్త్రియశ్చ కామైరతులై శ్చిరాయ
యుద్ధైశ్చారీంస్తోషయితాఽసి వీర॥

తా॥ ఓయీ వీరాగ్రణీ! నిరంతరము పెక్కు యజ్ఞముల చేయుటవలన దేవతలను, భోజనాది సత్కారములచేత ఆశ్రితులను, సాధుసజ్జనులను, అభీష్టములను నెరవేర్చుట చేత స్వస్త్రీలను, యుద్ధప్రదానాదులచేత శత్రువులను సంతోషపెట్టగలవు.

శ్లో॥ బాలో మనోనందయ బాంధవానాం
గురో స్తథాఽఽజ్ఞాకరణై॥ కుమారః।
స్త్రీణాం యువా సత్కులభూషణానాం
వృద్ధో వనే వత్స వనేచరాణామ్॥

తా॥ బాల్యదశయందు బంధుజనుల హృదయమును, కౌమారదశయందు ఆజ్ఞాపాలకుడవై గురుజనుల మనస్సును, యువకుడవై సత్కులాలంకృతలగు భవదంతఃపురకాంతాజనాంతఃకరణములను, వృద్ధుడవై వనమునందు నివసించు మునిజనుల మనములను సంతోషపెట్టుము.

శ్లో॥ రాజ్యం కుర్వన్ సుహృదో నందయేథాః
సాధూన్రక్షన్ తాత యజ్ఞైర్యజేథాః।
దుష్టాన్నిఘ్నన్వైరిణశ్చాజిమధ్యే
గోవిప్రార్థే వత్స మృత్యుం భజేథాః॥

తా॥ రాజ్యపాలనము చేయుచు సహృదయులను సంతోషపెట్టుము. సాధువులను రక్షించుము. యజ్ఞములను చేయుము, దుష్టులగు వైరులను నాశమొనరింపుము. గోబ్రాహ్మణ రక్షణార్థమై ప్రాణములనైన ధారవోయుము. ఇదే పరమార్థము. కుమారా! ఈ మార్గమున నీ గతిని సుగమమొనరించుకొనుము.

ఇతి శ్రీమార్కండేయమహాపురాణే మదాలసాచరితే ప్రవృత్తిమార్గానుశాసనం నామ త్రయోవింశోఽధ్యాయః.

ఇది మార్కండేయమహాపురాణమునందలి మదాలసాచరిత్రమున ప్రవృత్తిమార్గానుశాసనమను ఇరువదిమూడవ అధ్యాయము



శ్లో॥ ఏవముల్లాప్యమానస్తు స తు మాత్రా దినేదినే।
వవృధే వయసా బాలో బుద్ధ్యా చాలర్కసంజ్ఞితః॥

తా॥ ఇట్లు తల్లిచే ప్రబోధింపబడినవాడై అలర్కుడను ఆబాలుడు వయస్సుచేతను, బుద్ధిచేతను దినదినము ప్రవర్ధమానుడగుచుండెను.

శ్లో॥ స కౌమారకమాసాద్య ఋతధ్వజసుతస్తదా।
కృతోపనయనః ప్రాజ్ఞః ప్రణిపత్యాహ మాతరమ్॥

తా॥ ఆ యలర్కుడు బాల్యమునుదాటి కౌమారావస్థనుపొంది ఉపనయనాది సంస్కారములు గలవాడై బుద్ధిమంతుడగు నాతడు ఒక దినము తల్లికి నమస్కరించి యిట్లనెను.

శ్లో॥ మయా యదంబ కర్తవ్యమైహికాముష్మికాయ వై।
సుఖాయ వద తత్సర్వం ప్రశ్రయావనతస్య మే॥

తా॥ తల్లీ! ఐహికాముష్మికసుఖముకొరకు యిప్పుడు నేనేమి చేయవలెనో చెప్పుము.

శ్లో॥ మమార్థం చైవ ధర్మార్థం ప్రజానాం చైవ యద్ధితం।
శ్రేయసే యచ్చ తత్సర్వం ప్రజారంజనమాదితః॥

తా॥ నాకును, ధర్మమునకును, ప్రజలకును యేది హితమో, ఏది శ్రేయోదాయకమో, ఏది ప్రజారంజనమో దానినంతయు నాకు చెప్పుము అని వినమితుడై తల్లినడిగెను.

మదాలసోవాచ = మదాలస చెప్పెను.

శ్లో॥ వత్స రాజ్యాభిషిక్తేన ప్రజారంజనమాదితః।
కర్తవ్యమవిరోధేన స్వధర్మశ్చ మహీభృతామ్॥

తా॥ నాయనా! పట్టాభిషిక్తుడగు రాజు మొదట ప్రజలకు విరోధములేని మార్గమున నడచుచు, నడిపించుచు ధర్మమును కాపాడవలయును. ఇదే క్షత్రియులకు స్వధర్మము.

శ్లో॥ వ్యసనాని పరిత్యజ్య సత్యమూలహరాణి వై।
ఆత్మా రిపుభ్యః సంరక్ష్యో బహిర్మంత్ర వినిర్గమాత్॥

తా॥ వ్యసనములు సత్యమనే మూలమునే హరించునట్టివి. అట్టి వ్యసనములను విడిచిపెట్టి నీ యంతఃశత్రువులను బయటికి నెట్టి నిరంతరము ఆత్మను సంరక్షించుకొనవలయును.

శ్లో॥ దుష్టాదుష్టాంశ్చ జానీయాదమాత్యానరిదోషతః।
అష్టధా నాశమాప్నోతి స్వచక్రాత్స్యందనాద్యథా॥

తా॥ రాజు మంత్రులలో దుష్టులెవరు, దుష్టులు కానివారెవరు అను విషయమును బాగుగా తెలుసుకొనవలయును. కామక్రోధాది అరిషడ్వర్గముల దోషమువలన దారి దప్పిన రథమువలె అనేకవిధముల నాశమును బొందుచున్నాడు.

శ్లో॥ తథా రాజాప్యసందిగ్ధం బహిర్మంత్రవినిర్గమాత్ ।
చరైశ్చరాస్తథా శత్రోరన్వేష్టవ్యాః ప్రయత్నతః ॥

తా॥ తమ ఆలోచనలు బయటికి పోయినచో రాజు తప్పక నాశనము బొందగలడు. మరియు ప్రయత్నపూర్వకముగా చారులవలన శత్రువుల రహస్యములను తెలుసుకొనుచుండవలెను.

శ్లో॥ విశ్వాసో న తు కర్తవ్యో రాజ్ఞా మిత్రాప్తబంధుషు ।
కార్యయోగాదమిత్రేషు విశ్వసీత నరాధిపః ॥

తా॥ రాజు సాధారణముగా మిత్రులనైనను, ఆప్తబంధువులనైనను నమ్మరాదు. ఒకొక్కప్పుడు కార్యవశాత్తు శత్రువులనుగూడ నమ్మవలసియున్నది.

శ్లో॥ స్థానవృద్ధిక్షయజ్ఞేన షాడ్గుణ్యవిదితాత్మనా ।
భవితవ్యం నరేంద్రేణ న కామవశవర్తినా ॥

తా॥ రాజు కామాదులకు లోనుగానివాడై స్థానము (సమముగా నుండుట) వృద్ధి (శత్రువుకంటె నధికుడై యుండుట) క్షయము (తక్కువగా నుండుట) అను నీ త్రివర్గములను సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధ, సమాశ్రయము లనుషడ్గుణములను అవశ్యము తెలిసికొనియుండవలయును.

శ్లో॥ ప్రాగాత్మమంత్రిణశ్చైవ తతో భృత్యా మహీభృతా ।
జ్ఞేయాశ్చానంతరం పౌరా విరుధ్యేత తతోఽరిభిః ॥

తా॥ రాజు మొదట మంత్రులను, తరువాత పరివారమును, ఆ పిమ్మట పౌరులను వారి వారి అవసరపూర్వకముగా తెలుసుకొనవలయును. లేనిచో శత్రువులు వీరిని స్వాధీన మొనర్చుకొనగలరు.

శ్లో॥ యస్త్వేతానవిజిత్యైవ వైరిణో విజిగీషతే ।
సో జితాత్మా జితామాత్యః శత్రువర్గేణ బాధ్యతే ॥

తా॥ మొదట వీరిని తన స్వాధీనములో నుంచుకొనకుండా యెవడు శత్రువులను జయించుటకు బయలుదేరునో, అతడు తన మంత్రివర్గముతోగూడ శత్రువులచేత బాధింపబడుట తథ్యము.

శ్లో॥ తస్మాత్కామాదయః పూర్వం జేయాః పుత్రమహీభృతా।
తజ్జయే హి జయో రాజ్ఞో రాజా నశ్యతి తైర్జితః॥

తా॥ ఆ కారణమువలన రాజు మొట్టమొదట అంతఃశత్రువులను జయించవలెను. అంతఃశత్రుజయమే రాజునకు ముఖ్యమగు జయము. అట్లుగాక కామక్రోధాది శత్రువులకు లొంగినవాడు తప్పక బహిశ్శత్రువులచేత జయింపబడగలడు.

శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ మదో మానస్తథైవ చ।
మోహశ్చ శత్రవో హ్యేతే నాశాయ కుమహీభృతామ్॥

తా॥ కామము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యము, మోహము అనునవే శత్రువులు. ఇవి కుమార్గగాములగు రాజులకు నాశనహేతువులైయున్నవి.

శ్లో॥ ఏభిర్జితైర్జితం సర్వం మరుత్తేన మహాత్మనా।
సంస్మృత్వా వివర్జయేదేతాన్ షడ్దోషాంశ్చ మహీపతిః॥

తా॥ ఈ కామక్రోధాది శత్రువులను లెస్సగా జయించినవాడు గనుకనే మరుత్తుడను మహాత్మునిచే సర్వము జయింపబడినది. కావున వీటివలన గలిగిన అనర్థములను దలంచి బుద్ధిమంతుడగువాడు యీ ఆరింటిని దూరముగా విడువవలెను.

శ్లో॥ శక్రార్కయమసోమానాం తద్వద్వాయోర్మహీపతిః।
రూపాణి పంచ కుర్వీత మహీపాలనకర్మణి॥

తా॥ భూమిని పరిపాలించు రాజు పాలనావిషయమున ఇంద్ర, యమ, సూర్య, చంద్ర, వాయువులను యీ ఐదుగురు చేయు కర్మలను జ్ఞప్తియందుంచుకొనవలెను.

శ్లో॥ యథేంద్రో చతురో మాసాన్ వార్యోఘేనైవ భూతలం।
ఆప్యాయయేత్తథా లోకాన్పరిచారైర్మహీపతిః॥

తా॥ దేవేంద్రుడెట్లు నాలుగు మాసములున్ను వర్షించి భూతలమునందలి ప్రాణికోట్లను సంతోషపరచునో, అట్లే రాజు తన పరిచర్యలచేత లోకములను సంతోషపెట్టవలెను.

శ్లో॥ మాసానష్టౌ యథా సూర్యస్తోయం హరతి రశ్మిభిః।
సూక్ష్మేణైవాభ్యుపాయేన తథా శుల్కాదినా నృపః॥

తా॥ సూర్యుడు తన కిరణములచేత వర్షాకాలము నాలుగుమాసములు విడచి తక్కిన యెనిమిదిమాసముల కాలమునందెట్లు భూమ్యాదులనుండి జలమును గ్రహించునో,

అట్లే నృపాలుడుకూడ సూక్ష్మమైన వుపాయముచేత నొప్పి కలుగనీయక ప్రజలనుండి పన్నులను గైకొనవలెను.

శ్లో॥ యథా యమః ప్రియద్వేష్యౌ ప్రాప్తే కాలే నియచ్ఛతి।
తథా ప్రియాప్రియే రాజా దుష్టాదుష్టే సమో భవేత్ ॥

తా॥ కాలము సంప్రాప్తమగునపుడు యము డెట్లు వీరు ప్రియులని వారు అప్రియులని భేదభావము లేకుండా అందరినీ ఒకేవిధమున శాసించుచున్నాడో, అట్లే రాజు దండనాది విషయములయందు మిత్రశత్రుత్వములును, ప్రియాప్రియములును లేక సమత్వభావముతో నుండవలయును.

శ్లో॥ పూర్ణేందుమాలోక్య యథా ప్రీతిమాన్జాయతే నరః।
ఏవం యత్ర ప్రజాస్సర్వా నిర్వృతాస్తచ్ఛశివ్రతమ్ ॥

తా॥ పూర్ణిమాచంద్రునిచూచి జనులెట్లు సంతోషచిత్తులగుదురో, అట్లే రాజును చూచినప్పుడును ఆనందపరవశులు కావలెను. ఇదియే శశి (చంద్ర)వ్రతము.

శ్లో॥ మారుతస్సర్వభూతేషు నిగూఢశ్చరతే యదా।
ఏవం చరేన్నృపశ్చారైః పౌరామాత్యారిబంధుషు॥

తా॥ వాయువేలాగున సర్వభూతములయందును నిగూఢముగా చరించునో, అట్లే రాజుగూడ పురజన, అమాత్య, బంధు, శత్రువుల విషయమును చారులవలన తెలిసికొని ఆయా విధానము నాచరించవలెను.

శ్లో॥ న లోభార్థైర్న కామార్థై ర్నార్థార్థైర్యస్య మానసం।
పదార్థైః కృష్యతే ధర్మాత్స రాజా స్వర్గమృచ్ఛతి ॥

తా॥ కామముచేతగాని, లోభముచేతగాని, ధనముచేతగాని, తత్సంబంధములగు విషయములచేతగాని యెవడు ఆకర్షింపబడడో అట్టివాడు స్వర్గమును పొందగలడు.

శ్లో॥ ఉత్పథగ్రాహిణో మూఢాన్స్వధర్మాచ్చలితాన్నరాన్।
యః కరోతి నిజే ధర్మే స రాజా స్వర్గమృచ్ఛతి ॥

తా॥ దుర్మార్గులై స్వేచ్ఛావిహారులగు మూఢజనులను యెవడు నయభయములచేత స్వధర్మమునందున్నవారలనుగా జేయునో, అట్టివాడు స్వర్గలోకమును పొందును.

శ్లో॥ వర్ణధర్మా న సీదంతి యస్య రాష్ట్రే తథాఽఽశ్రమాః।
రాజ్ఞస్తస్య సుఖం తాత పరత్రేహ చ శాశ్వతమ్ ॥

తా॥ ఎవని రాజ్యమునందు వర్ణధర్మములుగాని, ఆశ్రమధర్మములుగాని నశించవో అట్టివాడు యిహమందును, పరమందును శాశ్వతసుఖమును బొందును.

శ్లో॥ ఏతద్రాజ్ఞః పరం కృత్యం తథా తద్వృద్ధికారణం ।
పాలనేనైవ భూతానాం కృతకృత్యో మహీపతిః ॥

తా॥ పైన జెప్పిన విధమున రాజ్యమును పాలించుటయే రాజు చేయవలసిన కార్యము. చక్కగా శాసించుచు ప్రజలను పాలించినందువల్లనే రాజు కృతకృత్యుడు కాగలడు.

శ్లో॥ ఏవమాచరతో వత్స పురుషస్య గృహే సతః ।
ధర్మార్థకామసంప్రాప్త్యా పరత్రేహ చ శోభనమ్ ॥

తా॥ వత్సా! ఈ విధముగా ఆచరించుటవలన గృహస్థునకు ధర్మార్థకామములు సమకూరును. అందువలన యిహలోకములోను, పరలోకములోను శుభములను పొందగలడు.

శ్లో॥ స ఏవమనుశిష్టస్సన్ మాత్రా సంప్రాప్య యౌవనం ।
ఋతధ్వజసుతశ్చక్రే సమ్యగ్దారపరిగ్రహః ॥

తా॥ ఈ విధముగా అలర్కుడు తన తల్లిచేత బాగుగా బోధింపబడినవాడై ఉత్తమగృహస్థాశ్రమధర్మమును నడపుటకు అనుగుణవతియగు భార్యను వివాహమాడెను.

శ్లో॥ పుత్రాంశ్చోత్పాదయామాస యజ్ఞైశ్చాప్యయజద్విభుః ।
పితుశ్చ సర్వకాలేషు చకారాజ్ఞానుపాలనమ్ ॥

తా॥ ఆ యలర్కుడు తరువాత సంతానవంతుడాయెను. అనేకయజ్ఞములను జేసెను. సర్వకాలములయందును తన తండ్రియొక్క ఆజ్ఞాపాలనము జేయుచు రాజ్యకార్యముల నడపుచుండెను.

శ్లో॥ తతః కాలేన మహతా సంప్రాప్య చరమం వయః ।
చక్రేఽభిషేకం పుత్రస్య తస్య రాజ్యే ఋతధ్వజః ॥

తా॥ తరువాత కొంతకాలమునకు ఋతధ్వజునకు వృద్ధత్వము సంప్రాప్తముకాగా రాజ్యమునకు పుత్రుని అభిషేకించెను.

శ్లో॥ భార్యయా సహ ధర్మాత్మా యియాసుస్తపసే వనం ।
అవతీర్ణో మహీరత్నో మహాభాగో మహీపతిః ॥

తా॥ పిదప కువలయాశ్వుడు భార్యయగు మదాలసతోగూడ తపస్సు చేసికొనుటకు వనమునకు పోవ నుద్యమించెను.

శ్లో॥ మదాలసా చ తనయం ప్రాహేదం పశ్చిమం వచః ।
కామోపభోగసంసర్గప్రహాణాయ సుతస్య వై ॥

తా॥ అప్పుడు మదాలస కామభోగాది సంసర్గములచే బడి చెడిపోకుండుటకు కుమారు నుద్దేశించి తుదిమాటగా నిట్లు చెప్పెను.

శ్లో॥ యదా దుఃఖమసహ్యం తే ప్రియబంధువియోగజం ।
శత్రుబాధోద్భవం వాపి విత్తనాశాత్మసంభవమ్ ॥
భవేత్తత్కుర్వతో రాజ్యం గృహధర్మావలంబినః ।
దుఃఖాయతనభూతో హి మమత్వాలంబనో గృహీ ॥

తా॥ కుమారా! రాజ్యకార్యములను నడపుచు గృహస్థాశ్రమావలంబివగు నీకు ప్రియబంధువియోగమువలనగాని, శత్రువులవలనగాని, ధననాశమువలనగాని సహింపరాని దుఃఖము కలుగవచ్చును. ఎందుకనగా మమత్వమునకు లోబడిన గృహస్థుడు దుఃఖాయతనుడనుటలో సందేహమేమియు లేదు.

శ్లో॥ తదాస్మాత్పుత్ర నిష్కృష్య మద్దత్తాదంగులీయకాత్ ।
వాచ్యం తే శాసనం పట్టే సూక్ష్మాక్షరనివేశితమ్ ॥

తా॥ ఆ కారణమువలన నాయనా! ఇదిగో యీ ఉంగరమును నీకు యిచ్చుచున్నాను. నీకేదైన విపత్తు సంభవించినప్పుడు లేక యవసరమైనప్పుడు దీనిలో సూక్ష్మాక్షరముతో లిఖింపబడిన శాసనమును చదువుము.

శ్లో॥ తతః కువలయాశ్వోఽసౌ సా చ దేవీ మదాలసా ।
పుత్రాయ దత్త్వా తద్రాజ్యం తపసే కాననం గతౌ ॥

తా॥ తరువాత కువలయాశ్వుడను నామాంతరముగల ఋతధ్వజుడును, దేవియగు మదాలసయు, పుత్రుడగు అలర్కునికొరకు రాజ్యమునిచ్చి (పట్టాభిషేకము చేసి) తాము తపస్సుకొరకు వనమునకు పోయిరి.

అలర్కుడు రాజ్యపాలనము చేయుచు భోగలాలసుడగుట

శ్లో॥ సోఽప్యలర్కో యథాన్యాయం పుత్రవన్ముదితాః ప్రజాః ।
పాలయామాస ధర్మాత్మా స్వేస్వే కర్మణ్యవస్థితాః ॥

తా॥ తరువాత ఆ యలర్కుడను ధర్మాత్ముడై న్యాయమును తప్పక వారి వారికి విహితమగు కర్మలయందు ప్రజలను నియమించుచు, బిడ్డలవలె వారిని సంతోషపెట్టుచు, రాజ్యమును పాలించెను.

శ్లో॥ దుష్టేషు దండం శిష్టేషు సమ్యక్చ పరిపాలనం ।
కుర్వన్ పరాం ముదం లేభే ఇయాజ చ మహామఖైః ॥

తా॥ దుష్టులను శిక్షించుచు, శిష్టులను పరిరక్షించుచు, అనేక మహాయజ్ఞములను చేసి ఆ మహారాజు మిక్కిలి ఆనందము ననుభవించెను.

శ్లో॥ ఏవం బహూని వర్షాణి తస్య పాలయితో మహీం ।
ధర్మార్థకామసక్తస్య జగ్ముర్దిన మహార్యథా ॥

తా॥ ఈ విధముగా ధర్మార్థకామములను సమానముగా నడపుచు, రాజ్యపాలనము చేయుచున్న ఆతనికి పెక్కు వత్సరములు ఒకదినము వలె గడచిపోయినవి.

శ్లో॥ వైరాగ్యం నాస్య సంజజ్ఞే భుంజతో విషయాన్ ప్రియాన్ ।
న చాప్యలమభూత్తస్య ధర్మార్థోపార్జనం ప్రతి ॥

తా॥ ఇట్లు పెక్కేండ్లు మిక్కిలి ప్రియములగు భోగముల ననుభవించుచున్నను, ఆ యలర్కునకు వాటియందు వైరాగ్యముదయింపలేదు. ఇంక ధర్మార్థోపార్జనము చాలుననెడి తృప్తి కలుగలేదు.

శ్లో॥ తం తథా భోగసంసర్గప్రమత్తమజితేంద్రియం ।
సుబాహుర్నామ శుశ్రావ భ్రాతా తస్య వనేచరః ॥

తా॥ ఆ యలర్కుడట్లు భోగలంపటుడై యింద్రియనిగ్రహము లేక ప్రమత్తుడయ్యెనని విరాగియై వనములయందే చరించుచు కాలమును గడుపుచుండెడి ఆతని యన్నయగు సుబాహువు వినెను.

అలర్కుడు భోగలాలసుడగుట విని ఆతని యన్నయగు సుబాహువు
అలర్కునికి ఆత్మబోధల జేయవలెనని యెంచి కాశీరాజు
నాశ్రయించి ఆతనిపై దండెత్తించుట

శ్లో॥ తం బుబోధయిషుః సోఽథ చిరం ధ్యాత్వా మహామతిః ।
తద్వైరిసంశ్రయం తస్య శ్రేయోఽమన్యత భూపతేః ॥

తా॥ మహాత్ముడగు నా సుబాహువు తమ్ముడగు అలర్కునికి జ్ఞానోపదేశము చేయనెంచి చాలసేపు ధ్యానించి తుదకు ఆతడు ఉత్తమగతిని పొందవలయునన్నచో యిప్పుడు నేను ఆతని శత్రువు నాశ్రయించుటయే మేలని తలంచెను.

శ్లో॥ తతః స కాశిభూపాలముదీర్ణబలవాహనం ।
స్వరాజ్యమాప్తుమాగచ్ఛద్బహుశః శరణం కృతీ ॥

తా॥ ఇట్లు తలంచుకొని మిక్కిలి శౌర్యశాలియగు నా సుబాహువు తన తమ్మునినుండి తనకు రావలసిన రాజ్యభాగము నిప్పించునని చెప్పి చతురంగబలసమేతుడగు కాశీరాజు నర్థించెను.

శ్లో॥ సోఽపి చక్రే బలోద్యోగం ... ప్రతి ... ॥
దూతం చ ప్రేషయామాస ... ప్రదీయతామ్ ॥

తా॥ దీనిని విని ఆ కాశీరాజుకూడ అలర్కునిపైని దండెత్తుటకు నిశ్చయించుకొని మొదట న్యాయముగా నీకు రావలసిన రాజ్యభాగము నీతని కీయుమని దూతను పంపించెను.

శ్లో॥ సోఽపి నైచ్ఛత్తదాదాతుమాజ్ఞాపూర్వం స్వధర్మవిత్ ।
ప్రత్యువాచ ... దూతం స్వలర్కః కాశిభూభృతః ॥

తా॥ ఆజ్ఞాపూర్వకమగు నీ సందేశమును విని రాజనీతికోవిదుడగు నా యలర్కమహారాజు కాశీరాజునకు ఆతని దూతద్వారా నే యిట్లని సందేశమంపెను.

శ్లో॥ మామేవాభ్యేత్య హార్దేన యాచతాం రాజ్యమగ్రజః ।
నాక్రాంత్యా సంప్రదాస్యామి భయేనాల్పమపి క్షితిమ్ ॥

తా॥ నిజముగా మా యన్నకు రాజ్యమే కావలయునను కోరిక యున్నచో స్వయముగా తానే వచ్చి ప్రేమభావముతో నడిగిన నేనీయకుందునా? అంతకంటె నాకు కావలసినదేమి? అంతేగాని పరాక్రమముతో భయపెట్టి రాజ్యమాక్రమించుకొన జూచిన ఒక్క గోష్పాదమంతైనను భూమి నివ్వను.

శ్లో॥ సుబాహురపి నో యాచ్ఞాం చకార మతిమాంస్తదా ।
న ధర్మః క్షత్రియస్యేతి యాచ్ఞావీర్యధనో హి సః ॥

తా॥ వీర్యధనుడును మతిమంతుడునగు నా సుబాహువుగూడ క్షత్రియునకు యాచించుట ధర్మముగాదని తలంచి అలర్కుని అడుగుటకు నిరాకరించెను.

శ్లో॥ తతః సమస్తసైన్యేన కాశీశః పరివారితః ।
ఆక్రాంతుమభ్యగాద్రాష్ట్రమలర్కస్య మహీపతేః ॥

తా॥ తరువాత కాశీరాజు సమస్తసైన్యోపేతుడై అలర్కమహీపతి రాజ్యము నాక్రమించుటకు బయలుదేరి ముట్టడించెను.

శ్లో॥ అనంతరైశ్చ సంశ్లేషమభ్యేత్య తదనంతరం ।
తేషామన్యతమైస్తత్ర భృత్యైస్సమాక్రమ్య నయద్వశమ్ ॥
అపీడయంశ్చ సామంతాంస్తస్య రాష్ట్రోపజీవినః ।
తథా దుర్గాంతపాలాంశ్చ చక్రే చాటవికాన్వశే ॥

తా॥ ఇట్లు కుట్టిడించి ఆ కాశీరాజు అలర్కుని భటులలో భేదమును గల్పించి ఒక్కొక్క వర్గముగా వశమొనరించుకొనెను. సామంతరాజుల రాజ్యములకు అవరోధమును గల్పించియు, అంతఃపురపాలకులను పీడించియు, ఆటవిక సైన్యములను నిరోధించియు అందరిని వశమొనరించుకొనెను.

శ్లో॥ కాంశ్చిచ్చోపప్రదానేన కాంశ్చిద్భేదేన పార్థివాన్ ।
సామ్నైవాన్యాన్వశం నిన్యే నిభృతాత్తస్య యేఽభవన్ ॥

తా॥ మరియు కొందరిని దానముచేతను, కొందరిని భేదముచేతను, కొందరిని సామముచేతను అలర్కునికి విశ్వాసపాత్రులగువారి నందరిని వశమొనరించుకొనెను.

శ్లో॥ తతశ్చాల్పబలో రాజా పరచక్రావపీడితః ।
కోశక్షయమవాపోచ్చైః పురం చారుధ్యతారిణా ॥

తా॥ పిమ్మట సైన్యమంతయు సన్నగిల్లిన అలర్కుడు శత్రువులకు చిక్కి పీడింపబడవలసినవాడయ్యెను. భాండాగారమునందలి ధనమంతయు అయిపోయెను. శత్రువు పట్టణము నలువైపుల ముట్టడించెను.

శత్రువుచేత చిక్కిన యలర్కుడు దిక్కుదోచక తన తల్లి యిచ్చిన ఉంగరమును స్మరించి అందలి విషయమును పఠించుట

శ్లో॥ ఇత్థం సంపీడ్యమానస్తు క్షీణకోశో దినేదినే ।
విషాదమాగాత్ పరమం వ్యాకులత్వం చ చేతసః ॥

తా॥ ఇట్లు దినమునకు దినము క్షీణించిన కోశాద్యంగబలముగలవాడై శత్రువులచేత బాధింపబడి మనశ్శాంతిమితములేక గొప్ప దుఃఖమును పొందెను.

శ్లో॥ ఆర్తిం స పరమాం ప్రాప్య తత్సస్మారాంగులీయకం ।
యదుద్దిశ్య పురా ప్రాహ మాతా తస్య మదాలసా ॥

తా॥ అట్లు మితిలేని దుఃఖమును పొంది పరవశుడై పూర్వము తనకు తల్లియగు మదాలస చెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకొని ఆమె తనకిచ్చిన ఆయంగులీయకమును స్మరించెను.

శ్లో॥ తతః స్నాతశ్శుచిర్భూత్వా వాచయిత్వా ద్విజోత్తమాన్ ।
నిష్కృష్య శాసనం తస్మాద్దదృశే ప్రస్ఫుటాక్షరమ్ ॥

తా॥ తరువాత వెంటనే స్నానముచేసి శుచిర్భూతుడై పెద్దలను స్తుతించి ప్రస్ఫుటాక్షరములుగల ఒక శాసనమును ఆ యంగులీయకమునుండి తీసిచూచెను.

శ్లో॥ తత్రైవ లిఖితం మాత్రా వాచయామాస పార్థివః ।
ప్రకాశపులకాంగోఽసౌ ప్రహర్షోత్ఫుల్లలోచనః ॥

తా॥ చూచి సంతోషముచే విప్ఫారిన నేత్రములు గలవాడును, ప్రకటిత పులకాంకితగాత్రము గలవాడునునై యలర్కుడు ఆ శాసనమునందు తల్లిచేత వ్రాయబడిన దాని నిట్లు చదువుకొనెను.

శ్లో॥ సంగస్సర్వాత్మనా త్యాజ్యః స చేత్త్యక్తుం న శక్యతే।
స సద్భిః సహ కర్తవ్యః సతాం సంగో హి భేషజమ్॥

తా॥ సంగమము అన్నివిధముల విడిచిపెట్టదగినది. ఒకవేళ వ్యావహారికవశమున నా సంగమము విడిచిపెట్టుటకు వీలులేనిచో, ఆ సహవాసము సజ్జనులతోనే చేయదగినది. సజ్జనసాహచర్యమే దుస్సంగరోగనివారణమునకు దివ్యౌషధము.

శ్లో॥ కామస్సర్వాత్మనా హేయో హాతుం చేచ్ఛక్యతే న సః।
ముముక్షాం ప్రతి తత్కార్యం సైవ తస్యాపి భేషజమ్॥

తా॥ కామము సర్వథా హేయమైనది. గావుననే విడిచిపెట్టదగినది. ఒకవేళ వ్యవహారదశయందు అది విడిచిపెట్టుటకు వీలులేనిదై వుండవలసియే యున్నచో మోక్షమును గురించి దాని నుపయోగింపుము. మోక్షజిజ్ఞాసయే కామవ్యాధికి పరమౌషధము.

శ్లో॥ వాచయిత్వా తు బహుశో నృణాం శ్రేయః కథం త్వితి।
ముముక్షయేతి నిశ్చిత్య సా చ తత్సంగతో యతః।

తా॥ ఇట్లు చదివి, మానవుడు యెట్లెట్లు సంగమోచనమును సుఖశాంతులను పొందును? మోక్షజిజ్ఞాసవలననా? ఆ మోక్షేచ్ఛయు ముక్తపురుషుల సాంగత్యమున గాని లభింపదా? ఆహా! అని పలుసారులు దానినే చదువుచూ, చింతించుచూ తుదకొక నిశ్చయమునకువచ్చి,

శ్లో॥ తతః స సాధుసంపర్కం చింతయన్ పృథివీపతిః।
దత్తాత్రేయం మహాభాగమగచ్ఛత్పరమార్తిమాన్॥

తా॥ ఆ యలర్కమహీపతి సాధుసాంగత్యమునందలి మాహాత్మ్యమును చింతించుచు ఆర్తిజెంది ఆందోళితమనస్కుడై మహాత్ముడగు దత్తాత్రేయయతీంద్రుని సన్నిధి కేగెను.

అలర్కుడు దత్తాత్రేయమునీంద్రు నాశ్రయించుట

శ్లో॥ తం సమేత్య మహాత్మానమకల్మషమసంగినం।
ప్రణిపత్యాభిసంపూజ్య యథాన్యాయమభాషత॥

తా॥ నిస్సంగుడును, పాపరహితుడును, మహాత్ముడునగు నా యతీంద్రుని సమీపించి వినమ్రుడై నమస్కరించి, పూజించి ఉచితరీతి నిట్లు విన్నవించెను.

శ్లో॥ బ్రహ్మన్కురు ప్రసాదం మే శరణ్యః శరణార్థినాం।
దుఃఖాపహారం కురు మే దుఃఖార్తస్యాతికామినః ॥

తా॥ శరణుజొచ్చినవారిని చేరదీసి రక్షించు దయామయుడవగు నో పరబ్రహ్మ స్వరూపా! నన్ను నుగ్రహింపుము. అతికాముకుడనై, దుఃఖార్తుడనగు నా దుఃఖము నపనయింపుము మహాత్మా!

దత్తాత్రేయ ఉవాచ = దత్తాత్రేయస్వామి పలుకుచు చెప్పెను.

శ్లో॥ దుఃఖాపహారమద్యైవ కరోమి తవ పార్థివ।
సత్యం బ్రూహి కిమర్థం తే దుఃఖం తత్పృథివీపతే ॥

తా॥ ఓ రాజా! నీ దుఃఖము నీ క్షణములోనే పోగొట్టెదను కాని, నీకీదుఃఖ మెందువలన దేనినుండి కలిగినదో నిజము చెప్పుము.

శ్లో॥ కస్య త్వం కస్య వా దుఃఖం తత్త్వమేవం విచార్యతాం।
అంగాన్యంగి నికంగం చ సర్వాంగాని విచింతయ ॥

తా॥ నీవెవనికి సంబంధించినవాడవు? దుఃఖము దేని సంబంధము? దుఃఖమునకును నీకుగల సంబంధమేమి? వీటికిగల అవయవములేవి? అవయవి ఏది? అసలు అంగమే లేని దేది? సర్వాంగములేవి? అను యీ మొదలుగాగల విషయములను విచారించుకొనుము.

శ్లో॥ ఇత్యుక్తశ్చింతయామాస స రాజా తేన ధీమతా।
త్రివిధస్యాపి దుఃఖస్య స్థానమాత్మానమేవ చ ॥

తా॥ ఇటు జ్ఞాననిధియగు నా మహాత్మునిచేత చెప్పబడి ఆ రాజు త్రివిధములగు (ఆధ్యాత్మికాది) దుఃఖములయొక్క స్థానమునుగూర్చియు, ఆత్మనుగూర్చియు విచారింప సాగెను.

శ్లో॥ స విమృశ్య చిరం రాజా పునః పునరుదారధీః।
ఆత్మానమాత్మనా ధీరః ప్రహస్యేదమథాబ్రవీత్ ॥

తా॥ మిక్కిలి ఉదారబుద్ధియు ధృతిమంతుడునగు నా యలర్కుడు పలుసారులు తనలో తానే విమర్శించుకొని చిరకాలమునకు - సత్యమును తెలిసికొనెనేమో నవ్వుచూ నిట్లనెను.

శ్లో॥ నాహముర్వీ న సలిలం న జ్యోతిరనిలో న చ।
నాకాశం కిం తు శారీరం సమేత్య సుఖమిష్యతే ॥

తా॥ పృథివ్యప్తేజోవాయ్వాకాశములగు పంచమహాభూతములలో నేనేదియు గాను. అయితే యివన్నియు కలసి శరీరమగుటవలన తత్సంబంధమగు సుఖము కోరబడు చున్నది.

శ్లో॥ న్యూనాతిరిక్తతాం యాతి పంచకేఽస్మిన్సుఖాసుఖం।
యది న్యూన్మను కిం న స్యాద్దృష్టేఽపి హాతం మయి॥

తా॥ ఈ పంచభూతాత్మకమైన శరీరము నాశ్రయించియే సుఖదుఃఖములు హెచ్చుతక్కువలను పొందుచున్నవి. అంతేగాని ఆత్మస్వరూపుడనగు నాకేమియును లేవు. ఉండినచో నెట్లు కనబడకుండ వుండగలవు?

శ్లో॥ నిత్యప్రభూతసద్భావే న్యూనాధిక్యాన్వితోన్నతే।
తథా చ మమతా త్యక్తో ఏకేక్షేణోపలభ్యతే॥
తన్మాత్రావస్థితే సూక్ష్మే తృతీయాంశే చ పశ్యతః।
తథైవ భూతసద్భావం శారీరం కిం సుఖాసుఖమ్॥

తా॥ నిత్యము పుట్టుచు, స్థితిని పొందుచు, న్యూనాధిక్యతలను సరియగుచూ వున్న యీ ప్రపంచమును చూచినప్పుడు మమకారము వదలిపోవుచున్నది. తన్మాత్రావస్థితమై సూక్ష్మమగు యీ రూపాదుల నవలోకించునపుడు పంచభూతాత్మకమగు యీ శరీరమున నేమి సుఖముగలదు? ఇది సుఖదుఃఖాశయమని తెలియుము నేయున్నది.

శ్లో॥ మనస్యవస్థితం దుఃఖం సుఖం వా మానసం చ యత్।
యతస్తతో న మే దుఃఖం సుఖం వా న హ్యహం మనః॥

తా॥ సుఖముగాని, దుఃఖముగాని మనస్సునకు సంబంధించినదగుటవలన మనస్సంభిన్నుడనగు నాకు సుఖదుఃఖములు లేనేలేవు.

శ్లో॥ నాహంకారో న చ మనో బుద్ధిర్నాహం యతస్తతః।
అంతఃకరణజం దుఃఖం పారక్యం మమ తత్కథమ్॥

తా॥ అహంకార మనోబుద్ధులలో నేనేదియుగాను. అందువలన పరకీయమగు అంతఃకరణమునుండి పుట్టిన దుఃఖముతో నాకేమి సంబంధము?

శ్లో॥ నాహం శరీరం న మనో యతోఽహం
పృథక్ఛరీరాన్మనసస్తథాఽహం।
తత్సంతు చేతస్యథవాపి దేహే
సుఖాని దుఃఖాని చ కిం మమాత్ర॥

తా॥ ఏ కారణమువలన నేను శరీరమనోఽహంకారములకంటె భిన్నుడనో, ఆ కారణమువలన సుఖదుఃఖములు తత్సంబంధములగు మనశ్శరీరములకే గలుగుగాక! వాటితో నాకేమి పని?

శ్లో॥ రాజ్యస్య వాంఛాం కురుతేఽప్రజోఽస్య
దేహస్య చేత్పంచమయః సరాశిః।

గుణప్రవృత్త్యా మమ కిం ను తత్ర
తత్స్థః స చాహం చ శరీరతోఽన్యః ॥

తా॥ జననమరణరహితమైన ఆత్మ నశ్వరమగు రాజ్యకాంక్షను చేయునా? అనగా దానికి యీ రాజ్యాదులతో పని లేదు. ఇక దేహమనినచో, ఇది జడాత్మకము. జడములగు పంచభూతములయొక్క కూటమి. ఇక దీనికి రాజ్యముతో నిమిత్తమేమి? గుణములతో కూడుకొన్న దేహముతో నాకు నిమిత్తమేమి? నేను దేహవ్యతిరిక్తుడనగు ఆత్మస్వరూపుడను.

శ్లో॥ న యస్య హస్తాదికమప్యశేషం
మాంసం న చాస్థీని శిరాఽపిభాగః ।
కస్తస్య నాగాశ్వరథాదికోశై
స్స్వల్పోఽపి సంబంధ ఇహాస్తి పుంసః ॥

తా॥ ఎవనికి కరచరణాద్యవయవములు మాంసాస్థిమజ్జానరములయొక్క విభాగములు గల యీ దేహముతో నేసంబంధములేదో అట్టివానికి యీ గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, కాల్బలములు, ధనాగారములు వీట్లతో కొంచెమైనను సంబంధముండునా?

శ్లో॥ తస్మాన్న మేఽరిర్న చ మేఽస్తి దుఃఖం
న మే సుఖం నాపి పురం న కోశం ।
న చాశ్వనాగాదిబలం న తస్య
నాన్యస్య వా కస్యచిద్వా మమాస్తి ॥

తా॥ ఆ కారణమువలన నాకు శత్రువూలేదు, సైన్యమూలేదు, సుఖమూలేదు, దుఃఖమూలేదు, పట్టణమూలేదు, భాండారమూలేదు. ఈ రథాశ్వ నాగాదిబలము యితడునికి మాత్ర మెవనికున్నవి? ఇదంతయు మిథ్య, పట్టి ఆభాసము.

శ్లో॥ యథా ఘటీకుంభకమండలుస్థ మాకాశమేకం బహుధా హి దృష్టం।
తథా సుబాహుః సచ కాశిపోఽహం మన్యే చ దేహేషు శరీరభేదై ॥

తా॥ ఆకాశమొక్కటేయైనను బాన, కడవ, మూకుడు, కమండులువు మొదలగు వాటియందు ఆయా ఆకారములననుసరించి వేరువేరుగా తోచునట్లు, యీ కాశీరాజు, యీ సుబాహువు, నేను మొదలగువారమందరము శరీరభేదములచేత వేరుగా నున్నట్లు కనబడుచున్నను, వాస్తవికదశయందు యీ భేదము లేమియును లేవు. ఉన్నదొకటే సద్వస్తువు.

ఇతి శ్రీమార్కండేయమహాపురాణే మదాలసాచరితే ఆత్మవివేకో
నామ చతుస్త్రింశోఽధ్యాయః

ఇతి శ్రీమార్కండేయమహాపురాణమునందలి మదాలసాచరిత్రమున ఆత్మవివేకమను
పేరుగల ముప్పది నాలుగవ అధ్యాయము



జడ ఉవాచ = జడమహర్షి చెప్పెను.

శ్లో॥ దత్తాత్రేయం తతో విప్రం ప్రణిపత్య స పార్థివః।
ప్రత్యువాచ మహాత్మానం ప్రశ్రయావనతో వచః॥

తా॥ పిదప నా యలర్కుడు సమస్తవేదపారగుడును, జ్ఞాననిధియును, మహాత్ముడు నగు దత్తాత్రేయ మునీంద్రునకు వినయవినమితోత్తమాంగుడై నమస్కరించి అతి కరుణతో నిట్లు వచించెను.

శ్లో॥ సమ్యక్ప్రపశ్యతో బ్రహ్మన్మమ దుఃఖం న కించన।
అసమ్యగ్దర్శినో మగ్నాః సర్వదైవాసుఖార్ణవే॥

తా॥ బ్రహ్మజ్ఞానసంపన్నుడవగు నో మహాత్మా! విచారణాదృష్టితో బాగుగా పరిశీలన చేయుచున్న నాకు దుఃఖమంతయు మటుమాయమైపోయినది. ఉన్న సత్యమును మరియొకవిధముగా చూచువారు దుఃఖసముద్రమున మునుగుదురనుట నిజము.

శ్లో॥ యస్మిన్యస్మిన్మమత్వేన బుద్ధిః పుంసః ప్రజాయతే।
తతస్తతస్సమాధాయ దుఃఖాన్యేవ ప్రయచ్ఛతి॥

తా॥ ఏ యే వస్తువులయందు మానవునికి "ఇవి నావి" అనెడు మమత్వబుద్ధి కలుగునో, ఆయా వస్తుమూలముగానే అతడు దుఃఖములను పొందుచున్నాడు.

శ్లో॥ మార్జారభక్షితే దుఃఖం యాదృశం గృహకుక్కుటే।
న తాదృఙ్మమతాశూన్యే కలవింకేఽథ మూషికే॥

తా॥ "ఇది నాది" అను మమత్వముతో పెంచబడుచున్నది గావుననే కోడిని గాని, బాతునుగాని, పిల్లి లేక నక్క తినివేసినచో యెంతయో దుఃఖించుచున్నారు. అదే పిల్లి తమతో నిరంతరము కలసి మెలసి తిరుగుచూ తమ దగ్గరే వాసము జేయుచున్న ఎలుకనుగాని, పిచ్చుకనుగాని పట్టుకొని తినివేయుచో దానినిగూర్చి అనుకొనువారే లేరు. ఎందుచేత? అవి నావి అని అనుకొనలేదు. అచ్చట మమత్వము లేదు. కావుననే దుఃఖము లేదు.

శ్లో॥ సోఽహం న దుఃఖీ న సుఖీ యతోఽహం ప్రకృతేః పరః।
యోభూతాభిభవో భూతైస్సుఖదుఃఖాత్మకో హి సః॥

తా॥ ఎందువలన నేనీప్రకృతికంటె పరుడనో, ఆ కారణమువలన ప్రకృతిసంబంధములగు సుఖదుఃఖములు రెండును నాకు లేవు. ఎవడు పంచభూతాత్మక ప్రపంచమునకు వశుడగుచున్నాడో, అతడే సుఖదుఃఖములకు లోనగుచున్నాడు.

~ దత్తాత్రేయుడు అలర్కునకు తత్త్వోపదేశము చేయుట ~

దత్తాత్రేయ ఉవాచ = దత్తాత్రేయ మునీంద్రుడు చెప్పెను.

శ్లో॥ ఏవమేతన్నరవ్యాఘ్ర యత్తై తద్వ్యాహృతం త్వయా ।
మమేతి మూలం దుఃఖస్య న మమేతి చ నిర్వృతిః ॥

తా॥ పురుషశ్రేష్ఠుడవగు నో రాజా! మమత్వమే దుఃఖమునకు మూలమనియు, మమత్వశూన్యమే సుఖాలవాలమనియు నీవు చెప్పినది సత్యము. నిజతత్త్వమంతే. అంతకు మిక్కిలి వేరేమియు లేదు.

శ్లో॥ మత్ప్రశ్నాదేవ తే జ్ఞానముత్పన్నమిదముత్తమం ।
మమేతి ప్రత్యయో యేన క్షిప్తః శాల్మలితూలవత్ ॥

తా॥ "ఇది నాది" అని నీయందు పాతుకొనిపోయిన దృఢవిశ్వాసము - వాసన యేజ్ఞానముచేత బూరగదూదివలె యెగురగొట్టబడినదో, అట్టి ఉత్తమజ్ఞానము నా ప్రశ్న మూలముననే నీకు కలిగినదిగదా?

శ్లో॥ అహమిత్యంకురోత్పన్నో మమేతి స్కంధవాన్ మహాన్ ।
గృహక్షేత్రోచ్ఛశాఖశ్చ పుత్రదారాదిపల్లవః ॥
ధనధాన్యమహాపత్రో నైకకాలప్రవర్ధితః ।
పుణ్యాపుణ్యాగ్రపుష్పశ్చ సుఖదుఃఖమహాఫలః ॥
అపవర్గపథవ్యాపీ మూఢసంపర్కసేచనః ।
విధిత్సాభృంగమాలాఢ్యో౽కృత్యజ్ఞానమహాతరుః ॥

తా॥ రాజా! అహంకారమనే అంకురమునుండి పుట్టినదియు, మమత్వమనే గొప్ప మొదలుగలదియు, గృహక్షేత్రాదులనే కొమ్మలుగలదియు, భార్యాబిడ్డలనే పల్లవములుగలదియు, ధనధాన్యములనే ఆకులుగలదియు, పుణ్యాపాపములనే పుష్పములుగలదియు, సుఖదుఃఖములనే ఫలములుగలదియు, మోక్షపథమువరకు (అడ్డుగా) వ్యాపించియున్నదియు, మూఢజనసంపర్కముచేత తడుపబడినదియు, కోరికలనెడు తుమ్మెదల పంక్తిచేత పూర్ణమైనదియు,

శ్లో॥ సంసారాధ్వపరిశ్రాన్తా యేతచ్ఛాయాం సమాశ్రితాః ।
భ్రాంతిజ్ఞానసుఖాధీనా స్తేషామాత్యంతికం కుతః ॥

తా॥ సంసారమార్గమునందు నడచి అలసి, యీ వృక్షము నీడను కొంత విశ్రాంతి తీసికొనిన బాగుండునని దీని నాశ్రయించినవారు యెట్టివారనగా, ఎండమావులయందలి జలమును త్రాగి దప్పి తీర్చుకొనదలచు పరుగులెత్తెడివంటివారు; నదిని దాటుటకు తెప్ప యను

కొని మొసలిపై నెక్కి కూర్చొనెడివంటివారు. వీరెన్నటికైన గమ్యమును చేరగలరా? అభీష్టమువందగలరా? అట్టివారికి నిత్యసుఖమెక్కడ?

శ్లో॥ యైస్తు సత్సంగపాషాణశితేన మమతాతరుః ।
ఛిన్నో విద్యాకుఠారేణ తే గతాస్తేన వర్త్మనా ॥

తా॥ ఎవరైతే సాధుసాంగత్యమనే ఒరిపిడిబాయిపైని నూరి బాగుగా పదును పెట్టబడిన జ్ఞానమనే గండ్రగొడ్డలిచేత మమత్వరూపాజ్ఞానవృక్షమును ఛేదించుచున్నారో వారు యీ మార్గము ద్వారా గమ్యమును పొందగలరు.

శ్లో॥ ప్రాప్య బ్రహ్మవనం శీతం నీరజస్కమకంటకం ।
ప్రాప్నువంతి పరాం ప్రాజ్ఞా నిర్వృతిం వృత్తివర్జితాః ॥

తా॥ ఇట్లు మోక్షమార్గము నవరోధించు అజ్ఞానవృక్షమును ఛేదించి ధూళిధూసరితము కానిదియు (రజోగుణ రహితమైనదియు), ముండ్లు మొదలగునవేవియు లేనిదియు, తమోగుణము లేనిదియు, మిక్కిలి చల్లనైనదియు (శుద్ధ సత్వముచే నొప్పారునదియు) నగు బ్రహ్మమనే వనమునుపొంది వృత్తిశూన్యులగు జ్ఞానులు పరమమగు నిత్యసుఖమును పొందుచున్నారు.

శ్లో॥ భూతేంద్రియమయం స్థూలం న త్వం రాజన్న చాప్యహం ।
న తన్మాత్రం మయా వాచ్యం నైవాంతఃకరణాత్మకౌ ॥

తా॥ పంచభూతాత్మకమైన యింద్రియమయమైన యీ స్థూలశరీరము మనమని చెప్పనగునా? తన్మాత్రలుగాని, అంతఃకరణ మనస్సులుగాని మనము కాము.

శ్లో॥ కం వా పశ్యామి రాజేంద్ర ప్రధానమిదమావయోః ।
యతః పరో హి క్షేత్రజ్ఞసంఘాతో హి గుణాత్మకః ॥

తా॥ ఓ రాజేంద్రా! క్షేత్రజ్ఞుడు పరుడగుటవలనను, గుణసంఘాతమే శరీరమగుటవలనను యిప్పుడు మనయందు దేనిని ప్రధానమైనదని జూడవలెను.

శ్లో॥ మశకోదుంబరేషీకాముంజమత్స్యాంభసాం యథా ।
ఏకత్వేఽపి పృథగ్భావ స్తథా క్షేత్రాత్మనోర్నృప ॥

తా॥ మేడిపండును, దానిలోగల దోమలును, దర్భయు, దానియందలి ముంజయు, జలమును, దానియందలి మత్స్యములును ఒకటిగానే యున్నట్లు కనుపించినను యథార్థమున కవి యెట్లు భిన్నములో, అట్లే దేహాత్మలు ఒకటిగానేయున్నట్లు తోచినను వాస్తవమునందు భిన్నములు.

అలర్క ఉవాచ = అలర్కుడు చెప్పెను.

శ్లో॥ భగవంస్త్వత్ప్రసాదేన మహావిర్భూతముత్తమం ।

జ్ఞానం ప్రధానవిచ్ఛక్తివివేకకరమీదృశమ్ ॥

తా॥ పూజ్యపాదుడవగు నో మహాత్మా ! తమ యనుగ్రహమువలన ప్రకృతిపురుషులను వేరుపరచు వివేకముగల యిటువంటి ఉత్తమజ్ఞానము కలిగినది.

శ్లో॥ కిం త్వత్ర విషయాక్రాంతే స్థైర్యవత్వం న చేతసి।
న చాపి వేద్మి ముచ్యేయం కథం ప్రకృతిబంధనాత్ ॥

తా॥ కాని విషయాక్రాంతమగు మనస్సునందు నిలకడ గలుగకున్నది. ఎంత నిరోధించుచున్నను విషయభోగములకు అలవాటుపడిన యీ మనస్సు వాటిపైకే యీడ్చుకొనిపోవుచున్నది. మహాత్మా! ఈ ప్రకృతిబంధనము నుండి యెట్లు విముక్తుడను కాగలనో తెలిసికొనజాలకున్నాను.

శ్లో॥ తస్మై యోగం తథా బ్రహ్మన్ప్రణతాయాభియాచతే।
సమ్యగ్బ్రూహి మహాప్రాజ్ఞ సత్సంగో హ్యుపకృన్నృణామ్ ॥

తా॥ జ్ఞాననిధివగు నో మహాత్మా ! అతి దీనుడనై యాచించుచున్న నాకు పరబ్రహ్మమును పొందుటకు సాధనమైన. యోగమునుగూర్చి లెస్సగా చెప్పుము. సాధుసాంగత్యముకంటె లోకమున మానవులకు ఉపకారకమైనది మరియొకటి లేదుగదా.

దత్తాత్రేయ ఉవాచ = దత్తాత్రేయ మునీంద్రుడు చెప్పెను.

శ్లో॥ జ్ఞానపూర్వో వియోగో యోఽజ్ఞానేన సహ యోగినః।
సా ముక్తిః బ్రహ్మణా చైక్యమనైక్యం ప్రాకృతైర్గుణైః ॥

తా॥ అజ్ఞానముతో (అవిద్యతో) జ్ఞానపూర్వమైన వియోగము అనగా మాయా సంసర్గము లేకుండుట అనునదియే ముక్తి. ప్రాకృతగుణములతో సంబంధము లేకుండుట, బ్రహ్మముతో నేకత్వమును పొందుట - యిదియే ముక్తి.

దత్తాత్రేయమునీంద్రుడు అలర్కునకు యోగస్వరూపము నెఱింగించుట

శ్లో॥ యోగే చ శక్తిర్విదుషాం యేన శ్రేయః పరం భవేత్ ।
ముక్తిర్యోగాత్తథా యోగః సమ్యగ్జ్ఞానాన్మహీపతే ॥

తా॥ దేనివలన పరమశ్రేయస్సు జిజ్ఞాసువులకు కలుగునో, ఆ శక్తి యోగమునందే యున్నది. ఓ రాజా ! ఆ యోగమువలన ముక్తి కలుగుచున్నది. యోగము సమ్యగ్జ్ఞానము వలన కలుగును.

శ్లో॥ సంగదోషోద్భవం దుఃఖం మమత్వాసక్తచేతసాం।
తస్మాత్సంగం ప్రయత్నేన ముముక్షుః సంత్యజేన్నరః ॥

తా॥ "ఇది నాది" అని దృఢముగా పట్టుకొనిన మనస్సుగలవానికి ఆ సంగ దోషమువలన తప్పక దుఃఖము కలుగును. అందువలన మోక్షేచ్ఛగల మానవుడు ప్రయత్నముతో సంగమును తప్పక విడువవలెను.

శ్లో॥ సంగాభావే మమేత్యస్యాః ఖ్యాతేర్హానిః ప్రజాయతే।
నిర్మమత్వం సుఖాయైవ వైరాగ్యాద్దోషదర్శనమ్॥

తా॥ సంగమమే లేనిచో మమత్వ (నాది యనెడి) ప్రత్యయమునకే హానికలుగుచున్నది. నిర్మమత్వమే సుఖమునకు మూలము. వైరాగ్యమునవలన విషయములయందు దోషదృష్టి కలుగుచున్నది.

శ్లో॥ జ్ఞానాదేవ చ వైరాగ్యం జ్ఞానం వైరాగ్యపూర్వకమ్॥

తా॥ జ్ఞానమువలననే వైరాగ్య ముదయించుచున్నది. అయితే ఆ జ్ఞానమున్ను వైరాగ్యము నాశ్రయించియే యున్నది. ఇట్లొకటికొకటి అన్యోన్యాశ్రయముకలవిరైయున్నవి.

శ్లో॥ తద్గృహం యత్ర వసతి స్తద్భోజ్యం యేన జీవతి।
యన్ముక్తయే తదేవోక్తం జ్ఞానమజ్ఞానమన్యథా॥

తా॥ ఎచ్చట నివసించునో అదే యోగికి గృహము. దేనిచేత శరీరమును నిలుపుకొనుచున్నాడో అదే ఆతనికి భోజనము. ఏది ముక్తికొరకగునో అదే జ్ఞానము. తక్కిన దంతయు అజ్ఞానము.

శ్లో॥ ఉపభోగేన పుణ్యానామపుణ్యానాం చ పార్థివ।
కర్తవ్యమితి నిత్యానామకామకరణా త్తథా॥
అసంచయాదపూర్వస్య క్షయాత్పూర్వార్జితస్య చ।
కర్మణో బంధమాప్నోతి శరీరం చ పునఃపునః॥

తా॥ పుణ్యపాపములయొక్క అనుభవమువలనను (అనగా పుణ్యపాప ఫలములను అనుభవించుటచేతను), నిత్యకర్మములు చేయవలయుననెడి తలంపుచేతను, అనిష్టములైనవి చేయవలసివచ్చుటచేతను, నూతనముగా కర్మఫలమును సంపాదింపకపోవుటవల్లను, పూర్వార్జితము నశించుటవల్లను, ఇత్యాది కర్మములవలన శరీరమునకు మాటిమాటికి బంధము కలుగుచున్నది.

శ్లో॥ కర్మణా మోక్షమాప్నోతి వైపరీత్యేన తస్య తు।
ఏతత్తే కథితం జ్ఞానం యోగం చేమం నిబోధ మే॥

తా॥ ఆ పూర్వోక్త కర్మకంటె వేరుగా అనగా భిన్నముగా చేసినచో మోక్షమును పొందుచున్నాడు. అనగా సుకర్మనుండి ఉత్తమగతిని పొందుచున్నాడు. ఇంతవరకు నీకు జ్ఞానమునుగూర్చి చెప్పితిని. ఇక యోగమునుగూర్చి చెప్పెదను వినుము.

శ్లో॥ ప్రాగేవాత్మాత్మనా జేయో యోగినాం స హి దుర్జయః।
కుర్వీత తజ్జయే యత్నం తస్యోపాయం శృణుష్వ మే॥

తా॥ యోగి మొదట మనస్సును ఆత్మచేత జయించవలెను. అయితే అది సామాన్యముగాదు, మిగుల కష్టమైనది. అందువలననే దానిని జయించుటకు అవశ్యము ప్రయత్నము చేయవలెను. దానిని జయించుటకు ఉపాయమును చెప్పెదను వినుము.

శ్లో॥ ప్రాణాయామైర్దహేద్దోషాన్ధారణాభిశ్చ కిల్బిషం।
ప్రత్యాహారేణ విషయాన్ధ్యానేనానీశ్వరాన్గుణాన్॥

తా॥ ప్రాణాయామములచేత దోషములను, ధారణచేత పాపములను, ప్రత్యాహారముచేత విషయములను, ధ్యానముచేత ప్రాకృతగుణములను దహించవలెను.

శ్లో॥ యథా పర్వతధాతూనాం ధ్మాతానాం దహ్యతే మలం।
తథేంద్రియకృతా దోషా దహ్యంతే ప్రాణనిగ్రహాత్॥

తా॥ బాగుగా కాల్చబడిన కారణమున పర్వతధాతువులయొక్క మలమేప్రకారము నశించిపోవుచున్నదో, అట్లే యింద్రియములవల్ల కలిగిన దోషములు ప్రాణాయామమువలన దహింపబడిపోవుచున్నవి. అనగా ప్రాణాయామము చేయుటవలన యింద్రియములు విషయములపైకి పోవు అని భావము.

శ్లో॥ ప్రథమం సాధనం కుర్యాత్ప్రాణాయామస్య యోగవిత్।
ప్రాణాపాననిరోధస్తు ప్రాణాయామ ఉదాహృతః॥

తా॥ యోగి మొదట ప్రాణాయామమును గురించి సాధనము చేయవలయును. ప్రాణాపానములయొక్క నిరోధమే ప్రాణాయామమని చెప్పబడుచున్నది.

శ్లో॥ లఘుమధ్యోత్తరీయాఖ్యః ప్రాణాయామస్త్రిధోదితః।
తస్య ప్రమాణం వక్ష్యామి తదలర్క శృణుష్వ మే॥

తా॥ ఓ యలర్కమహారాజా! ఆ ప్రాణాయామము లఘువని, మధ్యమమని, ఉత్తరీయమని మూడు విధములుగా చెప్పబడుచున్నది. వాటి ప్రమాణములను వివరింతును; వినుము.

శ్లో॥ లఘుర్ద్వాదశమాత్రస్తు ద్విగుణస్స తు మధ్యమః।
త్రిగుణాభిస్తు మాత్రాభిరుత్తమః పరికీర్తితః॥

తా॥ ద్వాదశమాత్రలకాలముగలది లఘుప్రాణాయామమనియు, దానికి రెట్టింపు అనగా యిరువదినాలుగుమాత్రలకాలము మధ్యమమనియు, మూడింతలకాలము అనగా ముప్పదియారుమాత్రలకాలముగలది ఉత్తమమనియు చెప్పబడుచున్నది.

శ్లో॥ నిమేషోన్మేషణే మాత్రా కాలో లఘ్వక్షర స్తథా।
ప్రాణాయామస్య సంఖ్యార్థం స్మృతో ద్వాదశమాత్రికః ॥

తా॥ కనుమూసి తెరచినకాలము, లేక లఘ్వక్షర ఉచ్చారణకాలము, అనగా "అ" అను హ్రస్వాక్షర ఉచ్చారణకాలము మాత్రయనబడును. అట్టి మాత్రలు పండ్రెండు సాధారణముగా ఒక ప్రాణాయామమునకు చెప్పబడినవి.

శ్లో॥ ప్రథమేన జయేత్స్వేదం మధ్యమేన చ వేపథుం।
విషాదం హి తృతీయేన జయేద్దోషాననుక్రమాత్ ॥

తా॥ లఘుప్రాణాయామముచేత స్వేదమనే దోషమును, మధ్యమ ప్రాణాయామముచేత వేపథు అనగా కంపమును, ఉత్తమప్రాణాయామముచేత విషాదమనే దోషమును జయించవలెను.

శ్లో॥ మృదుత్వం సేవ్యమానాస్తు సింహశార్దూలకుంజరాః।
యథా యాంతి తథా ప్రాణో వశ్యో భవతి యోగినః ॥

తా॥ మృదువుగా అనగా కష్టములేకుండ ప్రాణాయామము నభ్యసించు యోగికి సింహము, పులి, ఏనుగు వీట్లయొక్క నడకవలె మెల్లగా ప్రాణము స్వాధీనమగుచున్నది.

శ్లో॥ వశ్యం మత్తం యథేచ్ఛాతో నాగం నయతి హస్తిపః।
తథైవ యోగీ ఛందేన ప్రాణం నయతి సాధితమ్ ॥

తా॥ మదించినదైనను తన వశమైన ఏనుగును మావటివాడెట్లు తన యిష్టము వచ్చినట్లు నడిపించుచున్నాడో, అదేవిధముగా తన స్వాధీనమైన ప్రాణమును యోగి స్వేచ్ఛగా తన యిష్టానుసారము నడుపుచున్నాడు.

శ్లో॥ యథా హి సాధితః సింహో మృగాన్హంతి న మానవాన్।
తద్వన్నిషిద్ధపవనః కిల్బిషం న నృణాం తనుమ్ ॥

తా॥ స్వాధీనమై వేట నేర్పబడిన సింహమెట్లు మృగములను మాత్రము చంపి మనుష్యులను చంపదో, అట్లే వశమైన ప్రాణవాయువు పాపములను దహించునుగాని శరీరమును నాశమొనరింపదు.

శ్లో॥ తస్మాద్యుక్తః సదా యోగీ ప్రాణాయామపరో భవేత్।
శ్రూయతాం ముక్తిఫలదం తస్యావస్థా చతుష్టయమ్ ॥

తా॥ ఆ కారణమువలన ముముక్షువగు యోగి యెల్లప్పుడును ప్రాణాయామపరుడు కావలెను. ఆ యోగికి ముక్తిఫలము నొసగు అవస్థాచతుష్టయముగలదు. దానిని చెప్పెదను వినుము.

శ్లో॥ ధ్వస్తిః ప్రాప్తిస్తథా సంవిత్ ప్రసాదశ్చ మహీపతే।
స్వరూపం శృణు చైతేషాం కథ్యమానమనుక్రమాత్ ॥

తా॥ ధ్వస్తియనియు ప్రాప్తియనియు, సంవిత్తనియు ఆదేవిధమున ప్రసాదమనియు అవస్థలు నాలుగు విధములు. వరుసగా వాటియొక్క స్వరూపమును చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ కర్మణామిష్టదుష్టానాం జాయతే ఫలసంక్షయః।
చేతసోఽపకషాయత్వం యత్ర సా ధ్వస్తిరుచ్యతే ॥

తా॥ దేనివలన యిష్టకర్మలుగాని దుష్టకర్మలుగాని వాటియొక్క నాశము కలుగునో, ఏది మనస్సునగల మలినమును కడిగివేయుచున్నదో దానికి "ధ్వస్తి" అని పేరు.

శ్లో॥ ఐహికాముష్మికాన్కామాంల్లోభమోహాత్మకాన్స్వయం।
నిరుధ్యాస్తే సదా యోగీ ప్రాప్తిస్సా సార్వకాలికీ ॥

తా॥ లోభమోహాత్మకములగు యిహపరసంబంధ సమస్తకామములను నిరోధించి యెల్లప్పుడు వుండుటయే ప్రాప్తియని చెప్పబడును.

శ్లో॥ అతీతానాగతానర్థాన్విప్రకృష్టతిరోహితాన్ ।
విజానాతీందుసూర్యర్క్షగ్రహాణాం జ్ఞానసంపదా ॥
తుల్యప్రభావస్తు యదా యోగీ ప్రాప్నోతి సంవిదం।
తదా సంవిదితి ఖ్యాతా ప్రాణాయామస్య సా స్థితిః ॥

తా॥ అతీతానాగతములను, చంద్ర, సూర్య, గ్రహ, నక్షత్రములయొక్క రాకపోకలను జ్ఞానసంపదచేత యెవడు తెలిసికొనుచున్నాడో మరియు వాటితో సమానమైన ప్రతిభగలవాడై యెప్పుడు అట్టి జ్ఞానమును పొందుచున్నాడో, అప్పుడదది సంవిత్తు అనబడుచున్నది.

శ్లో॥ యాంతి ప్రసాదం యేనాస్య మనః పంచ చ వాయవః।
ఇంద్రియాణీంద్రియార్థాశ్చ స ప్రసాద ఇతి స్మృతః ॥

తా॥ దేనిచేత యీ యోగియొక్క మనస్సు పంచప్రాణములు, ఇంద్రియములు, ఇంద్రియార్థములు ప్రసన్నమును పొందునో అదే ప్రసాదమని చెప్పబడును.

శ్లో॥ యుంజతశ్చ సదా యోగం యాదృగ్విహితమాసనం।
పద్మమర్ధాసనం చాపి తథా స్వస్తికమాసనం।
ఆస్థాయ యోగం యుంజీత కృత్వా చ ప్రణవం హృది ॥

తా॥ పద్మాసనముగాని, అర్ధపద్మాసనముగాని, స్వస్తికాసనముగాని, విహితమైన యేదో యొక ఆసనమును వేసుకొని హృదయమునందు ఓంకారమును ధ్యానించుచు యెల్లప్పుడును యోగమును చేయవలయును.

శ్లో॥ సమః సమాసనో భూత్వా సంహృత్య చరణావుభౌ।
సంవృతాస్య స్తథై వోరూ సమ్యగ్విష్టభ్య చాగ్రతః॥
పార్ష్ణిభ్యాం లింగవృషణావస్పృశన్ ప్రయతః స్థితః।
కించిదున్నామితశిరా దంతైర్దంతాన్న సంస్పృశేత్॥
సంపశ్యన్నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్।
రజసా తమసో వృత్తిం సత్త్వేన రజస స్తథా॥
సంఛాద్య నిర్మలే సత్త్వే స్థితో యుంజీత యోగవిత్॥

తా॥ సమానమైన ఆసనముపైని సమముగా నున్నవాడై, పాదములను తొడలను కూడ దీసికొని ముందునకు సమ్యగ్ దృష్టిగలవాడై, కొంచెము శిరస్సువంచి పైదంతములు క్రింది దంతములతో తాకనీయక నాసికాగ్రమునే చూచుచు, దిక్కులను జూడక తమో వృత్తిని రజస్సుచేతను, రజోవృత్తిని సత్త్వముచేతను ఆచ్ఛాదించి శుద్ధసత్త్వములో నున్నవాడై, యోగి నిరంతరమును యోగ మొనర్చవలెను.

శ్లో॥ ఇంద్రియాణీంద్రియార్థేభ్యః ప్రాణాదీన్మన ఏవ చ।
నిగృహ్య సమవాయేన ప్రత్యాహారముపక్రమేత్॥

తా॥ ఇంద్రియార్థములనుండి అనగా విషయములనుండి ఇంద్రియములను నిగ్రహించి ప్రాణములను మనస్సులను స్వాధీన మొనరించుకొని వీటి సమత్వముచే ప్రత్యాహారము నుపక్రమింపవలెను.

శ్లో॥ యస్తు ప్రత్యాహరేత్కామాన్ సర్వాంగానీవ కచ్ఛపః।
సదాత్మరతిరేకస్థః పశ్యత్యాత్మానమాత్మని॥
సబాహ్యాభ్యంతరం శౌచం నిష్పాద్యాకంఠనాభితః।
పూరయిత్వా బుధో దేహం ప్రత్యాహారముపక్రమేత్॥

తా॥ కూర్మము తన అవయవములను లోపలికి ముడుచుకొనునట్లు యెవడు సమస్త కామములను ఉపసంహరించుకొనునో, యెల్లప్పుడు ఆత్మరతి గలిగి ఏకాంతియై ఆత్మయందే ఆత్మను చూచుచున్నాడో, యెవడు బాహ్యాభ్యంతరముల శుచిగలవాడో, అట్టివాడు ప్రత్యాహారమును చేయవలయును.

శ్లో॥ ప్రాణాయామా దశ ద్వౌ చ ధారణా సాఽభిధీయతే।

ద్వే ధారణే స్మృతే యోగే యోగిభిస్తత్త్వదృష్టిభిః ॥

తా॥ పదిరెండు ప్రాణాయామములు అయినచో ఒక ధారణయని చెప్పబడుచున్నది. తత్త్వదర్శులగు యోగులచేత అట్టి ధారణలు రెండు యోగమునందు చేయవలయునని చెప్పబడినది.

శ్లో॥ తథా వై యోగయుక్తస్య యోగినో నియతాత్మనః ।
సర్వే దోషాః ప్రణశ్యంతి స్వస్థశ్చైవోపజాయతే ॥

తా॥ అప్పుడు నియతాత్మవంతుడును, యోగయుక్తుడు నగు యోగియొక్క సమస్తదోషములును నశించుచున్నవి. స్వరూపునందు నిలకడ గలుగుచున్నది.

శ్లో॥ వీక్షతే చ పరం బ్రహ్మ ప్రాకృతాంశ్చ గుణాన్ పృథక్ ।
వ్యోమాదిపరమాణూంశ్చ తథాఽఽత్మానమకల్మషం ।
ఇత్థం యోగీ యతాహారః ప్రాణాయామపరాయణః ॥

తా॥ అప్పుడు పరబ్రహ్మమును, ప్రకృతిగుణములను, ఆకాశాదిభూతములను, పరమాణువులను, కలుషరహితమైన ఆత్మను వేరువేరుగా తెలిసికొనుచున్నాడు. అనగా ప్రకృతి పురుషులను వేరువేరుగా తెలిసికొనుచున్నాడు.

శ్లో॥ ఇత్థం యోగీ యతాహారః ప్రాణాయామపరాయణః ।
జితాం జితాం తథా భూమిమారోహేత యథా గృహమ్ ॥

తా॥ ఈ ప్రకారముగా ప్రాణాయామపరాయణుడైన యోగి నియతాహారుడై మేడ మెట్లెక్కునట్లు ఒక్కొక్క భూమికను జయించుచు యెక్కిపోవలయును.

శ్లో॥ దోషాన్ వ్యాధీంస్తథా మోహమాక్రాంతా భూరనిర్జితా ।
వివర్ధయతి నారోహేత్తస్మాద్భూమిమనిర్జితామ్ ॥

తా॥ ఆయా స్థానముల నధిరోహించుచు, ప్రాణాయామమును చక్కగా చేయజాలనిచో అది దోషములను, వ్యాధులను, మోహాదులను అభివృద్ధిచేయును. అందువలన దానిని జయించనివారు అనగా ఆతత్త్వమును బాగుగా తెలియనివారు ఆయా స్థానముల నెక్కించరాదు.

శ్లో॥ ప్రాణానాముపసంరోధాత్ప్రాణాయామ ఇతి స్మృతః ।
ధారణేత్యుచ్యతే చేయం ధార్యతే యన్మనో యయా ॥

తా॥ ప్రాణములను బాగుగా నిరోధించుట అనగా తన స్వాధీనము చేసికొనుటయే ప్రాణాయామమని చెప్పబడుచున్నది. దేనిచేత మనస్సు ధరించబడునో, అదే ధారణయని చెప్పబడుచున్నది.

శ్లో॥ శబ్దాదిభ్యః ప్రవృత్తాని యదక్షాణి యతాత్మభిః ।
ప్రత్యాహ్రియంతే యోగేన ప్రత్యాహార స్తతస్స్మృతః ॥

తా॥ శబ్దస్పర్శాది విషయములయందు ప్రవృత్తములైన యింద్రియాదులను యోగముచేత మరలించుట, అనగా విషయములపైకిపోకుండా అరికట్టుట అనున దేది గలదో అదే ప్రత్యాహారమని చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉపాయాశ్చాత్ర కథితో యోగిభిః పరమర్షిభిః ।
యేన వ్యాధ్యాదయో దోషా న జాయంతే హి యోగినః ॥

తా॥ వ్యాధులు మొదలగు దోషములు కలుగకుండుటకై యోగిపుంగవులగు మహర్షులు అనేక వుపాయములు చెప్పియుండిరి.

శ్లో॥ యథా తోయార్థినస్తోయం యంత్రనాళాదిభిశ్శనైః ।
అపిబేయు స్తథా వాయుం పిబేద్యోగీ జితశ్రమః ॥

తా॥ దప్పిగొన్నవారెట్లు యంత్రముల ద్వారా గొట్టములు మొదలగు సాధనముల ద్వారా మెల్లమెల్లగా జలమును పాన మొనర్చుచున్నారో, అదేవిధమున యోగి శ్రమపడకుండ వాయువును మెల్లగా పీల్చవలయును.

శ్లో॥ ప్రాఙ్నాభ్యాం హృదయే చాథ తృతీయే చ తథోరసి ।
కంఠే ముఖే నాసికాగ్రే నేత్రభ్రూమధ్యమూర్ధ్నసు ॥
కించ తస్మాత్పరస్మింశ్చ ధారణా పరమా స్మృతా ।
దశైతా ధారణాః ప్రాప్య ప్రాప్నోత్యక్షరసామ్యతామ్ ॥

తా॥ మొదట నాభియం దారంభించి తరువాత హృదయమునందు, పిమ్మట వక్షస్థలమునందు, పిదప కంఠమునందు, అనంతరము ముఖము, తరువాత నాసికాగ్రము, పిదప నేత్రము, భ్రూమధ్యము, శిరస్సు. పిదప వీటి కన్నిటికి పరమైనదానియందు ధారణ చేయవలెను. ఈ పదివిధములగు ధారణలను చేసినవాడు అక్షరస్వరూపుడగును.

శ్లో॥ నాధ్మాతః క్షుధితశ్శ్రాంతో న చ వ్యాకులచేతనః ।
యుంజీత యోగం రాజేంద్ర యోగీ సిద్ధ్యర్థమాదృతః ॥

తా॥ ఎక్కిలి తపన లేనివాడై, ఆకలిబాధకు అలమటించక, అలసటలేక, వ్యాకులచిత్తముతో కండ్లు మిటకరించనివాడై యోగసిద్ధియందు బద్ధాదరముగలవాడై నిరంతరము యోగధారణము చేయవలయును.

శ్లో॥ నాతిశీతే న చోష్ణే వై న ద్వంద్వే నానిలాత్మకే ।
కాలేష్వేతేషు యుంజీత న యోగం ధ్యానతత్పరః ॥

తా॥ మిక్కిలి శీతలప్రదేశమునగాని, శీతకాలమునగాని, మిక్కిలి ఉష్ణప్రదేశమునగాని, ఉష్ణకాలమునగాని, లేక యీ రెండు లేనిచోటగాని, మిక్కిలి వాయువు వీచుచోటగాని అభ్యాసకుడు యోగధారణను చేయరాదు.

శ్లో॥ సశబ్దాగ్నిజలాభ్యాశే జీర్ణగోష్ఠే చతుష్పదే।
శుష్కపర్ణచయే నద్యాం శ్మశానే ససరీసృపే॥
సభయే కూపతీరే వా చైత్యవల్మీకసంచయే।
దేశేష్వేతేషు తత్త్వజ్ఞో యోగాభ్యాసం వివర్జయేత్॥

తా॥ ఎల్లప్పుడు శబ్దముతో కూడుకొన్నటువంటివిన్నీ, అగ్నిభయమునకు అవకాశమున్నటువంటివిన్నీ, నిరంతరము జలము ప్రూరుచున్నటువంటి స్థలములు, శిథిలమైన కొట్టాములు, నాలుగుదారుల మధ్యప్రదేశము, ఎండిపోయిన ఆకులుగల ప్రదేశము, నది, శ్మశానము, పాములతో కూడుకొన్నచోటు, భయమునకు ఆకరమైన ప్రదేశము, నూతి వొడ్డు, ఎక్కువ పుట్టలుగల స్థలము, యీ ప్రదేశములయందు యెప్పుడూ యోగసిద్ధిని గోరువాడు యోగాభ్యాసమును చేయరాదు.

శ్లో॥ సత్త్వస్యానుపపత్తౌ చ దేశకాలం వివర్జయేత్।
నాసతో దర్శనం యోగే తస్మాత్తత్ పరివర్జయేత్॥

తా॥ ఈపైని చెప్పిన వసతులు కుదురకపోయినచో దేశకాలములను విడిచిపెట్టవచ్చును. ఎందుకనగా యోగమునకు అసద్దర్శనమంటూ ఒకటిలేదు. అందువలన దానిని విడిచిపెట్టవలెను.

శ్లో॥ దోషానేతాననాదృత్య మూఢత్వాద్యో యునక్తి వై।
విఘ్నాయ తస్య వై దోషా జాయంతే తన్నిబోధ మే॥

తా॥ పై జెప్పిన యీదోషములను పరిగణించక మూఢత్వముతో నెవడైన యోగమును జేయుటకు ప్రారంభించెనా తప్పక విఘ్నములు కలుగక మానవు. వానిని జెప్పెదను వినుము.

శ్లో॥ బాధిర్యం జడతా లోపః స్మృతేర్మూకత్వమంధతా।
జ్వరశ్చ జాయతే సద్యస్తత్తదజ్ఞానయోగినః॥

తా॥ శాస్త్రము నుల్లంఘించి తన స్వేచ్ఛప్రకారము చేయు మూఢుడగు యోగికి విఘ్నములు తప్పవు. అందువలన వానికి చెవుడు, జడత్వము, స్మృతి లేకపోవుట, మూగతనము, గ్రుడ్డితనము, జ్వరము మొదలగువాటిలో నేదేని సంభవించును.

శ్లో॥ ప్రమాదాద్యోగినో దోషా యద్యేతే స్యుశ్చికిత్సితం।
తేషాం నాశాయ కర్తవ్యం యోగినాం తన్నిబోధ మే॥

తా॥ ప్రమాదమువలన యోగికి యీపై జెప్పిన దోషములుగాని సంభవించినట్లై యితే ఆ దోషములను పోగొట్టుకొనుటకు ప్రయత్నింపవలయును. ఆ వుపాయములను చెప్పెదను వినుము.

శ్లో॥ స్నిగ్ధాం యవాగూమత్యుష్ణాం భుక్త్వా తత్రైవ ధారయేత్ ।
వాతగుల్మప్రశాంత్యర్థముదావర్తే తథోదరే ।
యవాగూం వాపి పవనం వాయుగ్రంథిం ప్రతిక్షిపేత్ ॥

తా॥ వాతగుల్మాదులు పోవలయునన్న మిక్కిలి వేడి గలిగినటువంటి స్నిగ్ధమైన గంజిని త్రాగి కొంతసేపు నోటిలోనుంచి తరువాత గుండెలలోను, పిదప గర్భమునందును ధారణ చేయవలయును. తరువాత గంజిని వాయువుతోగూడ వాయుగ్రంథియందుంచవలయును. అప్పుడు కంపము కలుగును.

శ్లో॥ తద్వత్కంపే మహాశైలం స్థిరం మనసి ధారయేత్ ।
విఘాతే వచసో వాచం బాధిర్యే శ్రవణేంద్రియమ్ ॥

తా॥ అట్లు కంపము కలిగినచో మనస్సులో మహాశైలమున్నట్లు ధారణ చేయవలయును. వాక్కు చెడినచో వాగింద్రియమును, చెవుడు వచ్చినచో శ్రవణేంద్రియమును ధారణ చేయవలయును.

శ్లో॥ యథైవామ్రఫలం ధ్యాయేత్తృష్ణార్తో రసనేంద్రియం ।
యస్మిన్యస్మిన్రుజా దేహే తస్మింస్తదుపకారిణీమ్ ।
ధారయేద్ధారణాముష్ణే శీతాం శీతే చ దాహినీమ్ ॥

తా॥ దప్పిగొన్నవాడు ఉసిరికకాయను తలంచుకున్నట్లు నోటిలో వ్యాధిగలిగినట్టయితే రసనేంద్రియమును ధ్యానించవలయును. పెక్కులేల; ఎక్కడెక్కడ దేహమునందు రోగము కనబడునో అక్కడక్కడ ఆయా ఇంద్రియాధిదేవతలను ధ్యానించవలయును. ఉష్ణము చేసినచో శీతమును, శైత్యము చేసినచో ఉష్ణమును ధారణ చేయవలయును; అనగా భావించవలయును.

శ్లో॥ కీలం శిరసి సంస్థాప్య కాష్ఠం కాష్ఠేన తాడయేత్ ।
లుప్తస్మృతేః స్మృతిః సద్యో యోగినస్తేన జాయతే ॥

తా॥ స్మృతితప్పినవానియొక్క శిరస్సుపైని ఒక కొయ్యశీలనుంచి దానిపై మరియొక కొయ్యతో మెల్లగా మర్దనము చేసినచో స్మృతిజ్ఞానము గలుగును. అనగా పూర్వస్మృతివచ్చును.

శ్లో॥ ద్యావాపృథివ్యౌ వాయ్వగ్నీ వ్యాపినావపి ధారయేత్ ।
అమానుషాత్సత్వజాద్వా బాధాస్త్వేతి చికిత్సతామ్ ॥

తా॥ భూతాది పిశాచములనుండిగాని, జంతువులనుండిగాని బాధలు గలిగినచో భూమ్యాకాశములను, వాయువును, అగ్నిని వ్యాపించియున్నవానినిగా ధారణ చేయవలయును.

శ్లో॥ ఏవం సర్వాత్మనా రక్ష్యా కార్యా యోగవిదా నృప।
ధర్మార్థకామమోక్షాణాం శరీరం సాధనం యతః॥

తా॥ ఈప్రకారము సర్వవిధముల యోగమునెరింగిన యోగిచేత శరీరరక్షణ చేయదగినది. ఎందుకనగా ధర్మార్థ కామమోక్షములకు యీశరీరమే సాధనభూతమైనది. దీనిద్వారానే అన్నియు సాధింపబడవలసియున్నవి.

శ్లో॥ ప్రవృత్తిలక్షణాఖ్యానాత్ యోగినో విస్మయాత్తథా।
విజ్ఞానం విలయం యాతి తస్మాద్గోప్యాః ప్రవృత్తయః॥

తా॥ యోగసాధనవలన యోగికి కొన్ని ప్రవృత్తులు (మహిమలు) కలుగును. అయితే వాటిని చెప్పుటచేతను, తనకుతానే ఆశ్చర్యపడుటవల్లను విజ్ఞానము నశించిపోవుచున్నది. కాన యోగి ఆ ప్రవృత్తులను గోప్యముగా నుంచవలయును.

శ్లో॥ అలౌల్యమారోగ్యమనిష్ఠురత్వం
గంధః శుభో మూత్రపురీషమల్పం।
కాంతిః ప్రసాదః స్వరసౌమ్యతా చ
యోగప్రవృత్తేః ప్రథమం హి చిహ్నమ్॥

తా॥ దేనియందును లోలుపత్వము లేకుండుట, ఆరోగ్యము గలిగియుండుట, మార్దవము (దయార్ద్రహృదయము) గలిగియుండుట, మంచి సువాసన, మూత్రము, మలము, అత్యల్పము, కాంతి, ప్రసన్నత, మంచి స్వరముగలిగియుండుట. — ఇవి యోగప్రవృత్తికి మొదటి చిహ్నము.

శ్లో॥ అనురాగం జనో యాతి పరోక్షే గుణకీర్తనం।
న బిభ్యతి చ సత్త్వాని సిద్ధేర్లక్షణముత్తమమ్॥

తా॥ జనులు దినదినమునకు అనురాగమును పొందుట, పరోక్షమునందు అతని యొక్క గుణములను కీర్తించుట, ప్రాణులుగూడ తననుజూచి భయపడకుండుట — ఇవి ఉత్తమయోగసిద్ధికి లక్షణములు.

శ్లో॥ శీతోష్ణాదిభిరత్యుగ్రైర్యస్య బాధా న విద్యతే।
న భీతిమేతి చాన్యేభ్యస్తస్య సిద్ధిరుపస్థితా॥

తా॥ ఎవనికి అతితీవ్రములగు శీతోష్ణాదులబాధ ఉండదో అనగా యెట్టి శీతోష్ణములనైనను సహించునో, ఇతరులనుండి యెవడు భయపడడో అట్టివానికి సిద్ధి కరతలామలకము.

ఇతి శ్రీ మార్కండేయమహాపురాణే యోగసిద్ధినిరూపణం
నామ షట్త్రింశోఽధ్యాయః.

ఇది మార్కండేయ మహాపురాణమునందలి యోగసిద్ధి నిరూపణమను
ముప్పది ఆరవ అధ్యాయము.

---

శ్లో॥ ఉపసర్గాః ప్రవర్తన్తే దృష్టే హ్యాత్మని యోగినః ।
యేతాంస్తే సంప్రవక్ష్యామి సమాసేన నిబోధ మే ॥

తా॥ ఆత్మజ్ఞానముకొరకు యత్నించుయోగికి ఉత్పాతములు అనేకములు గలుగును. వానిని సంగ్రహముగా నిచట చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ కామ్యాః క్రియాస్తథా కామాన్ మానుషానభివాంఛతి ।
స్త్రియో దానఫలం విద్యాం మాయాం కుప్యం ధనం దివమ్ ॥
దేవత్వమమరేశత్వం రసాయనచయః క్రియాం ।
మరుత్ప్రపతనం యజ్ఞం జలాగ్న్యావేశనం తథా ॥
శ్రాద్ధానాం సర్వదానానాం ఫలాని నియమాంస్తథా ।
తథోపవాసాత్పూర్తాచ్చ దేవతాభ్యర్చనాదపి ॥
తేభ్యస్తేభ్యశ్చ కర్మభ్య ఉపసృష్టోఽభివాంఛతి ।
చిత్తమిత్థం వర్తమానం యత్నాద్యోగీ నివర్తయేత్ ॥

తా॥ యోగసాధనముచేయుచున్న యతియొక్క మనస్సు కామ్యకర్మలను, అట్లే మానవ సాధారణములగు కోరికలను, స్త్రీలను, దానఫలమును, విద్యను, ప్రకృతి సంపదలను, రాగి మొదలగు లోహములను, ధనమును, స్వర్గమును, దేవత్వమును, దేవేంద్రపదవిని, రసాయనక్రియను, యౌవనక్రియను, గంధర్వాది పతనమును, యజ్ఞమును, జలప్రవేశమును, అగ్నిప్రవేశమును, శ్రాద్ధఫలములను, దానఫలములను, అట్లే వాటియొక్క నియమములను, ఉపవాసాదులవలనను, తటాకాదులు నిర్మించుటవలనను, దేవతలను పూజించుటవలనను గలిగిన ఫలములను, ఆయాకర్మములద్వారా ప్రేరేపించబడి కోరుచున్నది. అట్టి మనస్సును యోగి మిక్కిలి ప్రయత్నముతో నివర్తింపవలయును, అనగా మరల్చవలెను.

శ్లో॥ బ్రహ్మసంగి మనః కుర్వన్నుపసర్గాత్ప్రముచ్యతే।
ఉపసర్గై ర్జితై రేభిరుపసర్గాస్తతః పునః।
యోగినః సంప్రవర్తన్తే సాత్త్వరాజసతామసాః॥

తా॥ యోగి అట్టి మనస్సును బ్రహ్మమునందు నిలిపి ఈ ఉత్పాతములనుండి బయటబడుచున్నాడు. జయించబడిన యీ ఉత్పాతములు మరల సాత్త్విక, రాజస, తామసోత్పాతములుగా పరిణామమును పొందుచూ యోగియందు ప్రవర్తించుచున్నవి.

శ్లో॥ ప్రాతిభః శ్రావణో దైవో భ్రమావర్తౌ తథా పరౌ।
పంచైతే యోగినాం యోగవిఘ్నాయ కటుకోదయాః॥

తా॥ యోగుల యోగములను విఘ్నము చేయుటకు పంచవిధముల ఉత్పాతములు ప్రవర్తించుచున్నవి. ప్రాతిభమనియు, శ్రావణమనియు, దైవమనియు, భ్రమమనియు, ఆవర్తమనియు వాటికి పేర్లు.

శ్లో॥ వేదార్థాః కావ్యశాస్త్రార్థా విద్యాశిల్పాన్యశేషతః।
ప్రతిభాంతి యదస్యేతి ప్రాతిభస్స తు యోగినః॥

తా॥ వేదార్థములు, కావ్యార్థములు, శాస్త్రార్థములు యింకను తక్కిన విద్యలు యితనికి ప్రకాశించుటవలన అది ప్రాతిభమని చెప్పబడుచున్నది.

శ్లో॥ శబ్దార్థానఖిలాన్వేత్తి శబ్దం గృహ్ణాతి చైవ యత్।
యోజనానాం సహస్రేభ్యః శ్రావణస్సోఽభిధీయతే॥

తా॥ సమస్త శబ్దార్థములను యెరుగుటవల్లను, వేలకొలది యోజనములదూరమునుండైనను శబ్దమును గ్రహించుటవలనను అది శ్రావణమని పిలువబడుచున్నది.

శ్లో॥ సమంతాద్వీక్షతే చాష్టౌ స యదా దేవయోనయః।
ఉపసర్గం తమప్యాహుర్దైవమున్మత్తవద్బుధాః॥

తా॥ అష్టవిధములగు దేవయోనులు ఉన్మత్తునివలె దేనిచేత అంతట చూడబడుచున్నవో ఆ ఉత్పాతమును దైవమని పెద్దలు చెప్పుచున్నారు.

శ్లో॥ భ్రామ్యతే యన్నిరాలంబం మనోదోషేణ యోగినః।
సమస్తాచారవిభ్రంశాద్భ్రమస్స పరికీర్తితః॥

తా॥ మనోదోషముచేత సమస్తాచార రహితమైనదై అలంబనరహితమైన మనస్సు దేనిచేత భ్రమించుచున్నదో, అదియే భ్రమ మను నాల్గవ ఉత్పాతము.

శ్లో॥ ఆవర్త ఇవ తోయస్య జ్ఞానావర్తో యదాకులః।
నాశయేచ్చిత్తమావర్త ఉపసర్గస్స ఉచ్యతే॥

తా॥ జలమునందలి సుడివలె జ్ఞానమును త్రిప్పుచూ ఆకులపెట్టుచూ యేది చిత్త నాశనమును జేయుచున్నదో దానిని అవర్త ఉత్పాతమందురు.

శ్లో॥ ఏతైర్నాశితయోగాస్తు సకలా దేవయోనయః।
ఉపసర్గైర్మహాఘోరై రావర్తంతే పునః పునః॥

తా॥ మహాభయంకరములగు యీ ఉత్పాతములచేత సమస్తదేవయోనులున్ను (దేవతలు) నశింపజేయబడిన యోగముగలవారై మాటిమాటికి సంసారసాగరమున తిరుగు చుందురు (వచ్చుచూ పోవుచుందురు).

శ్లో॥ చింతయేత్పరమం బ్రహ్మ కృత్వా తత్ప్రవణం మనః।
యోగయుక్తస్సదా యోగీ లఘ్వాహారో జితేంద్రియః॥

తా॥ యోగయుక్తుడును, తేలికైన ఆహారముగలవాడును, జితేంద్రియుడునై యోగి యెల్లప్పుడును బ్రహ్మమునందే మనస్సును ఆసక్తమైనదానినిగా జేసి ఆ పరబ్రహ్మము నే చింతించుచుండవలయును.

శ్లో॥ దేవానామసురాణాం చ గంధర్వోరగరక్షసాం।
దేహేషు లయమాయాతి సంగం నాప్నోతి చ క్వచిత్॥

తా॥ యోగియగువాడు దేవతలయొక్కయు, రాక్షసులయొక్కయు, గంధర్వ యక్షరక్షస్సులయొక్కయు దేహములలో లయమును పొందుచున్నాడు. ఎక్కడగూడ సంగమమును పొందడు.

శ్లో॥ అణిమా లఘిమా చైవ మహిమా ప్రాప్తిరేవ చ।
ప్రాకామ్యం చ తథేశిత్వం వశిత్వం చ తథా పరమ్॥

తా॥ అణిమా, లఘిమా, మహిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం అని సిద్ధులు ఎనిమిది విధములు.

శ్లో॥ సూక్ష్మాత్సూక్ష్మతమోఽణీయాన్ శీఘ్రత్వం లఘిమాగుణః।
మహిమాశేషపూజ్యత్వాత్ప్రాప్తిర్నాప్రాప్యమస్య యత్॥
ప్రాకామ్యమస్య వ్యాపిత్వాదీశిత్వం ఈశ్వరో యతః।
వశిత్వాద్వశిమా నామ యోగినస్సప్తమో గుణః॥

తా॥ సూక్ష్మాతిసూక్ష్మము అణిమాగుణమనియు, శీఘ్రత్వము లఘిమాయనియు, అందరిచేతపూజింపబడుట మహిమయనియు, ప్రాప్తించనిది ప్రాప్తించుట ప్రాప్తియనియు, అంతట వ్యాపించుట ప్రాకామ్యమనియు, ఈశ్వరుడగుట ఈశిత్వమనియు, వశమొనరించుకొనుట వశిత్వమనియు చెప్పబడుచున్నవి.

శ్లో॥ యత్రేచ్ఛాస్థానమప్యుక్తం యత్ర కామవశాయితా।
ఐశ్వర్యకారణై రేభిర్యోగినః ప్రోక్తమష్టధా॥

తా॥ ఏ స్థానమునందు సమస్తకామములు వశమగునో, ఆస్థానమును యిచ్ఛాస్థానమని చెప్పుదురు. అదియే అష్టమగుణము. కాని అమరకోశమునందు,

"అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా
ప్రాప్తిః ప్రాకామ్యమీశిత్వం వశిత్వం చాష్టభూతయః॥"

అని వున్నది. అనగా "గరిమా" అని అందులో చెప్పబడియున్నది. ఇచ్చట యిచ్ఛాస్థానమని యున్నది. ఐశ్వర్యకారణములగు వీనిని ఎనిమిదివిధములని చెప్పుచున్నారు.

శ్లో॥ ముక్తిసంసూచకం భూప పరం నిర్వాణమాత్మనః।
తతో న జాయతే నైవ వర్ధతే న వినశ్యతి।
నాపి క్షయమవాప్నోతి పరిణామం న గచ్ఛతి॥

తా॥ ముక్తిసూచకమగు పరనిర్వాణమయితే యీ యణిమాది సిద్ధులవల్ల కలుగునదికాదు. అది పుట్టదు, పెరుగదు, నశించదు, క్షీణదశనుగాని పరిణామమునుగాని పొందునదిగాదు.

శ్లో॥ ఛేదం క్లేదం తథా దాహం శోషం భూరాదితో న చ।
భూతవర్గాదవాప్నోతి శబ్దాద్యైర్హ్రియతే న చ॥

తా॥ అది పంచభూతములనుండిగాని, భూతవర్గమునుండిగాని ఛేదము, క్లేదము, దాహము, శోషము మొదలగువాటిని పొందదు. అనగా ఆపరబ్రహ్మవస్తువు ఛేదింపబడదు, తడుపబడదు. దహింపబడదు, యెండింపబడదు; నిత్యము త్రికాలాబాధ్యము అనిభావము.

శ్లో॥ న చాస్య సంతి శబ్దాద్యాస్తద్భోక్తా తైశ్చ యుజ్యతే॥

తా॥ దానియందు శబ్దాదులులేవు. అది అన్నిటికి భోక్తయైయున్నది. అది దేనిని అంటదు.

శ్లో॥ యథా హి కనకం ఖండమపద్రవ్యవదగ్నినా।
దగ్ధదోషం ద్వితీయేన ఖండేనైక్యం వ్రజేన్నృప।
న విశేషమవాప్నోతి తద్వద్యోగాగ్నినా యతిః॥

తా॥ మలినబంగారపు తునక అగ్నియందు బాగుగా పరిస్ఫుటము చేయబడినదై దోషరహితమై మంచిబంగారుతో నెట్లు ఐక్యము చేయబడి వేరుగా కనుపించుటలేదో అట్లే యోగాగ్నిచేత యతి సమస్తదోషములు నశించినవాడై,

శ్లో॥ పరేణ బ్రహ్మణా తద్వత్ప్రాప్యైక్యం దగ్ధకిల్బిషః।
యోగీ యాతి పృథగ్భావం న కదాచిన్మహీపతే॥

తా॥ పరబ్రహ్మముతో ఐక్యమును పొందినవాడై ఒకప్పుడుగూడ యోగి పృథగ్భావమును పొందడు. అనగా పరబ్రహ్మమునకంటె వేరుగాడు.

శ్లో॥ యథా జలం జలేనైక్యం నిక్షిప్తముపగచ్ఛతి ।
తథాత్మా సామ్యమభ్యేతి యోగినః పరమాత్మని ॥

తా॥ జలములో జల మెట్లు కలిసిపోవుచున్నదో అట్లే పరమాత్మయందు ఆత్మ ఐక్యమును పొందిన పిమ్మట మరి వేరుకాదు.

అలర్క ఉవాచ = అలర్కుడు చెప్పెను.

శ్లో॥ భగవన్యోగినశ్చర్యాం శ్రోతుమిచ్ఛామి తత్త్వతః ।
బ్రహ్మవర్త్మన్యనుసరన్యథా యోగీ న సీదతి ॥

తా॥ పూజ్యుడవగు నో మునీంద్రా! పరబ్రహ్మమార్గమునందున్నవాడైనను, యోగి యెట్లు పరిభ్రష్టుడుకాడో, ఆతని నడకడి యెట్లుండునో యథార్థమును వినగోరుచున్నాను.

దత్తాత్రేయ ఉవాచ = దత్తాత్రేయముని చెప్పెను.

శ్లో॥ మానావమానౌ యావేతౌ ప్రత్యుద్వేగకరౌ నృణాం ।
తావేవ విపరీతార్థౌ యోగినః సిద్ధికారకౌ ॥

తా॥ మానము (అభిమానము), అవమానము యీ రెండును మనుష్యులకు ఉద్వేగమును గలిగించునవి. అనగా అభిమానము రాగమును లేక (ప్రేమను), అవమానము ద్వేషమును గలిగించుచున్నది. కాని యోగికి యివియే విపరీతములై సిద్ధికారకములగుచున్నవి. ఎట్లనగా,

శ్లో॥ మానావమానౌ యావేతౌ తావేవాహుర్విషామృతే ।
అవమానోఽమృతం తత్ర మానస్తు విషమం విషమ్ ॥

తా॥ మానావమానములను విషామృతములని చెప్పుచున్నారు. అనగా లోకులు మానము అమృతమువంటిదనియు, అవమానము విషమువంటిదనియు తలంతురు గాని యోగికి మాత్రము అది విపరీతమగుచున్నది. ఎట్లనగా, యోగికి అవమానము అమృతముగాను, మానము విషముగాను తోచుచున్నది. అనగా అవమానము బంధరహితమును, మానము బంధమును గలుగజేయుచున్నవి.

శ్లో॥ చక్షుఃపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్ ।
సత్యపూతాం వదేద్వాణీం బుద్ధిపూతం చ చింతయేత్ ॥

తా॥ యోగియగువాడు బాగుగా చూచుకొని భూమిపై పాదముంచవలెను. వస్త్రములో వడగట్టిన నీటినే త్రాగవలయును. అబద్ధమాడరాదు. పరిశుద్ధబుద్ధితో చింతించవలెను.

శ్లో॥ అతిథ్యశ్రాద్ధయజ్ఞేషు దేవయాత్రోత్సవేషు చ।
మహాజనేషు సిద్ధ్యర్థం న గచ్ఛేద్యోగవిత్ క్వచిత్ ॥

తా॥ అతిథిసత్కారమునకై యేర్పడినచోటులకు, శ్రాద్ధకర్మలుచేయు స్థలములకు, యజ్ఞములు చేయుచోటులకు, దైవోత్సవములు, రథోత్సవములు జరుగుచోటులకు, గొప్ప జనసంఘముగల తావులకు సిద్ధినికోరు యతి పోరాదు.

శ్లో॥ వ్యస్తే విధూమే వ్యంగారే సర్వస్మిన్ భుక్తవజ్జనే।
అటేత యోగవిద్భైక్ష్యం న తు తేష్వేవ నిత్యశః ॥

తా॥ చెదరి, నిప్పులు పొగలేకుండా అయిపోయిన సమయముచూచుకొని, అందరికీ భోజనాలు అయిపోతూ ఉన్నసమయములో యతి భిక్షాటనమునకై వెళ్లవలెను. అయితే యెల్లప్పుడు వెళ్లినయిండ్లకే వెళ్లరాదు.

శ్లో॥ యథైవమవమన్యంతే జనాః పరిభవంతి చ।
తథా యుక్తశ్చరేద్యోగీ సతాం వర్త్మ న దూషయన్ ॥

తా॥ యోగి సజ్జనులమార్గమునకు కళంకమాపాదింపనివాడై యోగ్యునుగా నడచుకొనవలయును. జనులు అవమానించినను, తిరస్కరించినను తన సాధుమార్గమును విడువరాదు.

శ్లో॥ భైక్ష్యం చరేద్గృహస్థేషు యాయావరగృహేషు చ।
శ్రేష్ఠా తు ప్రథమా చేతి వృత్తిరస్యోపదిశ్యతే ॥

తా॥ యతి గృహస్థులయిండ్లయందును, తిరిగి సంపాదించుకొనువారివద్దను భిక్షనాచరించవచ్చును. అయితే గృహస్థుల యిండ్లలో భిక్షతీసుకొనుటయే సర్వశ్రేష్ఠము.

శ్లో॥ అథ నిత్యం గృహస్థేషు శాలీనేషు చరేద్యతిః।
శ్రద్దధానేషు దాంతేషు శ్రోత్రియేషు మహాత్మసు ॥
అత ఊర్ధ్వం పునశ్చాపి అదుష్టాపతితేషు చ।
భైక్ష్యచర్యా వివర్ణేషు జఘన్యావృత్తిరిష్యతే ॥

తా॥ మరియు గొప్ప దయాస్వభావము గలిగినటువంటిన్నీ, శ్రద్ధాభక్తులుగలిగినటువంటిన్నీ, వేదములను చదువుకొని గొప్పవారగు గృహస్థుల యిండ్లయందును, పాపులు కానటువంటియు, దుష్టులుకానటువంటి వారి యిండ్లలో భిక్షతీసికొనవలయును. సంకరవర్ణములయందు భిక్షమెత్తుట కనిష్ఠమనిపించుకొనును.

శ్లో॥ భైక్ష్యం యవాగూం తక్రం వా పయో యావకమేవ వా।
ఫలం మూలం ప్రియంగుం వా కణపిణ్యాకసక్తవః।
ఇత్యేతే చ శుభాహారా యోగినాం సిద్ధికారకాః ॥

తా॥ కాఫ్రదుగంజి, మజ్జిగ, పాలు, అలసందలు లేక కారుమినుములు, ఫలములు, కందమూలాదులు, కొఱ్ఱలు, గోధుమపిండి అటుకులు యీ మొదలగునవి యోగికి శ్రేష్ఠమగు ఆహారము. ఇవి సిద్ధికారకములు.

శ్లో॥ అస్తేయం బ్రహ్మచర్యం చ త్యాగో౽లోభ స్తథైవ చ।
వ్రతాని పంచ భిక్షూణామహింసాపరమాణి వై॥

తా॥ అహింసావ్రతము ముందుగాగల అస్తేయము (దొంగిలింపకుండుట), బ్రహ్మచర్యము, త్యాగము, అలోభము (లుబ్ధత్వములేకుండుట) అను యీ యైదును యతులకు వ్రతములు.

శ్లో॥ అక్రోధో గురుశుశ్రూషా శౌచమాహారలాఘవం।
నిత్యస్వాధ్యాయ ఇత్యేతే నియమాః పరికీర్తితాః॥

తా॥ కోపములేకుండుట, గురుశుశ్రూష, శౌచము (బాహ్యాభ్యంతరము), మితాహారము, నిత్యస్వాధ్యాయము (ఎల్లప్పుడు చదువుట) అను నీ యైదును యతులకు నియమములు.

శ్లో॥ సారభూతముపాసీత జ్ఞానం యత్కార్యసాధకం।
జ్ఞానానాం బహుతా యేయం యోగవిఘ్నకరీ హి సా॥

తా॥ ఏజ్ఞానము నాశ్రయించిన కార్యసాధకమగునో అట్టి జ్ఞానము నొక్కదానినే ఆరాధింపవలెను. అంతేగాని భిన్నభిన్న జ్ఞానముల నవలంబించుట యోగవిఘ్నకారకమగును. అనగా ఒక్క ఆత్మజ్ఞానము తప్ప తక్కినవి నశించునని భావము.

శ్లో॥ ఇదం జ్ఞేయమిదం జ్ఞేయమితి య స్తృషితశ్చరేత్।
అపి కల్పసహస్రేషు నైవ జ్ఞేయమవాప్నుయాత్॥

తా॥ ఇది జ్ఞేయము, కాదుకాదు అది జ్ఞేయము అని ఇట్లిది గాదదియని, అదిగాదిదియని నిశ్చయజ్ఞానములేనివాడై ఆశపోతై తిరుగువాడు వేలకొలది కల్పాలు జరిగినా జ్ఞేయమును తెలుసుకొనగలడా? తెలిసికొనజాలడని అర్థము.

శ్లో॥ త్యక్తసంగో జితక్రోధో లఘ్వాహారీ జితేంద్రియః।
విధాయ బుద్ధ్యా ద్వారాణి మనో ధ్యానే నివేశయేత్॥

తా॥ సర్వసంగపరిత్యాగియై క్రోధమును జయించినవాడై మితాహారియై జితేంద్రియుడై బుద్ధిచేత సమస్త (ఇంద్రియ) ద్వారములను నియమించి మనస్సును ధ్యానములో ప్రవేశపెట్టవలెను.

శ్లో॥ శూన్యేష్వేవావకాశేషు గుహాసు చ వనేషు చ।
నిత్యయుక్తః సదా యోగీ ధ్యానం సమ్యగుపక్రమేత్॥

తా॥ నిర్జనప్రదేశములయందును, గుహలయందును, వనములయందును యోగి సమస్తేంద్రియనిగ్రహపరుడై ధ్యానమును సలుపవలయును.

శ్లో॥ వాగ్దండః కర్మదండశ్చ మనోదండశ్చ తే త్రయః ।
యస్యైతే నియతా దండాః స త్రిదండీ మహాయతిః ॥

తా॥ వాగ్దండము, కర్మదండము, మనోదండమను నీ మూడుదండములును యెవనికి నియతములో ఆతడు ప్రపంచమునందు మహాయతి యని పిలువబడుచున్నాడు.

శ్లో॥ సర్వమాత్మమయం యస్య సదసజ్జగదీదృశం ।
గుణాగుణమయం తస్య కః ప్రియః కో నృపాప్రియః ॥

తా॥ సదసద్రూపమైనట్టియు, గుణాగుణమయమైనట్టి యీ సమస్తజగత్తు యెవనికి ఆత్మమయమో అనగా ఆత్మకంటె భిన్నముగాదో అట్టివానికి ప్రియమేది? అప్రియమేది? అంతయు సమానమేనని భావము.

శ్లో॥ విశుద్ధబుద్ధిస్సమలోష్టకాంచనః
సమస్తభూతేషు సమస్సమాహితః ।
స్థానం పరం శాశ్వతమవ్యయం చ
యతిర్హి గత్వా న పునః ప్రజాయతే ॥

తా॥ విశుద్ధబుద్ధిగలవాడై మట్టిబెడ్డను, బంగారమును సమానముగా జూచుచు సమస్తభూతములయందు సమబుద్ధిగల యతి శాశ్వతమును, నాశరహితమును నగు పరమును పొంది మరల పునర్జన్మను పొందడు. అనగా మరల పుట్టడు.

శ్లో॥ వేదాచ్ఛ్రేష్ఠాః సర్వయజ్ఞక్రియాశ్చ
యజ్ఞాజ్జప్యం జ్ఞానమార్గం చ జప్యాత్ ।
జ్ఞానాద్ధ్యానం సంగరాగవ్యపేతం
తస్మిన్ప్రాప్తే శాశ్వతస్యోపలబ్ధిః ॥

తా॥ వేదములకంటె యజ్ఞక్రియలు శ్రేష్ఠమైనవి. యజ్ఞములకంటె జపము శ్రేష్ఠము. దానికంటె జ్ఞానమార్గము శ్రేష్ఠము. దానికంటె సంగము రాగములేని ధ్యానయోగము శ్రేష్ఠము. ధ్యానమునందు నిలకడకలిగి సిద్ధించినచో శాశ్వతమైన పరబ్రహ్మము పొందబడును.

శ్లో॥ సమాహితో బ్రహ్మపరోఽప్రమాదీ
శుచిస్తథైకాంతరతిర్యతేంద్రియః ।
సమాప్నుయాద్యోగమిమం మహాత్మా
విముక్తిమాప్నోతి తతః స్వయోగతః ॥

తా॥ సమస్తభూతములయందు సమచిత్తముగలవాడై, బ్రహ్మపరుడై, ప్రమాద రహితుడై, శుచియై, ఏకాంతవాసమునందిష్టముగలవాడై, నియమింపబడినయింద్రియములు గలవాడై మహాత్ముడైన యోగి యిట్టి యోగమునుపొంది దానివలన మోక్షమును పొందుచున్నాడు.

శ్లో॥ ఏవం యో వర్తతే యోగీ సమ్యగ్యోగవ్యవస్థితః ।
న స వ్యావర్తితుం శక్యో జన్మాంతరశతైరపి ॥

తా॥ బాగుగా యోగానుష్ఠానము గలిగి యెవడు యిట్లు ప్రవర్తించుచున్నాడో అట్టి యోగి నూరు జన్మములకైన మరలిరాడు.

శ్లో॥ దృష్ట్వా చ పరమాత్మానం ప్రత్యక్షం విశ్వరూపిణం ।
విశ్వపాదశిరోగ్రీవం విశ్వేశం విశ్వభావనమ్ ॥

తా॥ ప్రత్యక్షముగా జగద్రూపమున కనబడుచున్నటువంటివీన్ని, విశ్వరూపుడైనటువంటివీన్ని, అంతట పాదములు, శిరస్సులు, కంఠాములు గలిగినటువంటివీన్ని, విశ్వేశుడును, విశ్వభావనుడును అయిన పరమాత్మను చూచి యోగి మరల పునర్జన్మ నొందడు.

శ్లో॥ తత్ప్రాప్తయే మహత్పుణ్యమోమిత్యేకాక్షరం జపేత్ ।
తదేవాధ్యయనం తస్య స్వరూపం శృణ్వతః పరమ్ ॥

తా॥ ఆ పరబ్రహ్మప్రాప్తికొరకు మహాపుణ్యదాయకమును, ఏకాక్షరమగు ఓంకారమును జపించుము. అదే దానికి అధ్యయనము. ఇటుపైని ఆ ఓంకారస్వరూపమును చెప్పెదను వినుము.

శ్లో॥ అకారశ్చ తథోకారో మకారశ్చాక్షరత్రయం ।
ఏతాస్తిస్రః స్మృతా మాత్రాః సాత్త్వరాజసతామసాః ॥

తా॥ అకారము, ఉకారము, మకారము యీ మూడక్షరములు కలసి ఓంకారమగుచున్నది. ఈ మూడున్ను మాత్రలనియు, సత్త్వ, రాజస, తామసగుణసంబంధముగలవియనియు చెప్పబడుచున్నవి.

శ్లో॥ నిర్గుణా యోగిగమ్యాన్యా చార్ధమాత్రోర్ధ్వసంస్థితా ।
గాంధారీతి చ విజ్ఞేయా గాంధారస్వరసంశ్రయా ॥

తా॥ ఏ గుణమున్ను లేనిదయ్యె యోగి గమ్యమై అర్ధమాత్రాక్షర స్వరూపమై అన్నిటికంటె పరమైనదొకటిగలదు. గాంధారస్వరము నాశ్రయించుదానిని గాంధారి అని అందురు.

శ్లో॥ పిపీలికాగతిస్పర్శా ప్రయుక్తా మూర్ధ్ని లక్ష్యతే ।
యథా ప్రయుక్త ఓంకారః ప్రతినిర్యాతి మూర్ధని ॥

తా॥ చీమ వడకవంటి గమనస్పర్శగలదియై శిరస్సునందు ప్రయోగింపబడి కనబడుచున్నది. ఈ ఓంకారము శిరస్సునుండియే బయలుదేరుచున్నది.

శ్లో॥ తథోంకారమయో యోగీ త్వక్షరే త్వక్షరో భవేత్ ॥

తా॥ అప్పుడు ఓంకారమయుండగు యోగి అక్షరస్వరూపమునందు అక్షరుడగుచున్నాడు.

శ్లో॥ ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ వేధ్యమనుత్తమం।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥

తా॥ ఓంకారమే ధనుస్సు, ఆత్మయే బాణము, కొట్టవగిన లక్ష్యము పరబ్రహ్మము. సావధానముగా కొట్టవగినది. బాణమువలె తన్మయుడు కావలెను; అనగా తన్మయము కానిచో లక్ష్యమును భేదింపజాలడు; ఐక్యము నొందజాలడు.

శ్లో॥ ఓమిత్యేతత్త్రయో వేదాస్త్రయో లోకాస్త్రయోఽగ్నయః।
విష్ణుర్బ్రహ్మా హరశ్చైవ ఋక్సామాని యజూంషి చ।
మాత్రాః సార్ధాశ్చ తిస్రశ్చ విజ్ఞేయాః పరమార్థతః ॥

తా॥ ఓంకారమే మూడు వేదములు, ఓంకారమే మూడు లోకములు, మూడగ్నులు (ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులు)గూడ ఓంకారమే, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఓంకారము. ఇది సార్ధత్రిమాత్రకమని తెలిసికొనవలెను; అనగా మూడున్నరమాత్రలు గలది.

శ్లో॥ తత్ర యుక్తస్తు యో యోగీ స తల్లయమవాప్నుయాత్।
అకారస్త్వథ భూర్లోక ఉకారశ్చోచ్యతే భువః।
సవ్యంజనో మకారశ్చ స్వర్లోకః పరికల్ప్యతే ॥

తా॥ ఈ ఓంకారధ్యానమునందు ఆసక్తుడగు యోగి తత్ప్రతిపాదిత స్వరూపమగు పరబ్రహ్మమునందు లీనుడగుచున్నాడు. అకారము భూలోకమనియు, ఉకారము భువర్లోకమనియు, అర్ధమాత్రతోగూడుకొన్న మకారము స్వర్లోకమనియు కల్పన చేయబడినది.

శ్లో॥ వ్యక్తా తు ప్రథమా మాత్రా ద్వితీయాఽవ్యక్తసంజ్ఞికా।
మాత్రా తృతీయా చిచ్ఛక్తిరర్ధమాత్రా పరంపదమ్ ॥

తా॥ మొదటిమాత్ర వ్యక్తమనియు, రెండవది అవ్యక్తమనియు, మూడవది చిచ్ఛక్తియనియు, అర్ధమాత్రయే పరబ్రహ్మస్వరూపమనియు చెప్పబడెను.

శ్లో॥ అనేనైవ క్రమేణైతా విజ్ఞేయా యోగభూమయః।
ఓమిత్యుచ్చారణాత్సర్వం గృహీతం సదసద్భవేత్ ॥

తా॥ క్రమముగా పైజెప్పిన విధానము ననుసరించి యోగమార్గములు తెలిసికొనదగినవి. "ఓమ్" అని ఉచ్చరించుటవల్లనే సదసద్రూపమగు యీ సర్వము గ్రహింపబడుచున్నది.

శ్లో॥ హ్రస్వా తు ప్రథమా మాత్రా ద్వితీయా దైర్ఘ్యసంయుతా ।
తృతీయా చ ప్లుతార్ధాఖ్యా వచసః సా న గోచరా ॥

తా॥ హ్రస్వము ఏకమాత్రాకాలమనియు, దీర్ఘము ద్విమాత్రాకాలమనియు, ప్లుతము త్రిమాత్రాకాలమనియు చెప్పుదురు. అది వాక్కులకు గోచరముకానిది. అనగా సార్ధత్రిమాత్రాయుతమగు ఓంకారవాచ్యమగు పరబ్రహ్మము వాక్కుల కందనిదని యర్థము.

శ్లో॥ ఇత్యేతదక్షరం బ్రహ్మ పరమోంకారసంజ్ఞితం ।
యస్తు వేద నరః సమ్యక్తథా ధ్యాయతి వా పునః ॥
సంసారచక్రముత్సృజ్య త్యక్తత్రివిధబంధనః ।
ప్రాప్నోతి బ్రహ్మణి లయం పరమే పరమాత్మని ॥

తా॥ ఈ విధముగా నాశరహితమును, పరమమును, ఓంకారవాచ్యమును నగు బ్రహ్మమును యెవడు తెలిసికొనుచున్నాడో, యెవడు బాగుగా ధ్యానించుచున్నాడో, అట్టివాడు త్రివిధములగు (మనోవాక్కాయరూపములగు లేక స్థూల సూక్ష్మకారణ శరీరరూపములగు లేక ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములగు) బంధములనుండి విడివడినవాడై సంసారచక్రమును పరిత్యజించి పరమమైన పరబ్రహ్మమునందు, పరమాత్మయందు లయమును పొందుచున్నాడు.

శ్లో॥ ఏతత్సర్వం సమాఖ్యాతం తవాలర్క యథార్థవత్ ।
ప్రాప్స్యసే యేన తద్బ్రహ్మ సంక్షేపాత్తన్నిబోధ మే ॥

తా॥ ఓ యలర్కమహారాజా ! ఇంతవరకు నీవడిగినదంతయు యథార్థముగా చెప్పబడినది. అయినను విస్పష్టార్థము మరల నీవు దీనినడిగితివిగాన ఆ పరబ్రహ్మమును గూర్చి సంక్షేపముగా చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ శశాంకరశ్మిసంయోగాచ్చంద్రకాంతమణిః పయః ।
సముత్సృజతి నాయుక్తః సోపమా యోగినస్స్మృతా ॥

తా॥ చంద్రకిరణముల సంబంధమువలన చంద్రకాంతమణి జలమును స్రవించుచున్నది. చంద్రకిరణ సంయోగములేనిచో స్రవించుటలేదు. అట్లే పరబ్రహ్మ సంయోగము ఉన్ముఖము అయినప్పుడే జీవాత్మ మొదలు దేహాది సమస్తమును చైతన్యవంతమగుచున్నది. లేనిచో అంతయు జడప్రాయముగనే యున్నది. అంతేగాదు జీవాత్మకు పరమాత్మ సంయోగముగలిగినప్పుడే ప్రకాశస్వరూపమగుచున్నది. లేనప్పుడులేదు. ఈ

విషయమును యోగి తెలిసికొనినచో స్వస్థతను పొందగలడు. ఈ విషయము గ్రంథాంతరమునగూడ జూడనగును.

శ్లో॥ ముకురే రవిసంయోగాద్యథోద్గచ్ఛతి పావకః।
శిష్యానుభవనైర్మల్యం తథా సద్గురుసంగతః॥

" చంద్రకాంతమణిస్సోమం ద్రవతే చంద్రసన్నిధౌ।
శిష్యానుభవనైర్మల్యం తథా సద్గురుదర్శనాత్॥

వీటియొక్క తాత్పర్యము పైన వివరించినదే. అయితే గురుశబ్దము మాత్రము మార్పు. సద్గురు సంగతివలన శిష్యునకు నైర్మల్యమేర్పడుచున్నదనిభావము.

శ్లో॥ యథాఽర్కరశ్మిసంయోగాదర్కకాంతో హుతాశనం।
ఆవిష్కరోతి నైకస్సన్నుపమా సాపి యోగినః॥

తా॥ సూర్యకిరణసంపర్కమువలన సూర్యకాంతమణి అగ్నిని ఆవిష్కరించినట్లు పరమాత్మసంయోగమువలన జ్ఞానజ్యోతి ప్రజ్వలించుచున్నదని తెలిసికొనిన యోగి ఆ స్థితిని పొందుచున్నాడు. మరియు "సంగాత్సంజాయతే కామః" అనునట్లు సంగమమువలన కామక్రోధాదు లుత్పన్నములగుచున్నవని తెలిసికొనిన యోగి యేసంగమము లేక నిశ్చింతగా ఆనందమయుడై యుంటున్నాడని తాత్పర్యాంతరము.

శ్లో॥ పిపీలికాఖునకులగృహగోధాకపింజలాః।
వసన్తి స్వామివద్గేహే ధ్వస్తే యాన్తి తతోఽన్యతః॥

తా॥ చీమ, ఎలుక, ముంగిస, బల్లి, పిచ్చుక యీ మొదలగునవి గృహమునందు గృహయజమానునివలె నివసించుచున్నవి. ఏదైనా కారణాంతరముచేత ఆయిల్లు ధ్వంసమైపోయినచో, అవి వాటంతటవే అక్కడినుండి మరియొకచోటికి పోవుచున్నవి.

శ్లో॥ దుఃఖం తు స్వామినో ధ్వంసే తస్య తేషాం న కించన।
వేశ్మనో యత్ర రాజేంద్ర సోపమా యోగసిద్ధయే॥

తా॥ 'అయ్యో! నా యిల్లు ధ్వంసమైపోయినదే, నేనిప్పుడేమిచేయను' అను దుఃఖ మాయింటి యజమానికే కలుగుచున్నదిగాని పైవాటికి వేటికిని కలుగలేదు. కారణమేమి? అహంత్వ, మమత్వజనిత కర్తృత్వబుద్ధి వాటికిలేదు. అందువలన యోగసిద్ధి నొందగోరువాడు దానిని జ్ఞాపకమునం దుంచుకొనవలెను. నాది అని ఒక నివాసము నేర్పరచుకొని దానిని వదలలేక పరమును జూడవలెననెడి కోరిక చావక బాధపడువా రెందరో గలరు. ఈ ఉదాహరణమును ఆత్మవిషయమునందును జూడవచ్చును. విషయలంపటుడు యేకాంతము నొందజాలడు. మమత్వమే బంధము, మమత్వశూన్యమే మోక్షమని పై సంఘటనవలన గ్రహించి యోగి సుఖముగా నుంటున్నాడు.

మరియు ఈ శరీరమున్నంతవరకు దాని నాశ్రయించుకొని భార్యాబిడ్డలు మెంద లగువారుందురు. అది నశించినతోడనే యెవరి దారిని వారు పోయెదరు. ఆ శరీరనాశము వలన కలిగిన దుఃఖము జీవునకే. ఎందువల్లననగా "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని వున్నందున శరీరము ధర్మసాధనము గాన అది లేదనెడి దుఃఖము జీవునకు గలుగుచున్నది.

శ్లో॥ మృద్దేహికాల్పదేహోపి ముఖాగ్రేణాప్యణీయసా।
కరోతి మృద్భారచయముపదేశస్స యోగినః॥

తా॥ చదపురుగు చిన్న దేహము గలిగినదైనను మిక్కిలి అల్పమగు తన నోటితో చిన్న చిన్న అణువులను సమకూర్చి పెద్దపుట్టను పెట్టుచున్నది. అట్లే యోగి మొట్ట మొదట చిన్న చిన్న అనుష్ఠానములను మెల్ల మెల్లగా చేయుచూ చేయుచూ, తుదకు పరమమగు ఆత్మను పొందుచున్నాడు. "శనైశ్శనైరుపరమేత్" అనగా క్రమ క్రమముగా ప్రయత్నము చేసి అభ్యాసపరిశ్రమలవలన పరవస్తువును పొందవలెనని భావము. ఇందుకు — "ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్॥"
అని గీతాప్రమాణము.

శ్లో॥ పశుపక్షిమనుష్యాద్యైః పత్రపుష్పఫలాన్వితం।
వృక్షం విలుప్యమానం తు దృష్ట్వా సిధ్యంతి యోగినః॥

తా॥ పశువులు, పక్షులు, మనుష్యులు మొదలగు అన్నింటికి వుపయోగపడుట వలన వృక్షము స్వయముగా నెట్లు లుప్తమగుచున్నదో, అనగా యేమియు లేనిదగు చున్నదో, అనగా పరోపయోగముకొరకే తాను జీవించుచున్నదో, అట్లే యోగియు "పరోపకారార్థమిదం శరీర"మని తలంచి లోకసేవాతత్పరుడయి తరించుచున్నాడు.

లేదా పశు పక్షి మనుష్యాదులతోగూడ ఫల పత్ర పుష్ప సమన్వితమగు వృక్షము నశించుటను జూచి (వృక్షము యేకదేశము) అనగా సమస్తము నశించుటను జూచి యోగి సిద్ధిని పొందుచున్నాడు అన్నియు నశ్వరములని తలంచి శాశ్వతము నాశ్రయించు చున్నాడని అర్థము.

లేక ఒకప్పుడు ఫల పుష్పములతో నున్నదైనను, నశించుచున్న వృక్షమును పశు పక్షి మనుష్యాదులు విడిచిపోవునట్లు, క్షీణదశను పొందినవానిని దారాపుత్రాదులు విడిచి పోవుచున్నారు. అట్లే శరీరమును జీవుడు విడిచివెళ్లుచున్నాడు. దీనిని యోగి గమనించి సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో॥ రురుశాబవిషాణాగ్రమాలక్ష్యోతిలకాకృతిం।
సహతే న వివర్ధంతం యోగీ సిద్ధిమవాప్నుయాత్॥

తా॥ మొదట తిలకమువలె (చుక్క బొట్టు) కనబడుచున్న కృష్ణసారమృగము (జింక) పిల్లయొక్క కొమ్ముల మొనభాగమును మానవుడు సహించుచున్నాడు గాని ఆ కొమ్ములే పెరిగి వాడియైనచో సహింపజాలడు. అట్లే సంసారము ప్రారంభదశలో సుఖముగా నున్నట్లు తోచినందున సహించును గాని అది పెద్దదై విజృంభించునప్పుడు సహింపజాలడు. "విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్" – గీత. యోగి దీనిని తెలుసుకొని సంసారదూరుడై సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో॥ ద్రవపూర్ణమృదాద్యైః పాత్రభారో మహాతో భువః।
తుంగమంగం విలోక్యోచ్చైర్నిర్విజ్ఞాతం కిం న యోగినా॥

తా॥ జలాదులతో నిండించబడిన పాత్రను పైకెత్తికొనిపోవుటకు మానవుడు చాల కష్టపడుచున్నాడు. అదేవిధముగ యీ సంసారభారముచేత కృంగిపోయినవాడు పరబ్రహ్మస్థానమును పొందజాలడు. దీనిని యోగి యెందుకు తెలిసికొనడు? అనగా తెలుసుకొనినచో సిద్ధిని పొందుచున్నాడని అర్థము.

మరియు భూమి సకల జలభారమును నిరాయాసముగా వహించుచున్నది. ఒక్క కుండజలమును మోయుటకే మానవుడు యెంతో ప్రయాస నొందుచున్నాడు. అట్లే పరబ్రహ్మమునందు అన్నియు లయమగుచున్నవి. దానికంటె భిన్నమగుచో సంసారము భారమే యగుచున్నది. అనగా బ్రహ్మమునందు లయమగువానికి సంసారభారమే తోచదు అని భావము.

శ్లో॥ సర్వస్వే జీవనాయాలం నిఖాతే పురుషస్య యా।
చేష్టాం తాం తత్త్వతో జ్ఞాత్వా యోగినః కృతకృత్యతా॥

తా॥ నూతిలోపడిన మనుష్యుడెట్లు దానినుండి బయటపడుటకు పలువిధములగు ప్రయత్నములను చేయుచున్నాడో, అట్లే సంసారకూపమున పడినవాడు ప్రయత్నముతో బయటపడవలయునని తెలుసుకొని యోగి సిద్ధిని పొందుచున్నాడు.

లేదా శ్రమపడి నూతిని త్రవ్వినవాడు ఆ జలమువలన సర్వసస్యములను పండించి యెట్లు సుఖించుచున్నాడో, అట్లే పారమార్థికధనమును సంపాదించువాడు సుఖించుచున్నాడని తెలుసుకొని యోగి సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో॥ తద్గృహం యత్ర వసతి తద్భోజ్యం యేన జీవతి।
యేన సంపద్యతే చార్థః తత్సుఖం మమతాఽత్ర కా॥

తా॥ ఎక్కడ తాను నివసించునో అదే యోగికి గృహము. దేనిచేత జీవితమును నిలువబెట్టుకొనుచున్నాడో అదే అతనికి భోజనము. దేనిచేత తనకు కావలసిన ప్రయోజనమును పొందుచున్నాడో, నిర్విషయస్థితిని పొందుచున్నాడో అదే అతనికి సుఖము. ఇక్కడ మమత్వమునకు తావెక్కడ?

శ్లో॥ అభ్యర్థితోఽపి తైః కార్యం కరోతి కిరణై ర్యథా।
తథా బుద్ధ్యాదిభిర్యోగీ పారక్యైః సాధయేత్పరమ్॥

తా॥ తనకు అవసరము వచ్చినప్పుడు కరచరణాద్యవయవములచేతను, ఇతర పని ముట్లచేతను యెట్లు తన కార్యము నెరవేర్చుకొనుచున్నాడో, అట్లే యోగి తనకంటె భిన్నములైన బుద్ధ్యాదీంద్రియములచేత పరమును సాధించవలెను.

శ్లో॥ తతః ప్రణమ్యాత్రిపుత్రమలర్కస్స మహీపతిః।
ప్రశ్రయావనతో వాక్యమువాచాతిముదాన్వితః॥

తా॥ ఇట్లు చెప్పగా విని ఆ యలర్కమహారాజు దత్తాత్రేయమునీంద్రులకు నమస్కరించి వినయవినమితుడై సంతోషముతో నిట్లు చెప్పెను.

శ్లో॥ దిష్ట్యా దేవై రిదం బ్రహ్మన్పరాభిభవసంభవం।
ఉపపాదితమత్యుగ్రం ప్రాణసందేహాదం భయమ్॥
దిష్ట్యా మందబలశ్చాహం దిష్ట్యా భృత్యాశ్చ మే హతాః।
దిష్ట్యా కోశః క్షయం యాతో దిష్ట్యాఽహం భీతిమాగతః॥
దిష్ట్యా త్వత్పాదయుగళం మమ స్మృతిపథం గతం।
దిష్ట్యా త్వదుక్తయస్సర్వా మమ చేతసి సంస్థితాః॥

తా॥ పరబ్రహ్మస్వరూపుడవగు నో మహాత్మా! అదృష్టవశముచేతనే శత్రువులచేత నాకు పరాభవము కలుగుటయేగాక భయంకరమైన ప్రాణసందేహభయముగూడ గలిగినది. అదృష్టవశమువల్లనే నా సైన్యములన్నియు నశించిపోవుట, పరివారమంతయు శత్రువశమగుట, నా కోశాగారముగూడ నశించిపోవుట, నాకు మిక్కిలి భయము గలుగుట జరిగినది. ఆ యదృష్టవిశేషమువల్లనే తమ పాదములు నాకు జ్ఞప్తికి వచ్చినవి. తమచేత ఉపదేశింపబడిన వాక్యములన్నియు మనస్సునందు సుస్థితములై పోయినవి.

శ్లో॥ దిష్ట్యా జ్ఞానం మమోత్పన్నం భవతశ్చ సమాగమాత్।
భవతశ్చైవ కారుణ్యం దిష్ట్యా బ్రహ్మన్ కృతం మయి॥

తా॥ తమను ఆశ్రయించినందువల్ల నాకు జ్ఞానోదయమగుట, తమయొక్క కరుణ నాపైని ప్రసరించుట అదృష్టవశమువల్లనేగదా కలిగినది.

శ్లో॥ అనర్థోఽప్యర్థతాం యాతి పురుషస్య శుభోదయే।
తథేదముపకారాయ వ్యసనం సంగమాత్తవ॥

తా॥ పురుషునకు శుభోదయము గలిగినప్పుడు కీడుగూడ మేలే యగుచున్నది. కాలసర్పము పూలమాలయగును. చంపబడుటకు సిద్ధముగా నున్నవాడు సామ్రాజ్యాధిపతి యగును ఇట్టి వెన్నియో లోకమున కనబడుచున్నవి. ఇప్పుడు నా విపత్తుగూడ

అంతే. నాకు గలిగిన యీ విపత్తు తమ అనుగ్రహమువలన ఉపకారముకొరకే అయినది. లేనిచో తమను నేను ఆశ్రయించుటయు, నాకు దుఃఖోపశమనమగుటయు జరుగునా? నన్ను తపింపజేయుచున్న యీ తాపత్రయ దావాగ్ని తమ ఉపదేశామృత వృష్టివలన గాక వేరు విధముగా చల్లారునా?

శ్లో॥ సుబాహురుపకారీ మే స చ కాశీపతిః ప్రభో।
తయోః కృతేఽహం సంప్రాప్తో యోగీశ భవతోఽన్తికమ్॥

తా॥ ఓ ప్రభూ! యోగీశ్వరా! సుబాహువు, కాశీరాజు యిరువురును నాకు మహోపకారులు. వారిరువురివలననే నాకు తమ దర్శనభాగ్యము లభించినది.

శ్లో॥ సోఽహం తవ ప్రసాదాగ్నిన్నిర్దగ్ధాజ్ఞానకిల్బిషః।
తథా యతిష్యే యేనేదృఙ్ న భూయాం దుఃఖభాజనమ్॥

తా॥ తమ యనుగ్రహమును పొందిన నేను దహింపజేయబడిన సమస్తపాపములును అజ్ఞానమును గలవాడనై, మరల యిటువంటి దుఃఖమునకు మరెన్నటికిని భాజనుడను గాకుండునట్లు ప్రయత్నింతును.

శ్లో॥ పరిత్యక్ష్యే గార్హస్థ్యమార్తిపాదపకాననం।
త్వత్తోఽనుజ్ఞాం సమాసాద్య జ్ఞానదాతుర్మహాత్మనః॥

తా॥ జ్ఞానదాతలును మహాత్ములునగు తమయొక్క అనుజ్ఞనుపొంది దుఃఖమనే వృక్షములకు అరణ్యమువంటిదగు యీ గృహస్థాశ్రమమును విడిచిపెట్టుదును.

అలర్కుడు తత్త్వజ్ఞానమును పొంది దత్తాత్రేయమునీంద్రునిచేత అనుజ్ఞాతుడై కాశీరాజుకడకు వచ్చుట

దత్తాత్రేయ ఉవాచ = దత్తాత్రేయ మునీంద్రుడు చెప్పెను.

శ్లో॥ గచ్ఛ రాజేంద్ర భద్రం తే యథా తే కథితం మయా।
నిర్మమో నిరహంకార స్తథా చర విముక్తయే॥

తా॥ రాజా! ఇక నీవు వెళ్లవచ్చును. నీకు శుభమగుగాక! ముక్తుడను గావలయు ననెడి దృఢసంకల్పము నీకున్నచో నిర్మముడవును, నిరహంకారుడవునై నేను చెప్పిన దానిని మరువక నిరంతరము ఆచరింపుము.

శ్లో॥ ఏవముక్తః ప్రణమ్యైనమాజగామ త్వరాన్వితః।
యత్ర కాశీపతిర్భ్రాతా సుబాహుశ్చాస్య సోఽగ్రజః॥

తా॥ ఇట్లు దత్తాత్రేయమునీంద్రునిచేత చెప్పబడినవాడై, ఆ దత్తాత్రేయమునీంద్రునకు నమస్కరించి శెలవునైకొని మిక్కిలి తొందరతో కాశీరాజును, తన అన్నయగు సుబాహువును వున్నచోటికి వచ్చెను.

శ్లో॥ సముత్పత్య మహాబాహుం సోఽలర్కః కాశిభూపతిం ।
సుబాహోరగ్రతో వీరమువాచ ప్రహసన్నివ ॥

తా॥ ఇట్లు వచ్చి మహాబాహువగు కాశీరాజును సమీపించి తన అన్నయగు సుబాహువు వినుచుండగా కాశీరాజుతో నవ్వుచూ యిట్లనెను.

శ్లో॥ రాజ్యకాముక కాశీశ భుజ్యతాం రాజ్యమూర్జితం ।
యథా చ రోచతే తద్వత్సుబాహోః సంప్రయచ్ఛ వా ॥

తా॥ రాజ్యము కావలెననెడి కోరికగల ఓ కాశీరాజా! లభ్యమగుచున్న యీ రాజ్యము నీకెట్లు యిష్టమగునో అట్లు యథేచ్ఛముగా ననుభవింపుము, లేదా తనకు కావలెనని కోరుచున్న సుబాహువునకైనా యిమ్ము.

కాశీరాజ ఉవాచ = కాశీరాజు చెప్పెను.

శ్లో॥ కిమలర్క పరిత్యక్తం రాజ్యం తే సంయుగం వినా ।
క్షత్రియస్య న ధర్మోఽయం భవాంశ్చ క్షత్రధర్మవిత్ ॥

తా॥ ఓ అలర్కమహారాజా! యుద్ధము చేయకుండగనే రాజ్యము నిచ్చివేయు చున్నావెందులకు? ఇట్లు చేయుట క్షత్రియధర్మము కాదని రాజనీతికోవిదుడవును, క్షత్రియవంశసంజాతుడవగు నీకు తెలియనిదికాదుగదా!

శ్లో॥ నిర్జితామాత్యవర్గస్తు త్యక్త్వా మరణజం భయం ।
సందధీత శరం రాజా లక్ష్యముద్దిశ్య వైరిణమ్ ॥

తా॥ భృత్యామాత్యసామంతాది నిజబలము పోయిన పిదప పౌరుషవంతుడగు రాజు మరణభీతిని విడచి ప్రాణములయందాశగొనక తన లక్ష్యసిద్ధికై శత్రువుపైకి కత్తి దూయవలెను.

శ్లో॥ తం జిత్వా నృపతిర్భోగాన్యథాభిలషితాన్ వరాన్ ।
భుంజీత పరమం సిద్ధ్యై యజేత చ మహామఖః ॥

తా॥ అట్లు శత్రువు నెదుర్కొని వానిని జయించి తానిదివరకు అభిలషించిన భోగములను యథేష్టముగా ననుభవింపవలెను. పరలోకసిద్ధికొఱకు యజ్ఞాదులను చేయవలెను. ఇప్పుడు నీమతము దీనికంటె భిన్నముగానుండుట మిగుల ఆశ్చర్యము.

అలర్క ఉవాచ = అలర్కుడు చెప్పెను.

శ్లో॥ ఏవమేవాద్భుతకం వీర మమాప్యాసీన్మనః పురా ।
సాంప్రతం విపరీతార్థం శృణు చాప్యత్ర కారణమ్ ॥

తా॥ వీరుడవగు నో కాశీరాజా! నీవు చెప్పిన అభిప్రాయము నాకుగూడ పూర్వ ముండెడిది. కాని ఇప్పుడంతయు తల్లక్రిందులైనది. అట్లగుటకు కారణమేమో వినుము.

అలర్కుడు కాశీరాజునకు తత్త్వమార్గమును దెలుపుట

శ్లో॥ యథాఽయం భౌతికః సంఘస్తథాఽంతఃకరణం నృణాం।
గుణాస్తు సకలాస్తద్వదశేషేష్వేవ జంతుషు॥

తా॥ ఎట్లు మానవులకు పంచభూతములు, వాటివలన యేర్పడిన తత్త్వములు, గుణములు, అంతఃకరణము మొదలగునవి గలవో, అట్లే అవి ప్రతిప్రాణికిని గలవు. అయితే అవి ఉపాధి కర్మభేదములవలన భిన్నభిన్నములుగా కనబడుచున్నవి.

శ్లో॥ చిచ్ఛక్తిరేక ఏవాయం యదా నాన్యోఽస్తి కశ్చన।
తదా కా నృపతే జ్ఞానాన్మిత్రారిప్రభుభృత్యతా॥

తా॥ అయితే యీ భిన్నభిన్న ఉపాధులలోగల చిచ్ఛక్తి ఒకటే అనెడి జ్ఞానము యెప్పుడు కలిగినదో అప్పుడు మిత్రుడని, శత్రువని, ప్రభువని, భృత్యుడనెడి భావమునకు తావెక్కడ?

శ్లో॥ తన్మయా దుఃఖమాసాద్య త్వద్భయోద్భవముత్తమం।
దత్తాత్రేయప్రసాదేన జ్ఞానం ప్రాప్తం నరేశ్వర॥

తా॥ ఓ మహారాజా! నీనుండి కలిగిన భయమువల్లనైన దుఃఖమే అటువంటి జ్ఞాన ప్రాప్తికి కారణమైనది. మహాత్ముడగు దత్తాత్రేయయతీంద్రుని అనుగ్రహమువలన అది నాకు లభ్యమైనది.

శ్లో॥ నిర్జితేంద్రియవర్గస్తు త్యక్త్వా సంగమశేషతః।
మనో బ్రహ్మణి సంధాన్య తజ్జయే పరమో జయః॥

తా॥ సర్వేంద్రియవర్గమును నిగ్రహించి, సర్వసంగ పరిత్యాగియై మనస్సును పరబ్రహ్మమునందనుసంధించి దానిని జయించినవాడే సకలమును జయించినవాడు. అంతే గాని తక్కిన రాజ్యాది విజయము ఒక జయముగాదు.

"తర్షంతి భూరివిషయాశ్చ న లోభపాశాః
లోకత్రయం జయతి కృత్స్నమిదం స ధీరః" — భర్తృహరి.

శ్లో॥ సంసాధ్యమన్యత్తత్సిద్ధ్యై యతః కించిన్న విద్యతే।
ఇంద్రియాణి చ సంయమ్య తతః సిద్ధిం నియచ్ఛతి॥

తా॥ ఆ సిద్ధికొరకు ఇంద్రియమనోనిగ్రహము తప్ప వేరొక సాధనములేదు. కావున నే యోగి ఇంద్రియమనంబులను వశపరచుకొని తద్ద్వారా సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో॥ సోఽహం న తేఽరిర్న మమాసి శత్రు
స్సుబాహురేషో న మమాపకారీ।
దృష్టం మయా సర్వమిదం యథాత్మా
అన్విష్యతాం భూప రిపుస్త్వయాఽన్యః॥

తా॥ అందువలన నోరాజా! నిజపరిస్థితిని తెలుసుకొన్న నేను నీకు శత్రువును గాను; నీవును నాకు శత్రువుకావు; ఈ సుబాహువును నాకపకారిగాడు. సర్వమును ఆత్మవలె చూచుచున్న నేనేమియు చేయజాలను. కావున అవసరమైనచో నీవింకొక శత్రువును వెదకికొనవచ్చును.

శ్లో॥ ఇత్థం స తేనాభిహితో నరేంద్రో
హృష్టః సముత్థాయ తతః సుబాహుః।
దిష్ట్యేతి తం భ్రాతరమాభినంద్య
కాశీశ్వరం వాక్యమిదం బభాషే॥

తా॥ ఇట్లు అలర్కుడు చెప్పినదానిని విని కాశీరాజు మిక్కిలి సంతుష్టాంతరంగుడయ్యెను. వెంటనే సుబాహువు లేచి "దైవమనుకూలించుగాక" యని తమ్ముని అభినందించి కాశీరాజుతో నిట్లు చెప్పెను.

సుబాహువు తన నిజకథనమును జెప్పుట

శ్లో॥ యదర్థం నృపశార్దూల త్వామహం శరణం గతః।
తన్మయా సకలం ప్రాప్తం యాస్యామి త్వం సుఖీ భవ॥

తా॥ నృపశ్రేష్ఠుడవగు నోరాజా! ఎందుకొరకు నిన్ను నేను ఆశ్రయించితినో, ఆ పనంతయూ పూర్తి అయినది. ఆ ఫలమును నేను పొందితిని. ఇక నేను పోయెదను, నీవు సుఖముగా నుండుము.

కాశిరాజ ఉవాచ = కాశిరాజు చెప్పెను.

శ్లో॥ కిన్నిమిత్తం భవాన్ప్రాప్తో నిష్పన్నోఽర్థశ్చ కస్తవ।
సుబాహో తన్మమాచక్ష్వ పరం కౌతూహలం హి మే॥

తా॥ ఓ సుబాహూ! ఎందుకొఱకు నీవు నన్నాశ్రయించితివి? నీకిప్పుడు గలిగిన ప్రయోజనమేమి? ఇదేమియు నాకర్థమగుటలేదు. దీనిని తెలిసికొనుటకు కుతూహలము గల నాకు దీనిని వివరింపుము.

శ్లో॥ సమాక్రాంతమలర్కేణ పితృపైతామహం మహత్ ।
రాజ్యం దేహీతి నిర్జిత్య త్వయాఽహామభిచోదితః ॥

తా॥ "అయ్యా! వంశపరంపరగా మా తాతతండ్రులనుండి వచ్చుచున్న గొప్పదగు రాజ్యమును మాతమ్ముడగు అలర్కుడొక్కడే ఆక్రమించుకొని అనుభవించుచున్నాడు. మాటలతో నిచ్చుటకు యిష్టపడునట్లులేదు. కాన వానిపై దండెత్తి జయించి నా రాజ్యమును నాకిమ్ము" అనిగదా ముందు నీవు నన్ను ప్రేరేపించితివి.

శ్లో॥ తతో మయా సమాక్రమ్య రాజ్యమస్యానుజస్య తే ।
ఏతత్తే బలమానీతం తద్భుంక్ష్వ స్వకులోచితమ్ ॥

తా॥ అట్లు నీవు చెప్పినందువలన నీతమ్మునిపై దండెత్తి జయించి సమస్తమును స్వాధీనము చేసుకొనబడినది. కావున దీనిని యథేష్టముగా ననుభవింపుము. ఇది క్షత్రియకులోచిత ధర్మమేగదా.

సుబాహురువాచ = సుబాహువు చెప్పెను.

శ్లో॥ కాశిరాజ నిబోధ త్వం యదర్థమయముద్యమః ।
కృతో మయా భవాంశ్చైవ కారితోఽత్యన్తముద్యమమ్॥
భ్రాతా మమాయం గ్రామేషు సక్తో భోగేషు తత్త్వవిత్ ।
విమూఢో బోధవంతౌ చ భ్రాతరావగ్రజౌ మమ ॥

తా॥ ఓ రాజా! ఎందుకొరకు నాచేత యీ వుద్యమము ప్రారంభింపబడినదో నిన్నుగూడ యెందుకు ప్రేరేపించితినో చెప్పెదను వినుము. నా సోదరుడగు నీతడు తెలిసినవాడయ్యును, పామరములగు భోగములయందు నిమగ్నుడైపోయెను. తత్త్వజ్ఞానసంపన్నులగు మరిద్దరు అన్నలుగూడ నాకున్నారు.

శ్లో॥ తయోర్మమ చ యన్మాత్రా బాల్యే స్తన్యం యథా ముఖే ।
తథావబోధో విన్యస్తః కర్ణయోరావనీపతే ॥

తా॥ ఓ రాజా! ఆ నాఅన్నలకు నాకుగూడ మాతల్లి బాల్యములోనే, మేము స్తన్యపానము చేయుచున్నప్పుడే, మా చెవులలో తత్త్వావబోధము చేయుచుండెడిది.

శ్లో॥ తయోర్మమ చ విజ్ఞేయాః పదార్థా యే మతా నృభిః ।
ప్రకాశ్యం మనసో నీతా స్తే మాత్రా నాస్య పార్థివ ॥

తా॥ ఆ ప్రబోధమువలన వారికి నాకుగూడ సాధారణముగా జనులు అనుభవించుటకు ఉవ్విళ్లూరుచున్న యీ ప్రాపంచికవిషయములయొక్క సత్తా తెలిసిపోయినది.

ఇట్లు మనోవికాసము గలిగి నిజతత్త్వమును తెలిసికొనునట్లు మా తల్లి మమ్ములను చేసినది. కాని యీతనినిమాత్ర మట్లు చేయలేదు.

శ్లో॥ యత్రైకమర్థే యాతానామేకస్మిన్నవసీదతి ।
దుఃఖం భవతి సాధూనాం తథాఽస్మాకం మహీపతే ॥

తా॥ ఒక్క ప్రయోజనము నుద్దేశించి అందరు కలసిపోవుచు నేదైన కారణాంతర ముచే నందులో నొకడు విపన్నుడగుచో, సహృదయులగు సాధుపురుషు లెట్లు చింతింతురో, అట్లే యీతనినిగూర్చియు మాకు దుఃఖము, బాధ కలిగినది.

శ్లో॥ గార్హస్థ్యమోహమాపన్నే సీదత్యస్మిన్నరేశ్వర ।
సంబంధిన్యస్య దేహస్య బిభ్రతి భ్రాతృకల్పనామ్ ॥

తా॥ ఓ రాజా! శరీరసంబంధముగా నాకు సోదరుడగు నీతడు సాంసారిక మోహమునందుబడి తన స్థితిని మరచిపోయినవాడగుచుండగా అది నా కెంతో జాలిని గలిగించినది.

శ్లో॥ తతో మయా వినిశ్చిత్య దుఃఖాద్వైరాగ్యభావనా ।
భవిష్యతీత్యస్య భవానిత్యుద్యోగాయ సంశ్రితః ॥

తా॥ అప్పుడు నేను యీతనికి గొప్ప విపత్సంబంధమైన దుఃఖమువలనగాని వైరాగ్యము జనించదని విశ్చయించి నీ మూలమున నీ కార్యము కాగలదని నిన్నాశ్రయించితిని.

శ్లో॥ తదస్య దుఃఖాద్వైరాగ్యం సంబోధాదవనీపతే ।
సముద్భూతం కృతం కార్యం భద్రం తేఽస్తు వ్రజామ్యహమ్ ॥

తా॥ నా మాటచే నీవీతనిపై దండెత్తుటవలనను, యీతనికి కష్టముతోచి దత్తాత్రేయమునీంద్రు నాశ్రయించి వారివలన ప్రబోధింపబడుటవలనను సంపూర్ణవైరాగ్యము కలిగినది. నేననుకున్న కార్యము నెరవేరినది. ఇక నీకు శుభమగుగాక! నేను పోవుచున్నాను.

శ్లో॥ ఉష్ట్వా మదాలసాగర్భే పీత్వా తస్యాస్తథా స్తనం ।
నాన్యనారీ సుతైర్యాతం వర్త్మ యాత్వితి పార్థివ ॥

తా॥ మా తల్లియగు మదాలసాగర్భమునందు బుట్టి, ఆమె స్తన్యమును పానము చేసిన మీరు యితర స్త్రీలగర్భమునందు పుట్టినవారు పోయిన మార్గమును పొందకుందురుగాక! (అనగా మరల గర్భయాతన ననుభవింపకుందురుగాక! అని భావము).

శ్లో॥ విచార్య మాతుర్వచనం యుష్మత్సంశ్రయపూర్వకం ।
కృతం తచ్చాపి నిష్పన్నం ప్రయాస్యే సిద్ధయే పునః ॥

తా॥ మాతల్లి చెప్పుచుండు యీ వాక్యమును విచారించియు, నాకుగూడ నా సోదరుడు యిట్టి దుర్గతిని పొందకూడదని తలంపు గలిగినందువను నిన్నాశ్రయించి నీ ద్వారా యీ పనిని నెరవేర్చితిని. ఇక నేను తపస్సు చేసికొనుటకు పోవుచున్నాను.

శ్లో॥ ఉపేక్షతే సీదమానః స్వజనో బాంధవస్సుహృత్ ।
యైర్నరేంద్ర న తాన్మన్యే సేంద్రియా వికలా హి తే ॥

తా॥ స్వజనముగాని (శరీరసంబంధిగాని), బంధువుగాని లేక మిత్రుడుగాని చెడి పోవునపుడు యెవరు వుపేక్ష చేయుదురో (యెవరు వారిని మంచిస్థితికి తీసికొనివచ్చుటకు ప్రయత్నించరో) అట్టివారు ప్రాణేంద్రియములతో గూడుకొన్న శవములు.

శ్లో॥ సుహృది స్వజనే బంధౌ సమర్థే యోఽవసీదతి ।
ధర్మార్థకామమోక్షేభ్యో వాచ్యాస్తే తత్ర న శ్వసా ॥

తా॥ ధర్మార్థ కామ మోక్షములనుండి దిగజారిపోవుచున్న స్నేహితునిగాని, స్వజనమునుగాని, బంధువునుగాని మంచిమార్గమున పెట్టుటకు సమర్థులయ్యును యెవరు వుపేక్షింతురో, ఆ దోషము వారిదిగాని, చెడిపోవువారిదిగాదు.

శ్లో॥ ఏతత్త్వత్సంగమాద్భూప మయా కార్యం మహత్కృతం ।
స్వస్తి తేఽస్తు గమిష్యామి జ్ఞానభాగ్భవ సత్తమ ॥

తా॥ రాజా ! నీ సహకారమువలన యీ గొప్పకార్యము నాచేత చేయబడినది. ఇక నా పని తీరిపోయినది. నీకు శుభమగుగాక ! నీవుగూడ జ్ఞానమునందు వంతును పంచుకొందువుగాక ! ఇక నేను పోయెదను.

కాశీరాజ ఉవాచ = కాశీరాజు చెప్పెను.

శ్లో॥ ఉపకారస్త్వయా సాధోరలర్కస్య కృతో మహాన్ ।
మమోపకారాయ కథం న కరోషి స్వమానసమ్ ॥

తా॥ మహాశయా ! సత్పురుషుడగు అలర్కునకు నీచేత యిట్టి మహోపకారము చేయబడినది. మరి నా విషయమై అట్టి వుపకారము చేయుటకు నీకేల మనస్సు పుట్టలేదు?

శ్లో॥ ఫలదాయీ సతాం సద్భిః సంగమో నాఫలోదయః ।
తస్మాత్త్వత్సంశ్రయాద్యుక్తా మయా ప్రాప్తా సమున్నతిః ॥

తా॥ సజ్జనసాంగత్యము తప్పక వుత్తమఫలము నిచ్చితీరును. అదెప్పుడునూ ఫలమును కలుగజేయకుండాపోదు. కావున సత్పురుషులగు మీ సహవాసము నా యున్నతికి కారణమనుట యుక్తము.

సుబాహురువాచ = సుబాహువు చెప్పెను.

శ్లో॥ ధర్మార్థకామమోక్షాఖ్యం పురుషార్థచతుష్టయం ।

తత్ర ధర్మార్థకామా స్తే సకలో హేయ తేఽపరః ॥

తా॥ ధర్మార్థకామమోక్షములని పురుషార్థములు నాలుగు. అందు ధర్మార్థకామములు మూడున్ను చివరిదగు మోక్షమును కించపరచుచున్నవి. (మోక్షమునకు అడ్డుదగులుచున్నవి.)

శ్లో॥ తత్తే సంక్షేపతో వక్ష్యే తదిహైకమనాః శ్రుణు ।
శ్రుత్వా చ సమ్యగాలోచ్య యతేథాః శ్రేయసే నృప ॥

తా॥ ఆ విషయమును సంక్షేపముగా చెప్పుచున్నాను. తదేకధ్యానముతో వినుము. విని బాగుగా ఆలోచించి శ్రేయస్సుకొరకు యత్నింపుము.

శ్లో॥ మమేతి ప్రత్యయో భూప న కార్యోఽహామితి త్వయా ।
సమ్యగాలోచ్య ధర్మో హి ధర్మాభావే నిరాశ్రయః ॥

తా॥ "నాది" అనెడి దృఢభావమునకు మూలమైన అహంకారమును మొదట నిర్మూలింపుము. బాగుగా ఆలోచించి విచారణచేసినప్పుడే ధర్మము స్థిరత్వమును పొందుచున్నది. అధర్మముచేత ధర్మము తిరస్కరింపబడుచో యిక ధర్మమునకు ఆశ్రయముండదు.

శ్లో॥ కోవాఽహామితి సంజ్ఞేయమిత్యాలోచ్య త్వయాత్మనా ।
బాహ్యాంతర్గతమాలోచ్యమాలోచ్యావరరాత్రిషు ॥
అవ్యక్తాదివిశేషాంతమవికారమచేతనం ।
వ్యక్తావ్యక్తం త్వయా జ్ఞేయం జ్ఞాతా కశ్చాహమిత్యుత ॥

తా॥ నేనెవడను? ఈ నేననెడి సంజ్ఞ యెట్లు వచ్చినది? బాహ్యమునందేమున్నది? ఆంతరముననుండునదేది? అవ్యక్తమేది? దానికంటె విశేషమైనదేది? ఇట్లు వ్యక్తావ్యక్తమై అవికారమును, అచేతనమును నగు వస్తువు నీవు తెలిసికొనదగినది. జ్ఞాత యెవడు? జ్ఞాత నేనేనా? లేక నాకంటె భిన్నుడా? అను నీ మొదలుగాగల విషయములు తెలుసుకొనదగినవి.

శ్లో॥ ఏతస్మిన్నేవ విజ్ఞాతే విజ్ఞాతమఖిలం త్వయా ।
అనాత్మన్యాత్మవిజ్ఞానం అస్వే స్వమితి మూఢతా ॥

తా॥ ఇంతమాత్రము యీ పైనిజెప్పిన విషయములు తెలిసికొనినచో యిక సమస్తమూ తెలియబడినట్లేయగును. అట్లుగాక అనాత్మవస్తువిషయమై ఆత్మభావము చేయుట, తనది కానిదానిని తనదని అనుకొనుటవంటిది. ఇంతకంటె మూఢ్యమింకేమున్నది?

శ్లో॥ సోఽహం సర్వగతో భూప లోకసంవ్యవహారతః ।
మయేదముచ్యతే సర్వం త్వయా పుష్టో వ్రజామ్యహమ్ ॥

తా॥ ఓ రాజా! అటువంటి బ్రహ్మభావముగల నేను సర్వత్రనిండియున్నందునను, నాకంటె భిన్నముగ నేదియు లేనందునను, చెప్పువాడొకడు వినువాడు మరియొకడను నది పొసగనే పొసగదు. అంతేగాదు నేనొకచోట ఉండువాడనుగాను. లోకసంగ్రహము కొరకు అంతట తిరుగుచుందును గాన నేను నీకు తెలిపినదానినంతయు గ్రహించి దానిని వృద్ధినొందింపుము.

శ్లో॥ ఏవముక్త్వా యయౌ ధీమాన్సుబాహుః కాశిభూమిపం ।
కాశిరాజోఽపి సంపూజ్య సోఽలర్కం స్వపురం యయౌ ॥

తా॥ ఇట్లు బుద్ధిమంతుడగు సుబాహువు కాశిరాజునుగూర్చి చెప్పి తనదారిని తాను పోయెను. కాశిరాజుగూడ అలర్కుని పూజించి అతని అనుమతినిపొంది రాజధానికి పోయెను.

అలర్కుడు తన కుమారుని రాజ్యాభిషిక్తునిజేసి తపమునకై వనమునకేగుట

శ్లో॥ అలర్కోఽపి సుతం జ్యేష్ఠమభిషిచ్య నరాధిపం ।
వనం జగామ సంత్యక్తసర్వసంగః స్వసిద్ధయే ॥

తా॥ అలర్కమహారాజుగూడ తన పెద్దకుమారుని రాజ్యమునకు రాజుగా నభిషేకించి సర్వసంగపరిత్యాగియై ముక్తిని పొందుటకు వనమునకు పోయెను.

శ్లో॥ తతః కాలేన మహతా నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః ।
ప్రాప్య యోగర్ధిమతులాం పరం నిర్వాణమాప్తవాన్ ॥

తా॥ తరువాత కొంతకాలమునకు అపరిగ్రహవ్రతధారియై ద్వంద్వాతీతావస్థను పొంది సాటిలేని మహత్తర యోగశక్తిగలవాడై పరమనిర్వాణమును పొందెను.

శ్లో॥ పశ్యన్ జగదిదం సర్వం సదేవాసురమానుషం ।
పాశైర్గుణమయైర్బద్ధం వధ్యమానం చ నిత్యశః ॥
పుత్రాదిభ్రాతృపుత్రాది స్వపారక్యాదిభావితైః ।
ఆకృష్యమాణం కరణైర్దుఃఖార్తం భిన్నదర్శనమ్ ॥
అజ్ఞానపంకగర్భస్థమనుద్ధారం మహామతిః ।
ఆత్మానం చ సముత్తీర్ణం గాథామేతామగాయత ॥

తా॥ దేవతలు, రాక్షసులు, మనుష్యులతో గూడుకొన్నదియు (అనగా యీ లోకమునందే ఆయాగుణములచేత పై మూడువిధములవారున్నారని భావము) సత్వరజస్తమము లను మూడుత్రాళ్లతో కట్టబడి ప్రతినిత్యము వధింపబడుచున్నటువంటియు, వీరు తన కొడుకులని, వారు తన సోదరుని బిడ్డలని, ఇతరులు పరసంతానమని స్వపరభావముల చేత వెనుకకు ముందుకు లాగబడుచున్నటువంటియు, విషయములచేత యీడ్వబడి దుఃఖముతో కృంగిపోవుచున్నటువంటియు, ఉన్నది లేనిదిగను లేనిది ఉన్నదిగను చూపించునదియు, అజ్ఞానమనే బురదమధ్యలో కూరుకొనబడినదియు, ఉద్ధరింప శక్యముగాని దియు నగుచున్నది యీ సమస్తజగత్తు. ఇట్టి జగత్తునుండి విడివడి ప్రకృతిసాగరమునుండి సముత్తీర్ణుడైన తన్నుచూచి మహామతిమంతుడగు ఆతడు యిట్లు గానముచేసెను. అనగా సంతోషముతో వికసించిన మనస్సుగలవాడై యిట్లు చెప్పెను.

శ్లో॥ అహో కష్టం యదస్మాభిః పూర్వం రాజ్యమనుష్ఠితం ।

ఇతి పశ్చాన్మయా జ్ఞాతం యోగాన్నాస్తి పరంసుఖమ్ ॥

తా॥ పూర్వము నేను రాజ్యపరిపాలనము చేయునపుడుగల కష్టమును నేనెంతని వర్ణింపను! ఇపుడు నాస్థితిని నేను గుర్తెరింగిన తరువాత యోగముకంటె పరమసుఖము మరియొకటి లేదని తెలుసుకొంటిని.

శ్లో॥ తాతైనం త్వం సమాతిష్ఠ ముక్తయే యోగముత్తమం ।
ప్రాప్స్యసే యేన తద్బ్రహ్మ యత్ర గత్వా న శోచసి ॥

తా॥ అయ్యా! ముక్తికొరకు ఉత్తమమైన యీ యోగవిద్య నభ్యసింపుము. దీని నభ్యసించినచో ఏ స్థానమును పొందిన తరువాత పునరావర్తన ముండదో ఆ స్థానమును పొందగలవు.

శ్లో॥ ఏతత్తే కథితం బ్రహ్మ యత్పృష్టా భవతా వయం ।
సువిస్తరం యథావచ్ఛ కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి ॥

తా॥ నీవు నానుండి దేనిని వినగోరితివో ఆ విషయమును నీకు సువిస్తరముగా చెప్పితిని. ఇంక దేనిని వినవలతువో చెప్పుము.



## ఫలశ్రుతి

శ్లో॥ యశ్చైతచ్ఛృణుయాద్విప్ర పఠేద్వా సుసమాహితః ।
యదశ్వమేధావభృథస్నాతః ప్రాప్నోతి వై ఫలమ్ ॥

తా॥ ఈ చరిత్రమును శ్రద్ధాసక్తులతో యెవడు వినునో, లేక పఠించునో అతడు అశ్వమేధయాగావభృథస్నానము చేసి పొందిన ఫలమును పొందుచున్నాడు.

శ్లో॥ ఏతత్సంసారభ్రమణపరిత్రాణమనుత్తమం ।
అలర్కాత్రేయసంవాదమశుభాన్ముచ్యతే నరః ।
సకలం తదవాప్నోతి శ్రుత్వైతన్మునిసత్తమ ॥

తా॥ సంసారసాగరమునందు పరిభ్రమించువారలను ఉద్ధరించునటువంటి ఉత్తమోత్తమమైన యీ యలర్కాత్రేయసంవాదమును యెవడు భక్తి శ్రద్ధలతో వినునో అతడు సమస్తమును పొందుచున్నాడు. మరియు అశుభములనుండి విడివడి శాశ్వతానందమును పొందుచున్నాడు.

ఇతి శ్రీమార్కండేయమహాపురాణే మదాలసాచరితే-
ఏకచత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీ మార్కండేయమహాపురాణమున నలువదియొకటవ అధ్యాయమునందలి
మదాలసాచరిత్రము సంపూర్ణము.

ఓం తత్ సత్



చిత్తూరు శ్రీ వేదవ్యాసముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.
విళంబివత్సర విజయదశమి : 22-10-1958.